# భారతీయ సంస్కృతి



శ్రీ శ్రీ శ్రీ జగద్గురువర్యులు

కాంచీ కామకోటి పీఠాధీశ్వరులు

**జయేంద్ర సరస్వతీస్వాములవారు**

25—2—73 ఆదివారం ఆశీస్సులందజేయుచు

ఈ భారతీయ సంస్కృతి గ్రంథమును ఆవిష్కరించిరి.

గ్రంథకర్త:

వేద, విద్యా విశారద, విద్వాన్

**షడ్దర్శనం సోమసుందరశర్మ**

శ్రీరాములపేట, ప్రొద్దుటూరు.

వెల: . 5-00



వేద, విద్యా విశారద, విద్వాన్

షడ్దర్శనం సోమసుందరశర్మ

# విజ్ఞాపనము



మానవులు సుఖ సంతోషములతో నీతి నియమములతో ధర్మ బద్ధముగ నిహపర సాధనాత్మకముగ జీవితము జరుపుకొనుట విధి. ఇందు తగిన ధర్మ సాధనాన్వేషణాదులవసరము. ధర్మముల నెఱుంగదగు నది వేదములలోని ధర్మములరీతిని నెఱింగి మెలంగుట యుక్తము. సమస్త ధర్మములు వేదములనుండియే శాస్త్రకారులు గుర్తించి యెఱింగి వివరించియున్నారు. కనుకనే "వేదోఖిలోధర్మమూల"మ్మనియు "వేదాఏవమూ ప్రమాణం ధర్మాఽధర్మయోః" అని ఆపస్తంబాది మహర్షులు వివరించియున్నారు.

కనుకనే ఆదిశంకర భగవానులు "వేదోనిత్యమధీయతాం తదుదితం కర్మస్వనుష్ఠీయతాం" అని నిత్యము వేదభ్యాసము చేయుచుండదగినదనియు నందు నివరించినట్టి కర్మలను అనుష్ఠింపదగినదనియు వచించియున్నారు.

వేదములలో వచించిన కర్మమార్గములనెఱుంగుటకై ఆశ్వలాయన ఆపస్తంబాది మహర్షుల కల్పసూత్రములు బోధాయనాదుల కల్పసూత్రములు గలవు. ఆపస్తంబ సూత్రమునకు సంబంధించినవారు ఆపస్తంబ కల్పసూత్రములలో చెప్పిన రీతిని, వివాహోపనయనాది నలువదినాల్గు సంస్కారముల నాచరించుచుందురు. యీ సంస్కారముల ప్రాముఖ్యమును ఆచరించుటచేగల్గు ఫలములను ఆచరించు విధానములను ఆచరించనివలన యేర్పడు ప్రత్యవాయములను నేటివారికి తెలుగు భాషలో వివరించిన బాగుండునని కార్వేటినగరమున శ్రీ శ్రీ శ్రీ కాంచీ కామకోటి పీఠాధీశులు జగద్గురువర్యుల సందర్శనానికై నేను వెళ్ళియుండ నందుచేరిన పెద్దలు కొందరు సూచించిరి. వారిలో బ్ర॥ శ్రీ కల్లూరు సుబ్రహ్మణ్య దీక్షితులవారు బ్ర॥ శ్రీ కల్లూరు వీరభద్రశాస్త్రిగారు ముఖ్యులు. పెద్దలు సూచనమేరకు నేనీ కార్యమును చేపట్టినా యెఱింగినమేరకు "భారతీయ సంస్కృతి" పేర మొదటి భాగములో కొన్ని సంస్కారములనుగూర్చి వివరించి వ్రాయ గడంగితిని. ఇందలి గుణదోషములను పెద్దలు పరిశీలించి, లోపాలోపములను తెలియజేసిన మరొక ముద్రణమున సవరించుకొనగలవాడను.

యీ రచన లోకమునకు తోడ్పడినచో చేసినకృషి సార్థకమగునని భావన. నాకు యీ సంస్కారముల పైన ప్రీతి యెందు యథాశక్తిని వీనిని యథాశాస్త్రీయముగ నాచరించుచు, ఇతరులను, నాచంపజేయవలయు ననెడి సంకల్పమే నా యీ రచనకు మూలమని నుడివి. శ్రీ శ్రీ శ్రీ జగద్గురువర్యులు కాంచీ కామకోటి పీఠాధీశ్వరులు చంద్రశేఖరేంద్రస్వామి వారి సందర్శన భాగ్యము (జూలై 72) కార్వేటి నగరమున గలుగుటయు. నాతరిని వచ్చి నన్ను ప్రోత్సహించిన పెద్దల ప్రోత్సాహము నా యీ రచనకు ఆధారము.

మఱియు మా వంశీయులు ఆహితాగ్నులు వేద శాస్త్రవేత్తలు, శ్రౌతస్మార్త నిత్య కర్మానుష్ఠాన దీక్షాపరులు. వారి చలువవలన నా వంశమున జనించిన పూర్వఫలము నా కృషికి ఆలంబనము, ఆ పెద్దల వంశానుక్రమణికయు సంతు పొందుబరచితిని. వారిని స్మరించుటయు నా విధిగాన నిందు చేర్చితిని. విజ్ఞులెల్లరు పరిశీలించి. అవసరమైన సవరణలు సూచింతురుగాక యన్న మనవి.



ప్రొద్దుటూరు,
1-5-73.

— వద్దర్నవం సోమసుందరశర్మ.

శ్రీః

శుద్ధస్ఫటిక సంకాశం రమ్య సింహాసన స్థితం।
పద్మయాసహితం దేవం శ్రీ నృసింహం భజామ్యహం॥

యత్కృపాలవమాత్రేణ మూకోభవతి పండితః।
వేదశాస్త్ర శరీరాంతాం, వాణీం వీణాకరాం, భజే॥

గురుబ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః।
గురుసాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః॥

నమోబ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యో
వంశ ఋషిభ్యః, పరమగురుభ్యః సర్వోపప్లవరహితః
ప్రజ్ఞాన ఘనఃప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి
బ్రహ్మైవాహమస్మి ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

వేదే బ్రహ్మా సమస్తదంగనిచయే। గర్గోపమస్తత్కథా।
తాత్పర్యార్థవివేచనే గురుస్తత్కర్మ, సంకీర్తనే।
ఆసీజ్జైమిని రేవ సూత్రనిచయ స్వార్థోపసంవర్ణనే।
వ్యాసేనైవసమస్సశంకర గురుర్జేజీయతాంమానసే॥

ఆసేతు శీతనగ పర్యన్తముగల యీభూభాగమునకు భరతఖండ మనిపేరు. ఈ భరత ఖండమున నివశించు మనము భారతీయులని మన శాస్త్రకారుల వ్యవహారము. పాశ్చాత్యులు మన భరతఖండమునకే హిందూదేశమని చెప్పిరి. మనలను హిందువులనియు వ్యవహరించిరి. కాని హిందూదేశము – హిందువులు, అని వాడుటకన్నా, మన వేదశాస్త్ర ప్రసిద్ధము, మన ఆర్య సంప్రదాయసిద్ధమనదగిన, భారత దేశము. భారతీయులని మనము వ్యవహరించడమే ధర్మము.

మన పూర్వీకులు మొదలు మనము మన సంతతి వారు సహా ఆజీవితము, సుఖసంతోషములకొరకై, ఇహపరసాధనార్థమై, జనన ము మొదలు నడచుకొను నడవడికలకే "ధర్మము" అను పేరుపెట్టిరి. ఈ ధర్మమునకే సనాతన ధర్మమనియు నామాంతరమిడిరి. ఈ సనాతనధర్మము నాచరించు మనకు, "సనాతన ధర్మపరాయణులు" అనియు వ్యవహారమొప్పుచున్నది.

ఈ సనాతనధర్మము వేదములలో వచింపబడినట్టిది, ఈ వేదములను మన పూర్వీకులైన మహర్షులు పరిశోధించి నిగూఢ భావములనుగూడ సుబోధకమగుటకునై, శాస్త్రరూపమున వివరించిరి. ఈ శాస్త్రమునకే ధర్మశాస్త్రములందురు.

ఈ రీతిని వేదధర్మములను శాస్త్రరూపమున మన్వాది మహనీయులు వివరించిరి. యీ మహనీయులు మహాయోగ సమాధిలో ఆయుష్కాలమెల్ల విని యోగించుచు దివ్యజ్ఞానమును దివ్యదృష్టి నార్జించి తమ తపోధనముచే, ధర్మ పారావారమనదగు వేదమును మథించి యందలి సారమును "ధర్మ"మను పేర వివరించిరి, యీ మహనీయులు. ప్రత్యక్ష, అనుమాన, ఆగమము, మొదలైన ప్రమాణములతో నీ ధర్మములను లోకహితార్థమై వివరించిరేగాని హేతువాదనలచేతను, గుడ్డి నమ్మకముల చేతను, మూఢవిశ్వాసముల చేతను, కేవలము ఏదో వ్రాసి తానొక పండితుడుగనో, కవిగనో, నాయకుడుగనో, చలామణియై స్వార్థమును నింపుకొనుటకు వ్రాసిన వ్రాతలు యివి గాదనియు సర్వమానవ శ్రేయముకై వ్రాసిన ధర్మములేగాని వేరుగాదని ప్రతి భారతీయుడు విధిగ నమ్మదగినది. నమ్మునట్లు యితరులను చేయదగినదనియు ప్రతియొక్క సనాతన ధర్మపరాయణుని విధియైయున్నదనియు మరచిపోరాదు,

నేడు మనము కాలకర్మ వశమున మన మహర్షుల వైభవమెల్లఁ గోల్పోయి దరిద్రులవలె నైతిమి. నాటి మన మహర్షుల వైభవమును మాత్రము జెప్పికొని సంతసించువారమైతిమి. ఆ కాలము వార్లకు వీలుండినదనియు యీ కాలమాన పరిస్థితులకు తగినట్లు ఆనాటి ధర్మములనాచరింప వీలులేకున్నదనియు కొందరనువారు లేకపోలేదు. ఇదంత సద్ధేతుకం కాదనిమాత్రం గట్టిగ చెప్పగలను.

ఈనాడు ధర్మవిప్లవమధికముగనున్నది. సార్వత్రికముగ వ్యాపించును చున్న యీ యజ్ఞానాంధకారమును దొలగించు దీపికమునకు ముఖ్యాతి ముఖ్యము. ఎందుకనగా

'కేచిదజ్ఞానతోనష్టాః' తెలియక చెడువారు కొందరు, 'కేచి నష్టాః ప్రమాదతః' తెలిసియుండియు ప్రమాదవశమున చెడువారు మరికొందరు 'కేచిత్ జ్ఞానావలేపేన' కొందరు, తెలిసి తెలియని, అల్పమైన జ్ఞానముచే చెడుచుందురు. 'కేచిన్నష్టాఃవినాశితాః' వేరొకకొందరు, చెడినవారిచే, చెఱుపఁబడు చుందురు. యీ రీతిని అజ్ఞానముచే, ప్రమాదముచే అల్పజ్ఞానముచే, చెడినవారినిచూచి చెడిపోవడము వంటి, దోష చతుష్టయము చెడిపోవుటయే విధిగ యేర్పడుచున్న యీ తరుణమున జ్ఞానులైన పెద్దలెల్లరు, మన సనాతన ధర్మప్రబోధమెంతేని చేయదగు తరుణ మాసన్నమైయున్నది. యీతరుణమున మన విధ్యుక్త ధర్మమే యెఱుంగనేరనిచో మన సంతతివార్లను సహితము ధర్మ భ్రష్టులుగఁజేసినవార్లము కాకపోవు ఇందుకుతోడు పరంపరగా వచ్చు వేద విద్యాభ్యాస మడుగంటుటయు సంస్కృత భాషా పరిచయము సన్నగిల్లుటయు, మహర్షుల దివ్యబోధనలను మహామహిమలను నెఱుగనేరకయు తటస్థించుచున్నది.

నిరుక్తములో చెప్పినరీతిని "సాక్షాత్కృతధర్మాణ ఋషయో బభూవుః అనునట్లు మన పూర్వీకులెల్లరు దర్మవేత్తలైన మహర్షులు, యీ

మహనీయులు మన హితార్థమై, వేద వేదాంగములను సంపాదించి మనకు వంశ పరంపరగా ననుభవించు ధనముగ నొసంగియున్నారు. యీ విషయమునుగూర్చి యే నిరుక్తముననూ గలదు. "తేఽవరేభ్యోఽసాక్షాత్కృత ధర్మభ్య, ఉపదేశేన మంత్రాన్ సంప్రాదుః, ఉపదేశాయ గ్లాయంతోఽవరే బిల్మగ్రహణాయేమం గ్రంథం సమామ్నాసిషుర్వేదంచ వేదాంగానిచ" అని నిరుక్తమున, ౧౬,౨ లో యాస్కమహర్షి వచించిన అమృత వాక్కులివి.

ఇట్టి యాచారధర్మాదులు కాలకర్మ వశమున పట్టుదప్పి కాపుదల లేకయాపుచెడి నశించుచున్నవి. సాత్వికస్ఫూర్తులు తొణికిసలాడు, ఆర్యసంతతియొక్క వర్చస్సేమాఱి పోవుచున్నది. చిత్తైకాగ్రతయు శరీర దార్ఢ్యము లేక బుద్ధి వికాసము సన్నగిల్లి యీ దురవస్థకు దిగజాఱువారమగుచున్నాము. యీ దోషనివారణమునకు కొకటే యొకమార్గమున్నది. సాధన సంపత్తి నెఱింగి వేదశాస్త్ర విహితంబైన మార్గమున జరింతుమేని మన కసాధ్యమెద్దియు లేదు చిత్తైకాగ్రము, ఆహారవిహార నియమము, ప్రాణాయామాభ్యాసము. వేద శాస్త్రములు నేర్చుట స్వధర్మానుష్ఠానముచే నీదుర్గతిని తొలగింపజేసికొనగలము.

మన వేదశాస్త్ర విహితమైన ధర్మాచరణముచే చిత్తమాలిన్యము తొలంగును, చిత్తసంస్కారమగు కొలది ధర్మాచరణము ప్రబలును తద్వారా జ్ఞాన వికాసాదులు గలుగగలవు.

అందుచేతనే 'వేదోదితం స్వకంకర్మ నిత్యం కుర్యా దతంద్రితః తద్ధికుర్వన్ యధాశక్తి ప్రాప్నోతి పరమాంగతి మే అని వ్యాసభగవానులు, వైదిక సాంప్రదాయ సిద్ధమైన, కర్మాచరణము ముఖ్యాతి ముఖ్యమని వచించెను.

ఈ వేదోదితమైన కర్మాచరణముద్వారా "పరమాంగతిం" పొందనర్హు లగుదురని వ్యాసభగవానుల లోకహిత వచనములను బలపరుచుటకై ఆదిశంకర, భగవత్పూజ్య పాదులు సహితము: 'వేదో నిత్యమధీయ తాం తదుదితం కర్మస్వనుష్ఠీయతాం॥ అని, వేదాధ్యయనము వేదమున చెప్పిన కర్మానుష్ఠానము, ముఖ్యాతి ముఖ్యమని వచించెను. ఇన్ని తెలిసినను యిప్పుడు మనవల్ల నేమగునులే! యనిగాని, ఎవరో పండితులైనవారే యీ వైదిక కర్మానుష్ఠాన మాచరింపదగిన దనిగాని ఉదాసీనులు కాబడరాదు

అనుగన్తుం సతాంవర్త్మ కృత్స్నంయది నశక్యతే

స్వల్పమప్యనుగన్తవ్యం మార్గస్థో నావసీదతి॥ అను నానుడి చొప్పున వేదచోదితములైన కర్మలను సంపూర్ణముగా నాచరింప శక్తి లేకపోయినను యథాశక్తి నేని ననుసరింప దగును. దారిని వెళ్ళువాడే నాటికేని పడిపోడుగదా!

"వేదో నారాయణః సాక్షాత్, తదభ్యాసీ మహాభవేత్' అని హేమాద్రియను, యాదవరాజ మహామంత్రి తన ధర్మశాస్త్రమున వేద ప్రాముఖ్యమును గూర్చి వచించెను వేదాభ్యాసము చేయువారు మహనీయులని వాకొనెను. కనుకనే, ఆరణ్యకశ్రుతిలో 'బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివేదివే నమస్కుర్యాత్'' అని గలదు. వెదవేత్తలైన బ్రాహ్మణులను చూచినచో ప్రతిదినము నమస్కరింపుమని పై వేదవాక్యమునకు భావము.

కనుకనే ''వేదోఖిలంధర్మమూలమ్'' సమస్త ధర్మములకు వేదమే మూలమందురు. "ధర్మమూలంవేదమాహుః" అనియు పై విషయమును గూర్చి మరియొక మహనీయుడంగీకరించెను. ఆపస్తంబ మహర్షిపుంగవుడు పైయిరువురి మహాత్ముల భావాలను గూర్చి వివరించుచు ''ధర్మజ్ఞసమయః ప్రమాణం వేదాశ్చేతి" యని వచించెను. ''వేదమూలాః స్మృతయః'' యని శంభుడను ఋషీశ్వరుని వచనము.

అందుచేతనే 'శ్రుతింపశ్యన్తిమునయఃస్మరన్తిచ తథాస్మృతిం। తస్మాత్ ప్రమాణముభయం ప్రమాణైఃప్రమితంభువి అని నుడివిరి, మహర్షులు వేదములలోని ధర్మములను స్మరించిరి. ఆ స్మరించిన ధర్మములను 'స్మృతులు' అనుపేర వ్రాసిరి. కాన యీ వేదములనదగిన శ్రుతులును, శ్రుతులలో ధర్మములను స్మరించి వ్రాసిన స్మృతులును రెండు లోకమానమనవంటి మానవ సామాన్యమునకు ప్రమాణభూతములైనవి యనినిర్ణయించిరి.

కాన "పరిమాణాని, ప్రమాణజ్ఞైః పరిపాల్యానియత్నతః। సీదన్తిహి ప్రమాణాని పరిమాణైః అవ్యవస్థితైః అను రీతిని వేదశాస్త్రముల రెంటిని ప్రయత్నముచేతనైన రక్షించుచుండదగినది. రక్షించడమనగా నందలి ధర్మములను యథాశక్తిని ఆచరించుటయే రక్షణమునకు చరితార్థము

ధర్మంశ్శనైఃసంచినుయాత్, వల్మీకమివవర్త్తికా।
పరలోకసహాయార్థం, సర్వభూతాన్యపీడయన్.

ఈ వేదశాస్త్రములలో చెప్పిన సనాతన దర్మములను మనము యథాశక్తిని ఆచరించుచుండదగినది. ఎట్లనగా చీమలు పుట్టను పెంచులాగున ధర్మవృద్ధిచే మానవునకు కల్గు ఫలములు రెండు. ఒకటి ఈ లోకమున సర్వులకు బాధను కలిగించనట్టి సుఖజీవనము మరొకటి పరలోకమున సుఖసంతోషములు బడయు సాధన సంపత్తికి కారణము గాగలదు. అందుచేతనే "ధర్మేణహి సహాయేన తమస్తరతిదుస్తరమ్।" అనిరి. ఎంతటి దుస్తరమైన బాధనుంచియేనియు ధర్మముయొక్క సహాయముతో తరింపగల్గుమందురు.

కనుక వైదిక ధర్మమునుగూర్చి మన పెద్దలంతగా నాచరించుచు నాచరింపజేయ విధిగ ప్రయత్నించుచు వచ్చిరి. ఎందుకనగా "ప్రధానం వైదికం కర్మ గుణభూతం తథేతరత్। గుణనిష్ఠః ప్రధానంతు, హిత్వా గచ్ఛత్యధోగతిమ్" అనియనిరి. వేద ధర్మ ప్రోక్తమైన కర్మాచరణము తుచ్ఛమని మానివేసినచో అధోగతిపాలగుదురే కాని వేరు గతే లేదు. అందుచేతనే

"యో వైదికమనాదృత్యకర్మ. స్మార్తాదికం నరః।
మోహాత్సమాచరే ద్విప్రో నసపుణ్యేన యుజ్యతే॥"

ఎవరైతే, వేదమార్గ ప్రతిపాదితమైన కర్మలను వదలివేసి అనగా ఆచరించక మాని, అన్యములైన వానిని యాచరింప చూచినచో పుణ్య గతులు లేవనిరి.

శ్రౌతం కర్మన చేచ్ఛక్తః కర్తుం స్మార్తం సమాచరేత్।
తత్రాప్యశక్తః కరణేకుర్యాత్ ఆచారమంతతః॥

శ్రౌతసంబంధమైన యజ్ఞయాగాదులు చేయుటముఖ్యము, అట్లు చేయ శక్తిహీనులైనచో, స్మృతికర్మలనేని యాచరింపవలెనుననిరి. ఇవియు చేయనొల్లనిచో ఆచారవంతుడుగనేని మెలంగుచుండవలయుననిరి. శ్రౌత స్మార్త నిత్య కర్మానుష్ఠానములెల్లయు మూఢప్రాయముగ నాచరింపక, వానియొక్క యర్థము నెఱింగి యాచరించినచో ఫలాధిక్యము నొందు కాన

"జ్ఞాన యుక్తస్వకర్మణః ఫలాధిక్యం, ఛందోగాః ఆమనన్తి అను నానుడి చొప్పున, వేదశాస్త్ర సంబంధమైన సంధ్యా వందనాది కర్మలెల్లయు, కాలము - ఫలము అర్థము తెలిసికొని ఆచరించువెడల ఫలాధిక్యముగలదని పెద్దల తలంపు, ఈ యర్థమే "యదేవ విద్యయాకరోతి

తదేవ వీర్యవత్తరంభవతి" అని పెద్దలు పై శాస్త్రి భావాలకు ప్రమాణముగ నీవేద శ్రుతిని ప్రమాణముగ భావించుచుందురు.

దీనివలన తేలిన సారాంశమేమనగా మానవుడు ఇహపర సాధనార్థమై వైదిక కర్మలాచరించుట విధియనియు, అందులోను, అర్థము తెలిసికొని యాచరించు నెడల ఫలము మెండనియు తేటతెల్లము. అందుచేతనే

"యజ్ఞానాం తపసాంచైవ శుభానాంచైవ కర్మణాం।
వేదఏవద్విజాతీనాం నిశ్శ్రేయ సకరః పరః॥

యజ్ఞానాం - శ్రౌతస్మార్తానాం, తపసాం - కాయసన్తాప రూపాణాం చాంద్రాయణాదీనాం, శుభానాంచ కర్మణాం - ఉపనయనాపి సంస్కారాణాం, అవబోధకత్వేన. వేద ఏవ ద్విజాతీనాం పరమో - నిశ్శ్రేయ సకరో మోక్షకరోనాన్యః, వేదఏవేతి తన్మూలత్వేన స్మృతేః అపిఉపలక్షణార్థం "అను వాఖ్యరీతిని" శ్రౌతస్మార్తకర్మలకును చాంద్రాయణాది తపస్సులకును, వేదమే ప్రధానము. ఆరీతిని స్మృతులును పదమ ప్రమాణములుగ నొప్పుచుండును.

తపసశ్చ పరస్యైహ నిత్య స్వాధాయవాన్ ద్విజః నిత్యము వెదాభ్యాస మొనర్చుచుండు నెడల నదియే తపస్సుగ ప్రకాశించగలదు. కాన "పరస్యచ తపసః చాంద్రాయణాద్దేః, యత్ఫలం తదపి నిత్య స్వాధ్యాయ వానాప్నోతి" అనవరతము వేదాభ్యాస మొనర్చుచుండునేల, చాంద్రీయణాది తపములచే గల్గు ఫలమెల్ల వేదము పఠించు విప్రునకుఁ గలుగగలదు.

మఱియు వేదశాస్త్రములయొక్క యాధిక్యమునుగూర్చి యోగశాశిష్ఠమున నీరీతి నుగ్గడింపబడియున్నది.

"యదాస్మాత్ప్రాప్యతే శాస్త్రాత్ తత్రత్వేదాదవాప్యతే.
అస్మిన్ జ్ఞాతే క్రియం జ్ఞానం ద్వయం యాతిపవిత్రతాం శాస్త్రము చేనెద్ది యెఱుంగదగునో దానినే వేదముచేతను నెఱుంగదగును. కాన వేదశాస్త్రములు రెండు ప్రమాణములు. కనుకనే

"దృఢ బద్ధ ధర్మమూలః, వేదస్కంధః పురాణ శాఖాఢ్యః
క్రతుకుసుమః మోక్షఫలః మధుసూదన పాదపః. జయంతి"

అని ధర్మము మూలము, వేదము స్కంధము, పురాణములు, శాఖలు, యాగములు. పుష్పములు, మోక్షము ఫలము పరమేశ్వరుడు, యీవృక్షము నకు వేఱకంటివాడు గాన జయమగుగాక యందురు. అనగా వేద కార్యములచే నొందు ఫలముచే విజయము లభించుగాక యని భావము.

కొందరు కర్మతుచ్ఛము జ్ఞానముమిన్న యను భావముచే కర్మమార్గ ప్రవర్తకులు గాక భ్రష్టులగుచుందురు. అట్టిభావము కలుగకుండుటకై యోగవాశిష్ఠమున

"మోక్షస్య కారణంకర్మ? జ్ఞానంవా? మోక్షసాధనము
భయంవా? వినిశ్చిత్యై ఏకం కథయ కారణమ్". అను ప్రశ్నకు
"ఉభాభ్యామేవ పక్షాభ్యాం, యథా, ఖే. పక్షిణాంగతిః
తథైవ జ్ఞానకర్మాభ్యాం జాయతే పరమంపదయ్,

అని మోక్షమునకు కర్మ కారణమా? లేక జ్ఞానం కారణమా? రెండు కారణములేనా? యని యడుగగా, పక్షి యాకసమున యెగురుట కెట్లు రెండు రెక్కలు ముఖ్యమో నారీతిని మోక్షపదము చూఱగొనుటకు గూడ వేదబోధితములైనకర్మజ్ఞానములు రెండు ముఖ్యములని నిర్ణయించిరి, కాన కర్మాచరణము యత్యంతావశ్యము.

ఈకర్మజ్ఞానములురెండు యనవసరములే మరియు నీరీతిని వచించిరి.

కేవలాత్ కర్మణో జ్ఞానాన్నపి మోక్షోభిజాయతే కిన్తూ
తాభ్యాం భవేన్మోక్షం సాధనం తూభయంవిదుః

కేవలము కర్మ కారణముకాదు. కేవలము జ్ఞానము మోక్షమునకు కారణములు కాజాలదు కర్మజ్ఞానములు రెండూ మోక్షమునకు కారణ భూతములు గాన వేద సంబంధమైన కర్మజ్ఞానములు రెండు ప్రధానము లగుచున్నవి.

ఇందుకై యోగ వాశిష్ఠమున నొక యుపాఖ్యానముగలదు. కాని యీ కథయంతయు వివరించుచడందనవసరము, అవసరమున్నచో నందు విపులముగ చూడనగును. సంక్షేపముగ మాత్రము వచింతును.

అగ్నివేశ్యుడని యొక మహార్షిగలడు. అతనికి కారుణ్యుడనియెడి పుత్రుడు గలడు ఈ కారుణ్యుడు, ఉపనయనానంతరము విద్యాభ్యాస మునకై వెళ్ళి, వేదశాస్త్రములనెల్ల పఠించి యింటికివచ్చెను. అనవరతము జ్ఞానమే ముఖ్యాతి ముఖ్యమని భావించి కర్మాచరణముమాని మెలంగు చుండెను.

ఈ కుమారుని ప్రవర్తనము తండ్రి గుర్తించినవాడై నిటు ప్రశ్నించెను.

"కిమేతత్ పుత్రకుకుషేపాలనంనస్వకర్మణః"

నీ వెందుకీరీతిని నిత్య కర్మానుష్ఠానమును పాలించుటలేదు?

"అకర్మనిరతః కథం సిద్ధింప్రాప్స్యసితద్వద।"

కర్మాచరణములేనిది సిద్ధిని నీవెట్లు పొందగలవు? అనగా దైవసంబంధ మైన శక్తిని (సిద్ధి) నీవెట్లు పొందగలవు?

"కర్మణోస్మాన్నివృత్తేః కింకారణం తన్ని వేద్యతాం"

కర్మాచరణము మానినందులకుగల కారణమును వచింపు? మని ప్రశ్నించెను.

ఎందుకనగా "యావజ్జీవమగ్నిహోత్రం। నిత్యం సంధ్యాముపాసయేత్।
ప్రవృత్తిరూపో ధర్మోయం। శ్రుత్యాస్మృత్యాచ చోదితః॥

అను ధర్మానుసారము జీవితపర్యంతము, ఔపాసనము, నిత్యము సంధ్యా వందనము వదలక యాచరింపదగిన ప్రవృత్తిరూపమందగిన ధర్మమయ్యది వేదశాస్త్రములచే నిర్ణయింపబడిన విధులుగదా! వీనిని నీవెట్లు వదలి వేయగల్గితివో వచింపుమని వేడగ పుత్రుడైన కారుణ్యుడు నిరుత్తరుడై తండ్రి యాజ్ఞచే కర్మాచరణమునకు పూనుకొని సిద్ధిని బడసినట్లుగలదు. ఈ యుపాఖ్యానముచే తెలిసిన సారాంశమేమనగా తాము తొలుత కర్మాచరణమునకు పూనుకొనియుండి బిడ్డలకు నహా వేదశాస్త్రసిద్ధము లైన కర్మజ్ఞాన మార్గములు ప్రబోధించుటకు తగిన యర్హత సంపాదించు కొని యుండడమవసరము. కానీ నేడు తండ్రులకు తొలుత తెలియదు, బిడ్డలకు యీ వేదశాస్త్ర జ్ఞానముయొక్క యావశ్యకతను గూర్చి బోధించుదామనే తలంపేని తలంపరు. ఈ రీతిని దుస్థితికివచ్చి కర్మ భ్రష్టులుగ మారుచుండుట మిక్కిలి శోచనీయము.

మనము కర్మాచరణము చేయకున్ననూ మన సంతతియేని కర్మజ్ఞానములను సాధించి వంశోద్ధారకులు కావలయునను తలంపు గలుగవలయును. ఎందుకనగా,

"కాలే కాలే పృథక్ బ్రహ్మన్ భూరివీర్య విభూతయః।
భూతేష్వభ్యుదయం యాన్తి. ప్రతీయన్తేచ కాలతః॥

అను ధర్మానుసారము బల సంపదలు ఒక్కొక్క కాలమున ఒక్కొక్కని యందు వికసించి వృద్ధిపొంది లీనమగుచుండునుగాన, ఎవని యదృష్టవశమున నేరితినేని వేదశాస్త్ర జ్ఞానబలముచే కర్మాచరణమాచరించి, యితరులకు మార్గదర్శకుడై రాణించెడి సంపదచే దైవబలమున నెవరి యందెట్లుండునో? గదా! కాన మనమాచరింపలేకపోయిననూ నిజ తాన్నోహాబడక బిడ్డల నేని యుత్తమ కర్మిష్ఠులుగ తీర్చవలసిన ధర్మము ప్రతి తల్లి దండ్రులందును విధిగ నున్నదని విస్మరించరాదు.

"జయత్యధిక యత్నవాన్" అను నానుడి చొప్పున యెక్కువగా ప్రయత్నించవలెనది జయము సాధించగల్గుటకు వీలగును. అందుచేతనే "సర్వేణ పౌరుషాణీ సమవాప్యతే" యనియందురు. పురుష ప్రయత్నముచే సర్వమూ సాధింపబడుచుండును. పురుషప్రయత్నమైన కర్మ రెండు విధములుగ నుండునందురు. "ద్వివిధం విద్ధిపౌరుషం" ఈ రెండువిధములైన కర్మలనదగినవి పురుష ప్రయత్నమునకే "ప్రాక్తనం చైహికం చేతి" అని. ప్రాక్తనకర్మ, వైహిక, కర్మయని రెండు విధములు, ప్రాక్తన కర్మకే, అదృష్టమనియు నామాంతరము. ఈ యదృష్టప్రాప్తి సాధనకే, కర్మాచరణము ముఖ్యమందురు. ఈ కర్మాచరణమునకై మెలంగు విధికే "సదాచార" మని నామాంతరము.

"యస్తూదార చమత్కారః సదాచార విహారవాన్।
సనిర్యాతి జగన్మోహాత్, మృగేంద్రః పంజరాదివ॥

అనునానుడి చొప్పున. చతురుడైన సదాచార కుశలుడు, ఈ లోక మోహమను బోను నుండి సింహము బోనులోనుండి వెలువడి వచ్చు లాగున మోహమునుండి వెలువడగలడు.

"శాస్త్రైః సదాచార విజృంభిత దేశధర్మైః।
యత్కల్పితం ఫలమతీవ చిరప్రరూఢం।
తస్మిన్ హృది స్ఫురతి చోపన మేతి చిత్త।
మంగావళీ తదను పౌరుష మేత దాహుః॥

అనునట్లు మానవుని చిత్తశుద్ధి, జ్ఞానము, వేదాది శాస్త్రముల వలననూ సత్పురుషుల ఆచారాదుల వలననూ, స్వధర్మానుష్ఠానము వలననూ, సత్ఫలవిద్ధికై, మనస్సున. ఉపాయ రూపమున స్ఫురింపజేయును, ఈ సత్ఫలమును పొందవలయుననెడి వాంఛయే, పిదప కార్యరూపమున మానవుడుపయోగించును, ఈ కార్యరూపమున మెలంగుటకే "పౌరుషమని" పెద్దలు చెప్పుదురు. కాన తన చేతగాలేదే! యని నిరుత్సాహబడక తన సంతతివారికి సాధింపదగు రీతిని సత్కర్మాచరణమునకై దోహద మొసంగుట విధియై యున్నది. ఎందుకనగా

పుత్రేణ లోకాన్ జయతి పౌత్రేణా నంత్యమశ్నుతే।
అథ పుత్రస్య పౌత్రేణ నాకమే వాధిరోహతి॥

యను ధర్మము ప్రకారను ధర్మబద్ధమైన పుత్రునిచే లోకములు జయింపవచ్చును, ధర్మబద్ధమైన పౌత్రునిచే సమస్తము బడయవచ్చును, కాన పుత్రపౌత్రులు ధర్మవంతులై సత్కర్మానుష్ఠాన ధురీణులై యున్నచో ఇహాపర సుఖములెల్లయు పొందననువగును గాన,

సప్తపరాన్ సప్తపూర్వాన్ షడన్యాన్ ఆత్మసప్తమాన్
సత్పుత్ర మధిగచ్ఛానః తారయేదేనసో భయాత్ ।

సత్పుత్ర జననముచే తనకు మునుపుండిన యేడ్గురి తరింపజేయును. అనంతర మేడ్గురిని తరింపజేయగలడు గాన సత్పుత్ర జననమవసర మందురు.

ఈ సత్పుత్రి జననమునకుగాను, వైదిక కర్మానుష్ఠానమున. పుంసవన సీమంత జాతకర్మ నామకరణాది సంస్కారములు విధిగ జేయవలయు నని సూత్రకారులు నిర్ణయించి యున్నారు.

ఈశ్వర సాన్నిధ్య ప్రాప్తికిగాను మన పూర్వీకులైన వేద వేత్తలగు మహర్షులు నలుబది సంస్కారములను, ఎనిమిది ఆత్మగుణములను యేర్పరచి యున్నారు. ఇవి యన్నియు స్మృతిరూపాలనియు పెద్దలందురు. స్మృతులు యిరువదియెనిమిది గలవు. ఇందులో పదునెనిమిది ముఖ్యములు మిగిలిన పదియు యుపస్మృతులందురు. మనువు, యాజ్ఞవల్క్యులు, హారీతులు, పరాశరులు మొదలైన మహనీయులీ స్మృతికర్తలు.

ఈ స్మృతులను శృతులను పరిశీలించి ఆపస్తంబమహర్షి, ఆశ్వలాయన మహర్షి, బౌధాయన మహర్షి, మొదలైన వేద వేత్తలు సూత్రములను రచించిరి. వీనికే ఆపస్తంబ మహర్షి సూత్రము. ఆశ్వలాయన మహర్షి సూత్రము. బౌధాయన మహర్షి సూత్రము అని వ్యవహరించుచుందురు.

ఈ సూత్రముల సహాయమున వేదమంత్రములను మన మెట్లు యేయే కార్యములకు వినియోగించుకొనునది తెలిసికొనగల్గు చున్నాము యీ వైదిక కార్యములకే "సంస్కారముల" నెడి నామాంతరము గలదు ఈ సంస్కారములు నలుబది.

"సంస్క్రియతే జ్ఞానయోగ్యతాం ఆపద్యతే పురుషస్య చిత్తం అనేనేతి సంస్కారహః" అను వ్యుత్పత్తి ననుసరించి, మానవుని మనస్సు బ్రహ్మజ్ఞానమును బొందుటకు యోగ్యముగురీతిని సంస్కరింపబడును గాన "సంస్కార" మని వ్యవహారము. యీ చత్వారింశత్సంస్కారములచే గల్గు ఫలమేమనగా

"చత్వారింశత్సంస్కారా, అష్టావాత్మ గుణాశ్చ
సబ్రహ్మణస్సాయుజ్యం సాలోక్యంచ గచ్ఛతి"

"యస్యైఖలు సంస్కారాణాం ఏక దేశోపి, అథాఽష్టావాత్మ గుణా యది సబ్రహ్మణః సాయుజ్యం సలోకతాంచ గచ్ఛతి" అను గౌతమ ధర్మ సూత్రములో (౮. ౧౪. ౨౪) చెప్పిన రీతిని ఎవడీ నలువది సంస్కారములు గలిగి ఎనిమిది ఆత్మగుణములు గలిగియుండునో నట్టివాడు బ్రహ్మలోకమునుబొంది బ్రహ్మసాయుజ్యము నందగలడు.

ఒక వేళ నలువది సంస్కారములను సంపూర్ణముగ బొందక బోయిననూ. కొన్నింటినేని పొందియుంటి, ఆత్మగుణాష్టకముతో కూడియున్నచో అట్టివాడు సహితము బ్రహ్మసాయుజ్య పదవి నందగలడు.

"సచ సంస్కారః శ్రవణాదేసతి జ్ఞానే ఉపకరోతి" ఈ సంస్కారములు. వేదాన్త విషయకమైన, శ్రవణ మనన నిధిధ్యాసాదులు గలిగినప్పుడు. మానవునకు జ్ఞాన విషయమున నుపకరించగలవు,

పందొమ్మిది సంస్కారములకు "బ్రహ్మ సంస్కారములందురు. ఎనిమిదింటిని "పితృకర్తృకములందురు. నాలుగింటిని అచార్య కర్తృకములని పేరు. ఏడింటిని స్వకర్తృకములని వ్యవహారము ఇరువదొకటికి దైవ సంస్కారములు. అనియు నందురు, దయాదాక్షిణ్యాది యెనిమిదింటిని ఆత్మగుణములందురు. వీని వివరణము సవివరముగ నిందు పరిశీలించెదను పరికింతురు గాక:—

పితృకర్తృకములన దగిన యెనిమిది సంస్కారము లెవ్వియన, గర్భాధాన, పుంసవన, సీమంతోన్నయన, జాతకర్మ నామకరణాన్న

ప్రాశ చౌలోపనయనములనదగిన యెనిమిది సంస్కారములు బాలునికి గాను తండ్రి జేయదగిన సంస్కారములు.

ప్రాజాపత్య, సౌమ్య, ఆగ్నేయ, వైశ్వదేవములనదగు నాలుగింటిని ఆచార్య కర్తృకములు అనగా సంస్కారములు చేయించు, గురువు (పురోహితుడు) చేయదగినవి వీనినే "వేదవ్రతములనియు నామాంతరముగ వ్యవహారమున్నది.

సమావర్తన, సహధర్మచారిణీ సంయోగ, దేవ, పితృభూత, మనుష్య బ్రహ్మ యజ్ఞాదులున్ను చేరి యేడింటిని తానే స్వయముగ చేయదగిన సంస్కార సప్తకము.

అష్టక, పార్వణ, శ్రాద్ధ, శ్రావణీ. ఆగ్రహాయణీ, చైత్రి ఆశ్వయుజీ, అగ్న్యాధేయం. అగ్నిహోత్రం, దర్శ పూర్ణమాస. చాతుర్మాస్యాని. ఆగ్రయణేష్టి. నిరూఢపశుబంధ సౌత్రామణీ, అగ్నిష్టోమ, అత్యగ్నిష్టోమ. ఉక్థ్యన. షోడశీ వాజపేయ, అతిరాత్రి. అప్తోర్యామ. నామక ఏకవింశతి సంస్కారములు దైవ సంస్కారములు అని యందురు.

దయా, క్షాన్త్యనసూయా శౌచానాయాస మాంగల్యాకార్పణ్యాస్పృహాదులనదగు నెనిమిది గుణములు ఆత్మగుణములని పేరు. ఈ నలువది సంస్కారములు, ఎనిమిది ఆత్మగుణములు కలిసి, అష్టాచత్వారింశత్సంస్కారములని సంస్కారుల నిర్ణయము.

(శ్రీ)(శ్రీ)(శ్రీ) జగద్గురు వర్యులు కాంచీ కామకోటి పీఠాధీశ్వరులు చంద్రశేఖరేంద్ర గురువర్యులొకచోట నీ సంస్కారముల ప్రాముఖ్యమునుగూర్చి వచించు నిట్లనిరి, "కర్మ" అంటే యేమిటి? పని. ఒకబట్ట తయారుకావాలంటే, పూర్వాంగంగా ఎన్నో పనులు చేయాలి, అట్ల

ఒకడు ఆత్మవేత్త కావాలంటే యెన్నో పనులు చేయాలి. గుణకర్మలతో నీ పనులు చేయాలి. ఈ పనులకే "సంస్కారములని పేరు,

ఒక పదార్థనికున్న దోషం పోగొట్టి దానిని గుణవంతంచేసేది సంస్కారం. జీవాత్మకున్న దోషాలను పోగొట్టి గుణపూర్ణం చేయడానికేర్పడిన కార్యాలే సంస్కారాలు.

యీ సంస్కారములలో మొదటిది "గర్భాదానము। "గర్భః ఆధీయతే యేననిషిక్తం వీర్యం అమోఘం భవతి తద్గర్భాధానం." అను వర్ధముప్రకారము అమోఘమైన వీర్యముచే గర్భము ధరింపబడు సంస్కారముగాన గర్భాగానమందురు దీనినే "నిషేకః యనియువ్యవహరింతురు. "నిషేకాత్ బైజికం, చైనోగార్భికంచాప మృజ్యతే" యనగా ఈ సంస్కారముచే బీజదోషము గర్భదోషము శాంతించునుగాన నిషేకమనియు నందురు. బీజదోష శాంతి, గర్భదోష శాంతికిగాను చేయు సంస్కారమయ్యాది తొలుత జన్మమెట్లు కలుగునది యెఱుంగుట యవసరము.

"పుణ్యైః దేవత్వమాప్నోతి. పాపైస్థావరతామియాత్।

సమాభ్యాం పుణ్యపాపాభ్యాం మానుష్యం ప్రాప్నుయాన్నరః॥

అను సూతసంహిత వచనము ప్రకారము పుణ్యముచె దైవత్వము పాపత్వముచే. నీచప్రుడన్మ. పుణ్యపాప మిశ్రముచే మనుష్యత్వము లభించును. ఈ వచనమునకు తగిన వేదవాక్యమిట్లుగలదు "(పుణ్యైర్దేవత్వా క్షితిపుణ్యేన పుణ్యం లోకంజయతి, పాపేన పాపం, ఉభాభ్యామేన మనుష్యలోకం ఇతి శ్రుతిః)

సూర్యాద్వృష్టిః, వృష్టేః ఓషధయః, ఓషధీభ్యోన్నం।

అన్నపానంచ నిత్యం భుంక్తేచ మానవః। పంచభూతాత్మకం।

భుక్తం. అష్ట సారాత్మనాద్విధా।
సూర్యుని వలన వర్షము. వర్షమువలన పంటలు. పంటలవలన ధాన్యము (అన్న పదార్థములు) అన్నపానములను మానవుడు గ్రహించుటచే యెనిమిది విధములైన ధాతువులు శరీరమున వృద్ధియగుచుండును.

ఈ యష్టధాతువులు "కిట్టం పురీషం మూత్రాస్థి మేదోమజ్జాత్మనా భవేత్ యనురీతిని "శుక్ల శోణిత. పురీష మూత్రములు. ఎముకలు మేధస్సు మజ్జధాతువు" అనునవి శరీరమున వృద్ధినొందును.

"అగ్నినావర్ధతే మజ్జా" అనురీతిని "మజ్జాధాతువు అగ్నివల్ల వృద్ధిపొందును. "లోహితంవర్ధతే జలాత్" జలతత్వముచే "లోహితధాతువు వృద్ధిపొందును. "భూవామాంసస్య వృద్ధిస్యాత్" భూతత్మముచే మాంసము వృద్ధిపొందును.

ఆకాశాద్ధాతవః సర్వేవర్ధంతే, వాయునాబలమ్" అను రీతిని ధాతువులన్నియు వాయుతత్వముచే, ఆకాశతత్వముచేతను. వృద్ధిపొందును,

"శుక్ల శోణిత సంయుక్తం కలిలం బుద్బుదంతథా" స్త్రీ పురుష సంయోగముచే నేర్పడు శుక్లశోణితములచే ఏకరాత్రోషితం కలిలం" అనునట్లు "కలిలం" అను పేర చేరియుండును.

సప్తరాత్రోషితం బుద్బుం భవతి" ఏడు దినములు స్త్రీ గర్భమున బుద్బుదాకారమున (నురుగుగ) నుండును

"అర్ధమాసాభ్యన్తరే పిండోభవతి" పదునేను దినములకు పిండాకారము వహించును.

మాసాభ్యన్తరేణ కఠినోభవతి" ఒకనెలకే పిండము గట్టిబడును,

"మాసద్వయేన శిరః కురుతే" రెండు నెలలకు శిరస్సు మొలచును.

మాసత్రయేణ పాదప్రదేశోభవతి" మూడు నెలలకు పాదములు మొలచును.

"చతుర్థేమాసి, అంగులి, జఠర, కటిప్రదేశా భవన్తి"
నాలుగవ మాసమున, వ్రేళ్ళు, కడుపు, నడుము యేర్పడును.

పంచమేమాసి పృష్ఠ వంశోభవతి. అయిదవ నెలలో వెన్నెముక యేర్పడును

షష్ఠేమాసి, నాసాక్షిణి శ్రోత్రాణిభవన్తి" ఆరవ నెలలో ముక్కు చెవులు, కండ్లు యేర్పడును.

"సప్తమేమాసి జీవేన సంయుక్తోభవతి" ఏడవ నెలలో జీవుడు ప్రవేశించును.

"అష్టమేమాసి సర్వాంగసంపన్నోభవతి" ఎనిమిదవ నెలలోసర్వావయవములు యేర్పడును.

నవమేమాసి సర్వలక్షణ సంపూర్ణోభవతి" తొమ్మిదవ నెలలో సర్వలక్షణ లక్షితమైన యాకారముతో శిశువుగ మారును.

ఈ రీతిని యెనమిదవ మాసంనుంచే గర్భస్థ శిశువు పూర్వజ్ఞాన విశేషముచే "పూర్వజాతిం స్మరతీ,తి, కృతాఽకృతంచకర్మ భవతి, శుభాశుభం చకర్మ విందతీతి గర్భోపనిషత్" అను గర్భోపనిషత్తులో చెప్పినరీతిని శిశువు గర్భమున పూర్వజ్ఞాన బలముచే, నానా యోనులలో జన్మించిన తెరంగు, పూర్వజాతి, మంచి చెడులను, చేయదగిన కార్యములు చేయరాని, కార్యములు స్మరించుచుండును.

"నానాయోని సహస్రాణి దృష్ట్వా చైవతతోమయా"
ఆహారాః వివిధాభుక్తాః పీతా నానావిధాస్తనాః
జాతస్యైవమృతస్యైవ జన్మ చైవపునః పునః
అహోదుఃఖోదధేమగ్నో న పశ్యామి ప్రతిక్రియాం।

అని గర్భస్థ శిశువు పూర్వజ్ఞానముచే, పలు జన్మలు యెత్తితిననియు, తల్లి గర్భమున ఆహారాదులు భుజించితిననియు, స్తన్యముగ్రోలితిననియు, పుట్టుక గడచుచున్న దేగాని ఈ దుఃఖమునుండి విడి వడు మార్గము కనుగొన నేరకున్నాననియు వాపోవుచుండును.

"యోని ద్వారేణ సంప్రాప్తో, యంత్రేణా పీడ్యమానో
మహాతా దుఃఖేన జాతమాత్రస్తు వైష్ణవేన వాయునా
సంస్పృశ్యతదాన స్మరతీ

ఇట్లు గర్భమున విలపించు శిశువు యోనిద్వారమున వైష్ణవ వాయుచే త్రోయబడి వెలువడును, ఇది ప్రతిప్రాణి జన్మకు సామాన్య ధర్మమైయుండును.

మానవజన్మ యెత్తడము, అందులో పురుషుడై జన్మించడము దుర్లభమందురు. దైవానుగ్రహ హేతువుచేగాని, మనుష్యత్వముముముక్షుత్వాదులు గలుగ నేరవు.

"దుర్లభం త్రయ మే వైతత్ దైవానుగ్రహ హేతుకం।
మనుష్యత్వం ముముక్షుత్వం. మహాపురుషసంశ్రయః

అనునట్లు దైవానుగ్రహముచేత నే మానవత్వము గల్గును మానవునిలోను మోక్షము పొందవలయునని వారు అరుదు. ఈ జ్ఞానము దైవయోగము చేత నే గల్గును. ఈ జ్ఞానమునకు మార్గమును చూపు పెద్దల సేవయు దైవాను

గ్రహాశక్తి చేతనే యలవడును.

ఈజన్మరాహిత్యమైన జ్ఞానముగలుగ వలయుననినచో "స్వవర్ణాశ్రమధర్మేణ, తపసా హరితోషనాత్। జ్ఞానముత్పాద్యతేపుంసాం। అను శంకర గురుదేవుల యమృతవచనముల రీతిని ఈశ్వరసేవ చేతనే, జ్ఞానము గల్గును. స్వధర్మాచరణము ముఖ్యము. ఈ స్వధర్మాచరణమే. పూర్వము వచించిన, సంస్కారవంతమైన ఆత్మగుణములతో గూడిన కర్మాచరణము, కాన, జీవన్ముక్తిని జన్మరాహిత్యమునకై చేయు ప్రయత్నమునకు. చతుర్వింశతి సంస్కారములు అత్యన్తావసరములైనవి గనుకనే గర్భాదానాది సంస్కారములు విధిగ పాటింపవలసి వచ్చినవని మహనీయులైన మహర్షి పుంగవులే లోకహితార్థమై యాచరించి, మనచే యాచరింపజేయుటకై రి విధిగ నిర్ణయించిరి.

"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యా కార్యవ్యవస్థితౌ"

అను పెద్దల వచనము రీతిని. చేయదగిన కార్యములు చేయరాని కార్యములు అనేవి చికిత్సలో శాస్త్రమే ప్రమాణము. అని గీతిలో భగవానుని వచనానుసారము, ఈ వైదిక సంబంధమైన సర్వకార్యములు చేయదగిన విధి శాస్త్రరీతిని గలను. కాన శాస్త్రములలో చెప్పిన చొప్పున నాయాకార్యములకు వ్యుత్పత్తులు. విధులు ఫలములు మొదలైనవి వివర్శించెదము గాక

"గర్భాదానము"

"గర్భ ఆధీయతేయేన నిషిక్తం వీర్యం అమోఘం భవతి,

తద్గర్భాధానం (నిషేకః నిషేకాత్ బైజికం చైనో గార్భికం చాపమృజ్యతే,, అను వ్యుత్పత్తుల రీతిని ఈకార్యమునకు గర్భాదానమనియు, నిషేకమనియు రెండు పేర్లుగలవు, అమోఘమైన వీర్యము గర్భమున ధరింపబడు కార్యము అనిగాని, బీజదోష గర్భదోషములను శాంతింపజేయు కార్యమనిగాని పై రెండు పేర్లకు భావము.

నూతన వధూవరులైనచో "తతఃవధూవరయోః నూతనవస్త్రాలంకారాదిధారయేత్" యను ధర్మము ప్రకారము నూతన వస్త్రాదులు ధరించవలయును.

స్వగృహే ప్రాఙ్ముఖఃకుర్యాత్, శ్వాశురే దక్షిణాముఖః
ప్రత్యఙ్ముఖఃప్రవాసేచ నకదాచి దుదఙ్ ముఖః

అను వచనముల రీతిని, స్వగృహమున తూర్పు ముఖమున శయనించవలయును. అత్తగారింటిలో దక్షిణాభిముఖుడై శయనించవలయును. ప్రవాసమున పశ్చిమాభిముఖుడై శయనించవలయును. ఎన్నడుగూడ ఉత్తరాభిముఖుడై శయనించరాదు.

దీపేనస్థేతు యస్సంగం కరోతి మనుజోయది।
యావజ్జన్మ దరిద్రత్వం సంతతేర్నాత్ర సంసయః

అను విధి రీతిని దీపములేని తఱిని భార్యాభర్తలు శయనింపరేని. అట్టి తఱిని గలిగిన సంతానము యావజ్జీవము దరిద్రము ననుభవింతురు.

రాత్రౌ శుభలగ్నే గర్భాదానమితి కర్తవ్యం
దంపత్యోః ఆయుర్బలాభివృధ్యర్థం. గర్భాధానాఖ్యం కర్మకరిష్యమాణః" అని సంకల్పము చేయమని సూత్రకారుల నిర్ణయము, మఱియు, "అస్యాం భార్యాయాం ప్రథమ గర్భ సంస్కారద్వారా సర్వ గర్భశుధ్యర్థం గర్భాధానాఖ్యం కర్మకరిష్యే" అనియు వచింపజేతురు.

రాత్రికాలమున శుభకరమైన లగ్నమును నిర్ణయించి, అట్టి శుభ లగ్నమున. ఈ ప్రథమ గర్భ సంస్కారముచేతనే, అనంతరము గల్గు సంతాన సంబంధమైన గర్భ సంస్కారములు పరిశుద్ధి జెందులాగున వేద మం

త్రములతో పుణ్యాహ వాచన గణపతి పూజాది సంస్కారములు జరపు కొనదగినది.

ఇందుకు తగిన శుభలగ్నము ముఖ్యాతిముఖ్యము సరియైన శుభ లగ్నము లేనిచో దంపతుల ఆయుర్మలాదులు క్షీణించుటయేగాక నష్ట సంతతి వగైరా దోషములు గలుగ గలవు. కనుకనే జ్యోతిష పండితులిం దులకై శుభలగ్నముల నీరీతిని నిర్ణయించిరి.

పాడ్యమి మొదలు పౌర్ణమి వరకును అమావాశ్యకును అధిపతులు గలరు. ఈ యధిపతులు శుభులుగనున్న తిథి ప్రశస్తముగ నిర్ణయించు కొనవలయును. కాన ఆ యా తిథులకుగల యధిపతులను వచింతును. పరికించునది.

1. అగ్నిః ప్రతిపదః – పాడ్యమికి అగ్ని అధిపతి
2. బ్రహ్మా ద్వితీయాయాః – విదియకు బ్రహ్మ
3. పార్వతీ తృతీయాయాః – తదియకు పార్వతి

చతుర్థాః గణపతిః – గణపతి చవితికి
పంచమ్యాః శేష, – పంచమికి ఆదిశేషుడు
కుమారః షష్ఠ్యా: – కుమారస్వామి షష్ఠికి
సూర్య: సప్తమ్యా: – సూర్యుడు సప్తమికి
శివోష్టమ్యా: – అష్టమికి సదాశివుడు
వసవ: నవమ్యా: – నవమికి అష్టవసువులు
దిగ్గజా: దశమ్యా: – దిగ్గజములు దశమికి
యమ ఏకాదశ్యా: – ఏకాదశికి యమధర్మరాజు
విష్ణు: ద్వాదశ్యా: – ద్వాదశికి విష్ణువు

మన్మథః త్రయోదశ్యాః - త్రయోదశికి మన్మథుడు
కలిపురుషః చతుర్దశ్యాః - చతుర్దశికి కలిపురుషుడు
చంద్రః పౌర్ణమాస్యాః - పున్నమకు చంద్రుడు
అగ్నిష్వాత్తాదిపితరః అమావాశ్యాః - అగ్నిష్వాత్తు మొదలైన పితృదేవలు అమావాస్యకు
క్రమాదధిపాః - క్రమముగా నధిపతులు,

కనుక శుభతిథులుగ చూచి నిర్ణయించవలయును,

సూర్యః భానువారస్య - ఆదివారమునకు సూర్యుడు
చంద్రః సోమవారస్య - సోమవారమునకు చంద్రుడు
అంగారకః భౌమవారస్య - మంగళవారమునకు అంగారకుడు
బుధః సౌమ్యవారస్య - బుధవారమునకు బుధుడు
బృహస్పతిః గురువారస్య - గురువారమునకు బృహస్పతి
శుక్రః శుక్రవారస్య - శుక్రవారమునకు శుక్రుడు
మందః శనివారస్య - శనివారమునకు శనియు
వారేశ్వరాః క్రమాద్భవేయుః - వారాధిపతులుగ క్రమముగా గలరు.

స్త్రీ తొలుత పుష్పవతియగు తిథి వారము నక్షత్రము ననుసరించియు వారికి వారి సంతతికిని శుభాశుభములు గలుగగలవు. వీనిని గమనింపదగి యున్నది.

1 అశ్విని 2 రోహిణి 3 మృగశిర 4 పుష్యమి 5 ఉత్తర 6 హస్త 7 చిత్త 8 స్వాతి 9 విశాఖ 10 అనూరాధ 11 మూల 12 ఉత్తరాషాఢ 13 శ్రవణం 14 ధనిష్ఠ 15 శతభిషం 16 ఉత్తరాభాద్ర 17 రేవతి'' అను యీ పదునేడు నక్షత్రములయందు పుష్పవతియైనచో శుభకరము. అనగా దంపతులకు సంతతికి శుభములు చేకూరుచుండగలవని భావము.

1. భరణి 2. కృత్తిక 3 ఆర్ద్రి 4 పునర్వసు 5. ఆశ్లేష 6 మఖ 7 పుబ్బ (పూర్వఫల్గుణి) 8 జ్యేష్ఠ 9 పూర్వాషాఢ 10 పూర్వాభాద్రి అను నీ పది నక్షత్రములలో తొలుత సమర్తాడెనని అశుభకరము.

ఈ రీతిని వారములు సహా శుభాశుభములుగలవు

సోమ – బుధ – గురు – శుక్రి వారములు శుభకరములు. ఆది – మంగళ – శనివారములు అశుభకరములు.

పై చెప్పిన దుష్ట నక్షత్రములకు యిచ్చు ఫలములేవనగా మఖ – ఆర్ద్రి నక్షత్రములలో ప్రథమ రజస్వలైన వనిత దుఃఖము ననుభవించును.

పునర్వసు – వ్యభిచారిణి, జ్యేష్ట – కృత్తికలు దరిద్రిరాలు భరణి పుబ్బ – పూర్వాషాఢ – పూర్వాబాద్రి – ఆశ్రేషలు తొలిపాదమున వైధవ్యము – రెండవపాదమున గొడ్రాలు, మూడవ పాదమున దరిద్రిరాలు. నాలుగవ పాదమున శుభములు బొందును. ఆది – మంగళ – శని వారములలో ప్రథమ రజస్వల యైనచో రోగవంతురాలగును. కాన వీనికి పరిహారముగ శాంతి వేద సాంప్రదాయము ప్రకారము గలదు. గాన నారీతిని శాంతి జరిపిన యనంతరము గర్భాదాన శుభము హూర్తము నిర్ణయించుకొనవలయును.

ఈ రీతిని మరికొన్ని తిథి వార నక్షత్రాదుల వివరముగలదు. పరికించునది, అనగా రజోదుష్టకాలము లీరీతిని గలవు.

సూర్యోదయాస్తమయ కాలములు, గ్రహణము, అమావాస్య పౌర్ణమి, బహుళాష్టమి, బహుళచతుర్దశి. మేషాదిసంక్రమణ కాలములు, చవితి షష్ఠి అష్టమి నవమి ద్వాదశీత్యాజ్య ఘడియలు, అవమా, త్రిద్యుస్పృక్‌లు, (అవమ–మూడు తిథులుగల వారము) (త్రిద్యుస్పృక్ – మూడు వారములతో గూడిన తిథి) పై చెప్పిన దుష్ట నక్షత్రములలో సూర్యుడుండ

గనూ. ప్రథమావర్తమునకు దోషకరములుగాన యధావిధినీ శాంతి జరుపుకొనుట శ్రేయస్కరము.

మేష మిధున సింహ తులా ధనుః కుంభములు, పుంలగ్నములుగాన నీ పుంలగ్నములు పురుష జననమునకు దోహదకారిగా నుండును.

గర్భదాన లగ్నమున కష్టమరాశిలోనే గ్రహము నుండదగదు. దీనికే "అష్టమశుద్ధి" యందురు. ఈ యష్టశుద్ధి లగ్నశుద్ధి ముఖ్యము గర్భాదానమునకు. అష్టశుద్ధిలేనిచో భర్తకాయుః క్షయమగును. సోమ బుధ గురు శుక్రవారములు ప్రశస్తము.

ఈ రీతిని ప్రథమరజస్వలమైన తిది వార నక్షత్రములు చూచుకొని దోషములున్న శాంత్యాదులు జరపుకొని, శుభ తిధి వార నక్షత్రలగ్నములు గుర్తించి, లగ్నశుద్ధి అష్టమశుద్ధిగల పుంలగ్నమున నిషేకము యధాశాస్త్రీయముగ జరిపినచో గల్గు సంతతి, మంచి ఆయుర్దాయము, అదృష్టము అధికారము. కీర్తిప్రతిష్టలు తేజోకాంతులు గల్గినవారై మంచి ధర్మాత్ములుగను, నుండగలరు.

## 2 "పుంసవనము"

"పుమాన్ సూయతేతత్ పుంసవనం గర్భ సంస్కారః

అను వ్యుత్పత్తి రీతిని "ఈ పుంసవనం" అనబడు సంస్కారముచే పుత్రుడు జన్మించుటకవకాశము గలదు, స్త్రీ గర్భము ధరించినపిదప "వ్యక్తే గర్భె తృతీయేమాసి శుభతిదే పుమ్యనక్షత్రే, పున్నక్షత్రేషువా, పత్న్యాః పుంసవనం కర్మ కరిష్యె ఇతిసంకల్ప్య" అనురీతిని గర్భము ధరించిన మూడవ మాసమున పురుషశిశువు జనించుటకుగాను, భర్త ఆయుష్యాభివృద్ధికిగాను

చేయు సంస్కారమునకు పుంసవనము (పుంసువనంఅనియు పేరు) అని యందురు.

"శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం, మమాయుష్యాభివృద్ధ్యర్థం,

అస్యాం మమ భార్యాయాం జనిష్యమాణ గర్భస్య పుంరూప తాప్రాప్త్యర్థం, గర్భస్థ పిండశుద్ధ్యర్థం, పుంసవనాఖ్యం కర్మకరిష్యమాణః" అని సంకల్పింతురు.

ఆయుష్యాభివృద్ధికిగాను, గర్భస్థ పిండ శుద్ధికిగాను, పురుషశిశు జన్మించుటకుగాను యీ పుంసవనాఖ్య కర్మ విధింపబడినది.

ఈ సంస్కారమునకు ప్రశస్తమైన తిథి వార నక్షత్రములు

అశ్వనీ – రోహిణి – మృగశిర – పునర్వసు – పుష్యమి – ఉత్తర హస్త – చిత్త – స్వాతి – అనూరాధ – మూల – ఉత్తరాషాఢ – శ్రవణం – ధనిష్ట – శతభిషం – ఉత్తరాభాద్ర – రేవతి నక్షత్రములు ప్రశస్తములు.

చవితి – నవమి – చతుర్దశి – అమావాశ్యలు వదలి మిగిలిన తిథులు సోమ – బుధ – గురు – శుక్ర వారములు వృశ్చికం సింహం వదలి, మిగత లగ్నములు. సప్తమ నవమరాశులు, శుద్ధిగగల లగ్నమును నిర్ణయించుకొని పుంసవనము చేయునెడల సంస్కార ఫలముబొంద సమర్థులగుదురు.

## 3. సీమంతము.

(సీమంతోన్నయనం)

సీమంతస్య – కేశరచనా విశేషస్య, ఉన్నయనం – ఉత్తోలనం అత్రేతి – సీమన్తోన్నయనం ఇతి గర్భ సంస్కార భేదః కేశరచనా విశేషముచే సీమం

తము (పాపట తీయుట) సమానముగ నెత్తిమెత్తుచు చేయు నొక గర్భ సంస్కారమునకు సీమంతోన్న యనిగాని లేక సీమంతమనిగాని వ్యవహారము.

"షష్ఠే చతుర్థేష్టమే ఏతేషా మన్యత మేమాసి సీమంతోన్న యనాఖ్య కర్మ కుర్యాత్" అనువిధి ననుసరించి, గర్భము ధరించిన దాది, నాలుగవమాసమునగాని, ఆరవమాసమునగాని, అష్టమమాసమునగాని సీమంతోన్న యనాఖ్య గర్భసంస్కారక కర్మ చేయదగినది.

ప్రథమే గర్భే చతుర్థేమాసి షష్ఠేఽష్టమేవా శుభేఽహని దంపతీ మంగళస్నాతే భూత్వా. "జనిష్యమాణ సర్వగర్భాణాంబీజ గర్భస ముద్భవైనోని బర్హణ ద్వారా ప్రతిగర్భ సంస్కారాతిశయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం, సీమంతోన్నయనం కర్మ కరిష్యేయని సంకల్పింతురు.

తొలిగర్భముల, నాలుగు. ఆరు, ఎనిమిది మాసములలో నీ సీమంతమాచరింతురు. ఈసీమంతముచే, గర్భ బీజ దోషశాంతులు గల్గును. అనంతర గర్భములకు నీ సంస్కారబలముచే శుద్ధిగల్గును. పురుష జననమునకు కారణమగును. కాన సూత్రకారులీ సీమంత సంస్కారమునకు ప్రాముఖ్యమొసంగిరి. ఈ సంస్కారము సహితము తిది వార నక్షత్ర లగ్నముల నెరింగి, శుభ తిది వారాదులలోనే చేయదగినది.

## 4. "జాతకర్మ"

గర్భాంబు పానజోదోషః జాతాత్సర్వోపినశ్యతి"

ఈ జాతకర్మ సంస్కారముచే శిశు గర్భమునందు, గర్భజలపానాది

దోషము నివర్తించును.

కుమారే జాతేసతి జన్మదివసమారభ్య దశదిన పర్యన్తం, దశదిన మధ్యే యస్మిన్‌కస్మిన్ దినసే తజ్జాతకర్మ పుత్రవిషయే కుర్యాత్"

పుత్రోత్పత్తి, కాలమునగాని, పదిదినములలోనే నాడేనియు లేదా పదియవ దినమందైననూ జాతకర్మ యనబడు సంస్కారము చేయదగినది, జన్మించిన శిశువునకీ కార్యముచే ఆయుర్వృద్ధి గల్గును.

"కుమారస్య ఆయుష్యాభివృధ్యర్థం జాతేన కర్మణా సగ్గస్కరిష్యే అని సంకల్పము, ఇందు ఫలీకరణ హోమమను పేర హోమకార్యముగలదు ఈ హోమ కార్యముచే, "ఆయుష్యాభివృద్ధ్యర్థం, అనయోర్బాల సూతికయోః చండాలాదిపిశాచే భ్యోరక్షణార్థం, ఫలీకరణ హోమం కరిష్యే।" అని సంకల్పింతురు,

జన్మించిన బాలునికి పిశాచాది బాధలనుండియు, బాలగ్రహాది బాధలనుండియు, రక్షణార్థమై యీ ఫలీకరణ హోమము చేయుదురు. దీని వల్ల బాలారిష్టాదులకు శాంతిగల్గును.

శిశువు జన్మించిన సమయము ననుసరించి, మాతా పితరులకు క్షేమకరమగునా? లేదా? యనియు, జన్మించిన శిశువునకు బాలరిష్టాది దోషములు లేకను, ఆయుర్వృద్ధికరమైన విధానమున్నదా? లేదా యనియు విచారింపదగియున్నది. అట్లు తల్లి దండ్రులకు, మేనమామలకు, జన్మించిన శిశువునకు దోషములున్నచో, నవగ్రహ, జప, హోమదానాదుల చేతనూ తదితర జప హోమశాంతుల చేతను దోషనివారణమునకు శాంతికలాపములుగలవు వానిని యెరింగిన మహనీయులనడిగి, తగిన శాంతులు జరుపుకొని యనంతరము దాని జాతకర్మ నామ కరణాదులు జరుపుకొనుట పెద్ద

చారాచారము. తల్లి దండ్రులకు మేనమామలకు, దోషకరమైన రీతిని కొన్ని జన్మలంకునుగాన విధిగ పెద్దలనడిగి శాంత్యాదులు జరుపుకొనుట శ్రేయస్కరము. ఈ జన్మ దోషాదులు జ్యోతిషము తెలిసిన పెద్దలు చెప్ప గలరు. వాటికి శాంతులు చక్కని పురోహితులు జరిపించగలరు.

## ౫ "నా మ క ర ణ ము"

"ఆయుర్వర్చోఽభివృద్ధిశ్చ సిద్ధి ర్వ్యవహృతేస్తథా।
నామ కర్మఫలం త్వేతత్ సముద్దిష్టం మనీషిభిః"

అను రీతిని, ఆయుస్సు, వర్చస్సు, వ్యవహారసిద్ధి, గలుగుటకై ఈ నామ కరణ సంస్కారము జరుపదగినదని పెద్దల నిర్ణయము,

"జననాత్ దశరాత్రే సంపత్సు రేవా నామకరణం, అహ న్యేకాదశే నామకరణం।

అనురీతిని పదునొకండవరోజు నామకరణముం జేయదగినది వసతిలేనిచో సంవత్సరంలోపుగ వసతి ననుసరించియు చేయదగును.

ఆడబిడ్డకు నామకరణం చేయునెడల "ఈకారాన్తం స్త్రీణాం ఏవం కృతే నామ్నః శుచి తత్ఫలంభవతి" అనురీతిని ఈ కారాన్తముగ పేరుందు లాగున నామకరణమొనర్చినచో వంశమన్తయు పరిశుద్ధి యగునందురు.

"కుమారస్యాయుష్యాభివృద్ధ్యర్థం. సభాసకల సత్పురుషమధ్యే నామ ప్రకటన సిద్ధ్యర్థం మాసనామ్నా నక్షత్రనామ్నా వ్యావహారికనామ్నా చతుర్నామకరిష్యావహే" యని సంకల్పము ఈరీతిని, ఆయుర్వృద్ధి కొరకును. సభలలో, పెద్దల సమక్షమున వ్యవహరించుటకును మాసనామము. నక్ష

త్రనామము, వ్యవహార నామములతో నామకరణము జరుపబడును.

చైత్రమాసమున జన్మించినచో కృష్ణుడు. వైశాఖమాసమున అనంతుడు, జ్యేష్ఠమాసమున అచ్యుతుడు. ఆషాఢమున చక్రి శ్రావణ మున వైకుంఠుడు, భాద్రపదమున జనార్దనుడు. ఆశ్వయుజమున ఉపేం ద్రుడు, కార్తికమున యజ్ఞపురుషుడు, మార్గశీర్షమున వాసుదేవుడు, పుష్యమాసమున హరి, మాఘమాసమున గోవిందుడు, ఫాల్గునమున పుం డరీకుడు అని మాస నామములు తొలుత పెట్టుకొనవలయును.

స్త్రీయైనచో చైత్రమాసమున జన్మించినవారికి భూదేవి, వైశా ఖమున కల్యాణీ జ్యేష్ఠమున సత్యభామా, ఆషాఢమాసమున పుణ్యావతీ, శ్రావణమాసమున రూపిణీ, భాద్రపదమున ఇందుమతీ, ఆశ్వయుజమున చంద్రావతీ, కార్తికమున లక్ష్మి, మార్గశీర్షమున వాగ్దేవి, పుష్యమాస మున పద్మావతీ, మాఘమున శ్రీదేవి, ఫాల్గున సావిత్రి యని మాసనా మములు తొలుత పెట్టుకొన దగియున్నది.

నక్షత్ర నామము పెట్టుకొనిన తదుపరి,

"అయుజాక్షరం కుమార్యాః, అవిషమాక్షరం కుమారస్య
ఆద్యన్తయోః శ్రీకారం లిఖిత్వా। వ్యవహారనామ సమక్షరం
పుంసః అసమాక్షరం స్త్రియః। అను ధర్మము ప్రకారము నామ

ములకు ఆద్యన్తములలో శ్రీకారము తొలుత వ్రాసి, అనంతరము సమ వర్ణములుగల పేరు పురుషులకును, అసమాక్షరములుగల పేరు స్త్రీలకును పెట్టుట శ్రేయస్కరము,

"కులదేవతా నక్షత్రసంబంధం పితా నామకుర్యాత్''

అనురీతిని. కులదేవత పేరుగాని, నక్షత్ర సంబంధమైన పేరుగాని తండ్రి పెట్టుకొనుట యుక్తమము.

## 6. "అన్న ప్రాశనము"

అన్నాశనాత్ మాతృ గర్భమలాశాత్ అపిశుధ్యతి"

ఈ అన్నప్రాశన సంస్కారముచే మాతృగర్భమున నుండుటచేని. గర్భ సంబంధమైన మలవస్తు సేవనమువలన దోషము సహితము నశించునుగాన. గర్భకాలమున తల్లి గర్భసంబంధ మల దోషనివారణముగల్గును గాన అన్నప్రాశనమె ముఖ్యమైన సంస్కారమనిరి.

తతోన్నప్రాశనం మాసి షష్ఠేకుర్యాత్ । యథావిధి
అష్టమేవాపి కర్తవ్యం, యచ్చేష్టం, మంగళం కులం। అను ధర్మము రీతిని ఆరవమాసమునగాని. యెనిమిదవ మాసమునగాని బాలునకు అన్నప్రాశనము చేయదగినది.

"జన్మనోభి షష్ఠేమాసి, దధిమధుఘృత మోదనం
ఇతి సంసృజ్య, ఉత్తరైర్మంత్రైః కుమారం ప్రాశయేత్ ।"
అను ఆపస్తంబ సూత్రము ప్రకారము దధి. మధు, ఘృతముతో గూడిన యన్నమును బాలునకు మంత్రములతో నభిమంత్రించి. తినిపించదగినది.

మధ్వాజ్య కనకోపేతం. ప్రాశయేత్ పాయసంతతః
తేనె. నెయ్యితో గూడిన పాయసమును. బంగారముతో తినిపించ దగినది.

## "7. కాలము"

బలాయుర్వర్చో వృద్ధిశ్చ చూడా కర్మఫలం, స్మృతం"

బలము ఆయుస్సు వర్చస్సు అభివృద్ధి చెందును గాన. ఈ చూడాకర్మయను సంస్కారము నిర్ణయింపబడినది.

''తృతీయే వత్సరే చౌలం కుర్వీత హ్యుత్తరాయణే।
శుక్లపక్షే, శుభార్కేతుతు, కృత్వాభ్యుదయ యికంతతః॥
(జన్మనోభి తృతీయేవర్షే చౌలం పునర్వసోః)

జననాడు మూడవ సంవత్సరమున ఉత్తరాయణమున శుక్లపక్షమున శుభతిధి, వార నక్షత్ర లగ్న యోగమున చౌలమను సంస్కారము చేయదగినది.

''కర్ణరంధేకృత్వా'' అను ధర్మము రీతిని చెవులు కుట్టదగినది.
సూనోర్మాతరి గర్భిణ్యాం చూడకర్మన కారయేత్।
పంచమాసాదధః కుర్యాత్ అత ఊర్ధ్వంన కారయేత్।

అను నియమానుసారము తల్లి గర్భముతో నుండు నెడల, అయిదు మాసములలో పుగ బాలునికి చూడాకర్మ చేయనగును. ఆపై మాసములున్నచో నీ సంస్కారము చేయదగదు.

''మాత్రాసహైవ భుంజీయాత్, వివాహే భార్యయాసహ।
మాత్రాసహైవ భుంజీయాత్, చౌలమానేకభాజనే॥

బాలుడు ఉపనయన సమయమున తల్లితో గూడా భుజింపవలయును. వివాహకాలమున భార్యతో గూడా భుజింపవలయును. చౌలమునందు గూడా బాలుడు తల్లితో గూడ భుజింపవలయును. ''తూష్ణీమేతాః క్రియాః స్త్రీణాం, వివాహస్తు సమంత్రకం'' అనురీతిని స్త్రీలకు యీ చెవులు కుట్టుట అమంత్రముగనే చేయదగినది.

"అక్షరాభ్యాసము"

ప్రాప్తేతు పంచమేవర్షే హ్యాప్రసుప్తే జనార్దనే
షష్ఠీం ప్రతిపదం చైవ, వర్జయిత్వా తథాష్టమీం।
రిక్తాం పంచదశీంచైవ. సౌరభౌమదినే తథా।
ఏవం సునిశ్చితే కాలే, విద్యారంభంతు కారయేత్।

బాలునకు అయిదవ సంవత్సరము వచ్చిన కాలమున అక్షరాభ్యాసము చేయదగినది. ఈ యైదవ వత్సర కాలమున అక్షరాభ్యాసమునకు శుభ తిథి వార నక్షత్రములు గుర్తింపదగినది. అట్టి తఱిని విష్ణువు శయనించిన కాలము కూడదు. అనగా ఆషాఢశుద్ధ ఏకాదశి మొదలు కార్తీకశుద్ధ ఏకాదశి వరకు విష్ణుశయన కాలమందురు. ఈ కాలము కూడదు. అరీతిని షష్ఠి, అష్టమి పాఢ్యమి పౌర్ణమిఅమావాశ్యలు శని మంగళ వారాలు పనికిరావు

"ఉత్తరాయణే సూర్యే కుంభమాసం వివర్జయేత్"

ఉత్తరాయణము శ్రేష్ఠము. కాని రవి కుంభరాశిలోనుండు కాలము మాత్రము పనికిరాదు. తదితరమాసములలో శుభ తిథి వారములనదగిన "శుభవాసరే, శుభదినే, అహ్నాదివాభాగే. అక్షర స్వీకారాగలగ్నాత్ అష్టమస్థానే గ్రహారహితేసతి, అక్షర స్వీకృతిః కార్యా" యను విధి ప్రకారము పగలు, శుభలగ్నమున లగ్నాత్ అష్టమమున గ్రహావర్జ్యముంగ నుండులాగున శుభముహూర్తము నిర్ణయించి అక్షరాభ్యాసము చేయదగినది.

"పూజయిత్వా హరింలక్ష్మీం, దేవీంచైవ సరస్వతీం
స్వవిద్యా సూత్రకారాంశ్చ, స్వాం విద్యాంచవిశేషతః

అను విధిననుసరించి, బాలునకు అక్షరాభ్యాస కాలమున తొలుత గణ పూజచేసి. లక్ష్మీనారాయణులను, వాణీ హిరణ్యగర్భులను, స్వశాఖ సూత్రకారుని పూజించి ఓంనమశ్శివాయ సిద్ధంనమః అను మహామంత్ర మును, ఒ న మః శి వా యః సి ధం న మః" అను విరణముగ, ధాన్య ముపై వ్రాసి, తొలుత బాలుని వ్రేలితో వ్రాయించి, అనంతరము పలక పైన ఈ మ్మ్నాకు వ్రాయించి మున్నాకు పఠింపజేయుట పెద్దల సాంప్ర దాయము.

## 9. "ఉపనయనము"

ఉపనీతేః ఫలంత్వేతత్ ద్విజతా సిద్ధిపూర్వికా।
వేదాధీత్యధికారశ్చ సిద్ధిరేబుషిభిరీరితా॥

ఈ యుపనయమున సంస్కారముచే ద్విజత్వ సిద్ధిగల్గును. వేదాధ్యయనా ధికారము సిద్ధించును.

గర్భాష్టమేషు బ్రాహ్మణముపనయీత
గర్భైకాదశేషు, రాజన్యం, గర్భద్వాదశేషు వైశ్యం"

అను అపస్తంబ మహర్షి సూత్రము ప్రకారము, బ్రాహ్మణ బాలునకు గర్భాష్టమముననూ, క్షత్రియునికి గర్భైకాదశముసను, వైశ్యునకు గర్భద్వా దశవర్షము ననూ. ఉపనయనము చేయుదగినది. అనగా. బ్రాహ్మణ బాలు నకు జన్మించినదాది యేడవవత్సరము రాజులకు జన్మ ప్రభృతి, పదియవ త్సరము వైశ్యునకు పదునొకండువ వత్సరము జరుగు కాలమున నుపన యనము చేయదగినదని, అపస్తంబ సూత్ర నిర్ణయము.

"వసంతో గ్రీష్మశ్శరది త్యృతవో వర్ణాను పూర్వ్యేణా"

అను సూత్రనిర్ణయము మేరకు బ్రాహ్మణునకు వసంతఋతువున నుపనయనము చేయదగినది. క్షత్రియునకు గ్రీష్మఋతువు వైశ్యునకు శరత్ ఋతువు ప్రశస్తములు,

"అథ ఏతావంతం కాలం అనాశ్రమిణః అస్యకుమారస్య ఆశ్రమాధికార సిద్ధ్యర్థం, అధ్యయన సంపాదనార్థం, ఆయుస్తేజో యశశ్శ్రీ పుష్టి కామ్యాభివృద్ధ్యర్థం, సాంగోపాంగం, సకలవేదాధ్యయన, అధ్యాపన తత్ప్రతిపాదనార్థం, చతుర్వింశత్యక్షర మంత్రోచ్చారణ, ద్విజాశ్రమాధికార యోగ్యతా సిద్ధ్యర్థం, ఇతుం కుమారం, ఉపనేష్యే" అని సంకల్పించుదురు

ఈ యుపనయనముచే గల్గు ప్రయోజనములు, బాల్యమునందియుండు అనాశ్రమదోషము తొలగి బ్రహ్మచర్యాశ్రమ సిద్ధిగల్గును. వేదము నేర్వదగిన యధికారము వచ్చును, ఆయుర్వృద్ధి బ్రహ్మతేజోవృద్ధి. కీర్తి వ్యాపకము. పుష్టి వగైరా శక్తులు గల్గును, వేదశాస్త్రములు సమగ్రముగ నేర్వదగిన శక్తి చేకూరును. బుద్ధికుశలత గల్గును, వేదము నేర్వడము నేర్చిన వేదమును బోధించుశక్తి చేకూరును. గాయత్రీమంత్ర జపానుష్ఠానశక్తి యోగ్యతలు చేకూరును. ద్విజన్మత్వం గల్గును, గాన యీచెప్పిన యోగ్యతలెల్లయు చేకూరుటకై యుపనయనము బ్రాహ్మణులు విధిగ యథాశాస్త్రీయముగ. చేయుట యత్యన్తావశ్యకము.

ఉప + నయనం – వేదాధ్యయనార్థం, ఆచార్యస్య ఉప – సమీపం, నీయతే, యేనకర్మణా ఇతి – వుపనయనం" అని వేదము నేర్చుకొను

టకుగాను, వేదము బోధించు ఉపాధ్యాయునివద్దకు చేర్చు నర్థమై చేయు వైదిక సంస్కారమునకు ఉపనయనమని యర్థము, అనగా అధ్యాపనార్థమై వేదమును బోధించు ఆచార్య సమీపమునకు చేర్చు సంస్కార విశేషము.

"గృహ్యోక్త కర్మణా యేన, సమీపం నీయతేః గురోః।
బాలో వేదాయతద్యోగాత్ బాలస్యోపనయనం విదుః

అను స్మృతి వచనానుసారము వేదము నేర్చుకొనుటకుగాను గురువు సమీపమునకు బాలుని చేర్చు నర్థమై చేయబడు గృహ్యోక్తమైన సంస్కార విశేషమే ఉపనయనమునకు పేరు:

గర్భాష్టమేఽష్టమే వాబ్దే బ్రాహ్మణస్యోపనయనం।
బ్రహ్మ వర్చస కామస్య కార్యం విప్రస్య పంచమే॥

అను ధర్మానుసారము బాలుడు గొప్ప బ్రహ్మ వర్చస్వి కావలయునను నెడల నైదవ సంవత్సరముననే నుపనయనము చేయుదగినది. లేద. గర్భము నుంచి లెక్కించిన ఎనిమిదవ వత్సరమునగాని అనగా పుట్టినది మొదలు ఏడవ వత్సరమగును. లేక పుట్టినది మొదలు ఎనిమిదవ వత్సరమునగాని బ్రాహ్మణ బాలునకుపనయనము చేయుట యుత్తమము. ఇందులో గర్భాష్టమ వర్షముపనయనమునకు ముఖ్యాతి ముఖ్యము.

"జన్మోదయే, జన్మసుతారకాసు, మాసేధవా జన్మని జన్మభేవాప్తేన. విప్రోన బహుశ్రుతోపి. విద్యా విశేషైః ప్రథితః పృథివ్యాం" అను "తత్వ చిన్తామణీ" ప్రమాణానుసారము

జన్మలగ్నము జన్మనక్షత్రము జన్మమాసము శుభకరము కాలా

స్మృతమునను "జన్మర్క్షం శుభదం, మౌంజీబంధనపట్టబంధన మహీపాస్తి:" యను రీతిని జన్మ నక్షత్రమున యుపనయన సంస్కారము శుభప్రదమగు చున్నది,

"అస్తంగతే దైత్య గురౌ గురౌ వా।
ఋక్షేపివా పాపయుతే వ్యనుక్తే।
వ్రతోపనీతో దివసే ప్రణాశం।
ప్రయాతి దేవైరపి రక్షితోయః

అనురీతిని గురువుగాని శుక్రుడుగాని అస్తంగతులై యున్ననులగ్నమునక్ష త్రము పాపాక్రాంతమై యున్నను యుపనయనము చేయదగదు.

మందవారే మౌంజీ బంధంయః కుర్యాద్వటునాశనం।
అంగారకే మౌంజీ బంధం యజమానో మృతోభవేత్"

శనివారమున నుపనయనము చేసినచో నుపనయనమునవటువు (బాలుడు) నశించును, మంగళవారముపనయనము చేసినచో బాలుని తండ్రి నశిం చును గాన, శని మంగళ వారాలు పనికిరావు.

ఈ యుపనయనమేగాదు ఏ శుభ కర్మగూడ శని మంగళవారాలు చేయరాదు చేసినచో మరణము తప్పదందురు.

సహస్ర గుణయుక్తేపి మందవారే కుజే తథా।
శుభకర్మనతకుర్వీ కుర్యాచ్చేత్ మరణం ధ్రువం"

అని శని మంగళ వారాలే యొక్క శుభకార్యానికి పనికిరావని నిషే ధించిరి.

ఆచార్య కావ్య సౌమ్యానాం వారాః శస్తాః శుభోదయే

అను రీతిని గురు శుక్ర బుధ వారములు ఉపనయనమునకు శ్రేష్ఠము.

జీవః కావ్యోపివా యస్యమౌంజీబంధనలగ్నగః।
తస్య విద్యా ప్రభూతాస్యాత్ వివాహశ్చాచిరాద్భవేత్।

ఉపనయన లగ్నమున గురువుగాని శుక్రుడుగాని యున్నచో నా బాలునకు మంచి విద్యయువచ్చును, త్వరలో వివాహము కాగలదు.

కుజే చేత్ కూజితో దోషః శిష్యాచార్యవినాశనం।

అంగారకుడు, కేంద్రములనదగిన లగ్న, చతుర్థ, సప్తమ దశమ రాశులలో నున్నచో "కూజిత" మనుదోషము ఈదోషముచే ఉపనయన బాలునకు వాని తండ్రికి వినాశము గల్గును.

మందేతు రుధిరో దోషః కరోతి మహాతీంగదాం।

శని యుపనయన లగ్నములకు కేంద్ర స్థానములలోనున్నచో రుధిర మను దోషము సంభవించును. ఈ దోషముచే బాలునకు గొప్ప రోగ ములు సంప్రాప్తించును.

రాహౌరంధ్రాహ్వయో దోషః శిశోర్మాతృవినాశనం।

రాహువు ఉపనయన లగ్నమునకు కేంద్రములలో నున్నచో బాలుని తల్లికి దోషము గల్గును,

కేతౌ కేంద్రేతూగ్రో దోషో విద్యాయుర్ధన నాశనం।

కేతువు కేంద్రమున నున్నచో, విద్య, ఆయుస్సు, ధనము నశించును.

ద్వాదశస్థం రవింభౌమః పశ్యేన్నాచార్య నేత్రహృత్ ॥

లగ్నమునకు పండ్రెండవయింట రవి యుండి యూరవిని అంగారకుడు చూచుచున్నచో బాలుని తండ్రికి నేత్రములేని రీతిని జేతురు. అనగా తండ్రి గ్రుడ్డివాడగును.

విశేషాత్ నైధనస్థానే నేష్యంతే సర్వదాగ్రహాః
ఆచార్యం తం శుభాఘ్నన్తి, శిష్యంఘ్నన్తి శుభేతరాః

ఉపనయనలగ్నమున కెనిమిదవరాశి పరిశుద్ధముగ నుండవలయును. అనగా నే గ్రహములు నందుండరాదు. శుభగ్రహములున్నచో తండ్రిని నశింపజేయుదురు. పాపగ్రహములున్నచో బాలుని నశింపజేతురు. గాన ఉపనయన లగ్నమున కష్టమశుద్ధి ముఖ్యాతి ముఖ్యము,

మాఘేద్రవిణ శీలాఢ్యః, ఫాల్గునేచ దృఢవ్రతః।
చైత్రేభవతి మేధావీ వైశాఖె కోవిదోభవేత్।
జ్యేష్ఠే గహన నీతిజ్ఞః ఆషాఢే క్రతు భాజనః।
శేషేష్వన్యేషు రాత్రిః స్యాత్ నిషిద్ధం నిశిచ వ్రతం।

ఈ యుపనయన వ్రతము బాలునకు మాఘమాసమున చేసినచో ధన శీలములు మెండుగ గల్గును, ఫాల్గుణమాసమున చేసినచో మంచి నియమ వ్రతుడగును, చైత్రమాసమున నుపనయనము చేసినచే మేధావి యగును వైశాఖమాసమున నుపనయనము చేసినచో మంచి పండితుడగును జ్యేష్ఠ మాసమున నుపనయనము చేసినచో మంచనీతి శాస్త్రవేత్తయగును. మిగతా మాసములు పనికిరావు. రాత్రి కాలమున నుపనయనము చేయ దగదు.

"ఆషోడశాత్ బ్రాహ్మణస్య అనాత్యయ, ఆద్వావింశాత్ క్షత్రియస్య, అచతుర్వింశా ద్వైశ్యస్యేతి" యను యపస్తంబ మహర్షి సూత్రానుసారము బ్రాహ్మణునకు గర్భాష్టమము మొదలు పదునారు వత్సరముల వరకుగల కాలమున, వసతినిబట్టి యుపనయనము చేయవచ్చును. క్షత్రియునకు యిరువదిరెండు వత్సరముల లోపుగను వైశ్యునకు యిరువదినాలుగు వత్సరముల లోపుగల కాలము సంద్రైనను యుపనయనము చేయదగును.

"నవమే పంచమే కామ్యం" బ్రహ్మవర్చస కామస్యపంచమే, ష్ఠే ఆయుష్కామస్య నవమే, సప్తమే బ్రహ్మ వర్చసం. అష్టమే ఆయుష్యం, నవమే తేజోవృద్ధిః. దశమే అన్నాద్యం, ఏకాదశే ఇన్ద్రియం, ద్వాదశే పశూంశ్చ త్రయోదశే మేధాకామం, చతుర్దశే పుష్టికామం, పంచదశే భ్రాతృమంతః, షోడశే సర్వకామం" అను బౌధాయన సూత్ర ప్రమాణము రీతిని అయిదవ వత్సరము బ్రహ్మవర్చ్చ ఏడవ వత్సరమునను బ్రహ్మవర్చసప్రాప్తి. ఎనిమిదవ వత్సరమున ఆయుర్వృద్ధి తొమ్మిదవ వత్సరమున తేజోవృద్ధి, పదియవ వత్సరమున అన్న సమృద్ధి పదునొకండవ వత్సరమున ఇంద్రియపుష్టి, పండ్రెండవ వత్సరమున పశువృద్ధి పదిమూడవ వత్సరమున మేధావృద్ధి పదునాలుగవ వత్సరమున బలసంపద పదునైదవ వత్సరమున సోదరవృద్ధి పదునారవ వత్సరమున సర్వ సంపదలు వటువునకు గల్గుచుండును గాన పదునారు వత్సరములలోపుగనే నుపనయనము చేయు తలిదండ్రులు తొలుత గణపతిపూజ నాచరించి "శుద్ధ్యర్థం వృద్ధ్యర్థం" స్వస్తి పుణ్యాహవచనము చేయుదగినది.

అనంతరం "జాతాది కర్మణాం, ఉక్త కాల అనుష్ఠానాభావాత్ ప్రాయశ్చిత్తముచ్యతే" యని బాలుడు పుట్టినది మొదలు ఇంతవరకు

చేయదగు జాతకర్మ నామకరణాదులు చెప్పిన చొప్పున సకాలములో శాస్త్రీయముగ చేయనందులకై ప్రాయశ్చిత్తముగా నీరీతిని నాచరింప దగినది. ఈ చేయబడు విధికే "యనుపనీత ప్రాయశ్చిత్త మందురు.

'అనుపనీత ప్రాయశ్చిత్తము'

"యథాశక్తి పరిషద్దక్షిణాం గృహీత్వా" యను విధి చొప్పున సభలోని పెద్దలకు యిచ్చుటకై తగినరీతిని శక్తికొలది దక్షిణను తీసికొన వలయును. ప్రదక్షిణత్రయమునాచరించవలయును.

"అసేషే పరిషత్, మదీయాం విజ్ఞాపనామవధార్యమయాసమర్పితాం, ఇమాం పరిషద్దక్షిణాం యథోక్తదక్షిణాం యథోక్తదక్షిణామివస్వీకృత్య.

మమకుమారస్య జన్మ ప్రభృతి చౌలోపనయనపర్యన్తం. మధ్యే సంభావితానాం పాపానాం, సవర్ణాఽ సవర్ణ ధాత్రీ జనయిత్రీ ప్రభృత్యనేక స్తన్యపాన నిజస్తన్యపాన సహభోజన ఉచ్ఛిష్టభోజన, పర్యుషితాన్న భోజన, వివసనాన్నపాన, సజాతీయ విజాతీయ సహచర, క్రీడాసలాప సంస్పర్శన, తిష్ఠన్మూత్రపురీషోత్సర్జనాదీనాం.

తత్తత్కాలే శౌచాభావ ప్రభృతీనాం సర్వేషాందోషణాం. అః నోదనార్థం, పూర్వ పూర్వ కర్మాతిక్రమదోషనిర్హరణార్థం,

ఉత్తరోత్తర కర్మ ద్విజాధికార, యోగ్యతాఫలసిధ్యర్థం చరుర్త్విం శత్సక్షర మంత్రోచ్చారణ ద్విజాశ్రమాధికార యోగ్యతాసిధ్యర్థ ఫలసిధ్యర్థం, శ్రీ లక్ష్మీనారాయణ ముద్దిశ్య ప్రీత్యర్థం ఇమాం సౌవర్ణీం

శాస్త్రీయాం పరిషద్దక్షిణాం యథోక్త దక్షిణాయవ స్వీకృత్య మామను గృహ్ణంతు భవన్తః

అస్యకుమారస్య దంత జనన ప్రభృతి, ఉపనయన శుభలగ్న పర్యన్తం, సంభావితేభ్యఃపాపేభ్యః అయం కుమారో ముక్తోభూయాత్, విముక్తోభూయాత్, ఉపనయనాధికార సిద్ధి రస్త్వితి భవన్తో బ్రువన్తు, ఉపనయనాధికార సిద్ధిరస్తు॥"

అని. వుపనయనము చేయు తండ్రి తన కుమారునికి యుపనయనము చేయుటకు మునుపు యథాశక్తి దక్షిణను గ్రహించి, లేచి నిలువబడి తన యెదుటనుండు పెద్దల నుద్దేశించి యిట్లు వచించును.

ఓ సభలోని మహనీయులారా! నా కుమారునికి ఆయుర్వృద్ధికై, అనుపనీత ప్రాయశ్చిత్తము నాచరించుచున్నాను. మీ పాదపద్మములను నమస్కరించి కోరుకొనుచున్నాను, నావిన్నపమును ఆలకించవలయునని ప్రార్థన నా యీ దీక్షణను మీరు గ్రహింతురుగాక.

నా కుమారుడు జన్మించినది మొదలు ఈ యుపనయనమున పర్యంతముగల ఈ యేడెన్మిది వత్సరముల మధ్యకాలములో (ఎనిమిదవ వత్సరముననే యుపనయనము చేయవలయును గాన నందుకు తగినట్లుగ) వల సంభవించిన పాపలయొక్కయు తన కులస్థులైన వారినుండిగాని, ఇతర కులస్థులైన వారినుండిగాని, చనుబాలు సేవించిన పాపాదుల యొక్కయు, కలసి భోజనము చేసినను, ఎంగిలి పదార్థములు తినినను, సద్దియన్నము తినినందులకును వస్త్రము లేకుండా నుండినందులకును, తనవారితోగాని, ఇతర కులస్థులతోగాని, కలసి తిరుగుచున్నందులకను, ఆడుకొనినందులకును, వినోదముగ వార్లతో మాట్లాడినందులకను, నిలిచి మలమూత్రములు

వదలి నందులకును, ఆయాకాలములలో చేయదగిన పాదములు కడుగుకో నట మొదలగు ఆచారములు వదలిపెట్టి నందులకై వచ్చిన పాపముల కును, ఈరీతిని యితరములైన కార్యాదులు చేయుట చేతగాని, విడుచుట చేతగాని వచ్చునట్టి సమస్త పాపములు తొలగుటకుగాను, ముందు చేయ దగు కార్యములు సకాలములో చేయని కారణమునను, ఇంకమీదట చేయదగు వుపనయనాది కార్యములు చేయుటకుగాను తగిన యోగ్యత గల్గుట కొరకును. ఇరువదినాల్గు వర్ణములతో గూడిన గాయత్రీమంత్రమును వుచ్చరించు ద్విజన్మ మనబడు సిద్ధిగల్గుటకును శ్రీలక్ష్మీనారాయణుని ప్రీతి కొరకై, ఈ సువర్ణమయమైన సశాస్త్రీయమైన యీ పరిషత్ దక్షిణను మీరు స్వీకరించి మమ్ములను అనుగ్రహించవలసినది ఈ బాలునికి దంత ములు మొలచినది మొదలు వుపనయన పర్యంతముగల యీ మధ్యకాల ములో కలిగిన పాపములనుంచి, విముక్తుడగులాగున ఆశీఃపూర్వకముగ అనుగ్రహింపదగినది. వుపనయనాధికార యోగ్యత సిద్ధించులాగున యను గ్రహింప దగినది. వుపనయనాధికార సిద్ధిగల్గుగాక''

కుమారస్య ఆయుషాభివృధ్యర్థం. శరీర శుధ్యర్థం, స్వర్ణ ధాన్యాజ్య కృచ్ఛ్రాణ్యాచరిష్యే'' యని స్వర్ణాది దానములు శరీర శుద్ధికొరకై నాచ రింప వలయును,

పాహిత్రయో దశ హోమము

కుమారస్య ఆయుష్యాభివృధ్యర్థం, జాతకర్మాదీనాం, తత్తత్కా లేషు, తత్తత్కార్మాకరణ ప్రాయశ్చిత్తార్థం పాహిత్రయోదశ హోమం కరిష్యే''

అని కుమారుడు జన్మించినది మొదలు నేటివరకు చేయదగు కార్య ములు చేయని కారణమున గల్గిన పాపములు తొలంగుటకై, సాహిత్రి యోదశ హోమము నాచరించుచున్నానని సంకల్పించవగును, అనంతరము పదమూడు మంత్రములతో హోమము చేయతగినది.

"అధపేతావంతకాలం అనాశ్రిమణోస్య కుమారస్య ఆశ్రిమాధికార సిధ్యర్థం, అధ్యయన సంపాద నార్థం, ఆయుస్తే జోయశశ్రీ పుష్టి కామ్యాభి వృధ్యర్థం, సాంగోపాంగం సకల వేదాధ్యయన అధ్యాపన తత్ప్రతిపాద నార్థం చతుర్వింశత్యక్షర మంత్రోచ్చారణ ద్విజాశ్రిమాధికార యోగ్యతా సిధ్యర్థం, ఇమం కుమారం ఉపనేష్యే" అని సంకల్పింతురు.

అనగా జన్మప్రభృతి ఈ యుపనయన కాల పర్యంతము ఏ ఆశ్రి మాధికారము లేనందున, అట్లు, అనాశ్రిమిగా నుండరాదు గాన, ఆశ్రి మాధికార యోగ్యత గల్గుట కొరకు, అనగా బ్రహ్మ చర్యాశ్రిమాధికార సిద్ధి గల్గుటకుగాను, వేదపఠనమునకు యోగ్యుడగుటకుగాను, ఉపనయన ముగానిది, వేదపఠనము చేయతగదు గాన, వేదపఠనమునకు యోగ్యత గల్గుటకుగాను, ఆయుస్సు తేజస్సు యశస్సు, సంపద, బలము, మొదలగు నవి చేకూరుటకొరకు, అంగములతో గూడిన వేదము నేర్చి, వాని విధులు నెరవేర్చుట కొరకు, ఇరువదినాలుగు వర్ణములతో గూడిన గాయిత్రి మహా మంత్రముచ్చరించుట కొరకు. ద్విజన్మత్వ సిద్ధి కొరకు, ఈ బాలునికి యుప నయనము చేయుచున్నానని తండ్రిగాని, సోదరాదులుగాని, సంకల్పించ దగి యున్నది,

అనంతరము ఉపనయనము చేయబడు బాలునికి రక్షాబంధనము గట్టుదురు. "కుమారస్య ఆయుష్యాభి వృద్యర్థం, వుపనయనాంగ త్వేన

కర్మాదౌ రక్షాబంధనం కరిష్యే'' యని వుపనయన వటువున కాయుర్వృద్ధికై రక్షాబంధనము చేయదగినది.

అనంతరము యజ్ఞోపవీత ధారణము

"ఆయుష్యాభివృద్ధ్యర్థం, శ్రౌతస్మార్త నిత్యకర్మానుష్ఠాన యోగ్యతా సిద్ధ్యర్థం, పరమ పవిత్ర యజ్ఞోపవీత ధారణం కరిష్యే'' యని, శ్రౌతకర్మలనదగు ఆధాన, సోమయాగ దర్శపూర్ణమాసాదులాచరించుటకును, స్మార్త కర్మలనదగు ఉపనయనాది సంస్కారములచే పవిత్రుడగుటకొరకును ఆయుర్వృద్ధికొరకును యజ్ఞోపవీతము వేయదగినది.

అస్య కుమారస్య ఆయుష్యాభివృద్ధ్యర్థం శీతవాతోష్ణోపశమన ద్వారా దేహాలం కరణార్థం, నూతనవస్త్రమౌంజ్యాజినదండధారణం, కరిష్యే! అని శీతవాత, వుష్ణబాధల నివారణార్థం దేహాలంకారార్థం, నూతనవస్త్రాలంకరణము, ముంజ అనగా దర్భలతో పేడిన త్రాటిని మూడు చుట్లు వచ్చులాగున నడిమకి మొలత్రాడువలె ధరించవలయును. పాలాశ దండ ధారణము చేయదగినది.

"సావిత్రీం భో అనుబ్రూహియాత్ ''అని వటువు గురువును అడుగవలయును

గాయత్రీ మంత్రోపదేశమునకై "గాయత్ర్యుపదేశముపాచార్యస్సముపాహూర్యోస్తు। స్వముత్తరమోష్ఠం, శ్యావాంతపర్యన్తం, వుపస్పృశ్యాచామేత్।

వటుడు ఊర్ధ్వోష్టమును, నీటితో స్పృశించుకొనవలయును.

“సుశ్రవఇతిపాలాశందండం, దక్షిణేనహస్తేనాదత్తే

ఆయుర్వర్చోయశోబలాభివృద్ధ్యర్థం, గోసర్పభయనివృత్త్యర్థం పాలాశదండ ధారణం కరిష్యే అని సుశ్రవస మంత్రమును పఠించుచు మోదుగదండమును వుపనయనమైన బాలుడు (వటువు) ఆయుర్వృద్ధి కొరకు, వర్చస్సు, యశస్సు, బలము, వృద్ధిజెందుటకును, ఆవులు పాముల భయము లేకుండుటకును, పాలాశదండధారణము చేయదగినది.

తతఃస్మృతంచమ ఇత్యేనం, వటుంవాచయతి” యను విధి ప్రకారము స్మృతంచమాది మంత్రములు వుపనయన వటువు పఠింపవలయును.

అనంతరము పెద్దలకు యథాక్రమానుసారము ‘వృద్ధాన్నమస్కృత్య’ యను వచనానుసారము నమస్కారము చేయదగినది.

‘భిక్షాం యాచయేత్’ అను విధి ప్రకారము ఆహారార్థమై భిక్ష గ్రహింపవలయును.

ఈ తరిని, గురువు యీరీతిని ప్రశ్నించును.

బ్రహ్మచారి యందుకు సమాధానమారీతిని యివ్వవలయును.

1. తతో గురుః బ్రహ్మచార్యసీతి। బాఢమేవంకరోమీతి వటుఃబ్రూయాత్,

ఆచార్యః – బ్రహ్మచార్యసి

వటుః – బాఢం కామచారవాదభక్షణ కామోనభవామి

ఆచార్యుడు – బ్రహ్మచారివయితివని బాలునికి చెప్పును. వటుడందులకు కామచార వాదభక్షణాదులుకోరను.

2, ఆచార్యః – అపోశాన కుమారః – బా మశ్నామి

3. ఆచార్యః – కర్మకురు కుమారః – బా ం కరోమి

4. ఆచార్యః - మాషుప్థాః కుమారః - బాఢం దివానస్వాపామి
5. ఆచార్యః - భిక్షేచర్యంచర కుమారః - బాఢంచరామి
6. ఆచార్యః - ఆచార్యా దీనోభవ. కుమారః - బాఢంభవామి

ఈ యారువాక్యములు ఆచార్యుడు యుపనయన వటువుచే పలికించును దైవసంబంధమైన కార్యములాచరింపుము, నిదురించవలదు, భిక్షాభోజన ముతోనుండుము. వేదవిద్యాదులు నేర్చువరకు ఆచార్యాధీనుడవయి యుండుము. అని నియమించగా వానినన్నింటిని సమ్మతించును. అనగా నీ యారు నియమములు ప్రధానముగ నాచరించుచు బాలుడు వేదాది విద్యలు నేర్చుటకే బ్రహ్మచర్యమందురు. ఈ బ్రహ్మచర్య వ్రత నిష్ఠా గరిష్ఠునకే బ్రహ్మచారీయని లోకమున వ్యవహారము.

వుపనయనమైన నాలుగవదినమున వుపనయన వటువునకు మేధా జననాది బుద్ధి వికాసములకై పాలాశహూమమాచరింపదగినది.

"చతుర్థేహాని పూర్వాహ్ణే, పాలాశవృక్షప్రదేశే అలంకృత్య। మమకుమారస్యాయుష్యాభివృద్ధ్యర్థం మేధాజననసిధ్యర్థం, పాలాశకర్మ కరిష్యమాణః" అని, సంకల్పించి, కుమారుని బుద్ధి వికాసము, ఆయుర్వృ ధ్యర్థం, పాలాశ వృక్షము కడకు చేరి, యందు, యీ కార్య మాచరింపదగి నది. "ప్రాచీముదీచీం, వాదిశముపనిష్క్రమ్య" యను విధి ప్రకారము, తూర్పు దిశనగాని, ఉత్తరపు దిశనగాని, నున్న మోదుగు వృక్షమువద్దకు వెళ్ళి, ఆ వృక్షప్రదేశమును, అలికి ముగ్గులిడి, వృ క్ష ము ను పూజింప దగినది.

అనంతరము, ఉపనయనము నాడు, స్వీకరించిన మేఖలాజిన దండ

మూలు, పాలాశ వృక్షము కడనే యుంచి రావలయును, "మేఖలామజినం. దండం పాలాగ్రవినిక్షిపేత్. తద్వ్యాసో గుర వేదద్యాత్, అనునియమము మేరకు, తాను ధరించిన వస్త్రములు గురువునకు సమర్పించదగినది. "వటుః అన్యానిధారయేత్" నూతనములైన, మేఖలాజిన దండ వస్త్రములు గ్రహింపవలయును. అనంతరము ఉపనయనమైన బాలుడు వివాహ పర్యంతము, బ్రహ్మచర్య దీక్షతో. వేదశాస్త్ర పురాణ ధర్మశాస్త్ర సంగీతాదులను యథాశక్త్యాను సారము నేర్వదగినది.

వేదాధ్యయనము బ్రాహ్మణబాలుడు విధిగ చేయవలయును
ప్రత్యక్షేణానుమిత్యావా యస్తూపాయో నబుధ్యతే
ఏతం విదన్తి వేదేన తస్మాత్ వేదస్య వేదతా।

అను సంప్రదాయ విధి ననుసరించి, మానవునికి ప్రత్యక్ష ప్రమాణము చేత గాని, అనుమాన ప్రమాణము చేతకాని తెలియజాలని యే పురుషార్థ పాయములు గలవో వానిని తెలియజేయునది గాని వేదమని యందురు.

"ఇష్టప్రాప్తి అనిష్టపరిహార యోరలౌకిక ముపాయం
యోగ్రంథో వేదయతి సవేదః।" అను సాయనాచార్య వేదభాష్య భూమికలో వివరించిన రీతిని, స్వర్గమోక్షాది రూపమగు ఇష్టప్రాప్తికిని. దుఃఖనరకాది అనిష్ట పరిహారమునకు తగిన విధానములను బోధించెడి గ్రంథమునకు వేదమందురు.

ఈ వేదములు నాల్గు ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అథర్వణ వేదము, అని వీనికి పేరు. ఛందోబద్ధమైన, వేదమంత్రములకు, ఋక్కులందురు. యాజుష సంబంధమైన వేదమంత్రములకు. యజుర్వేదమందురు. గాన రూపాత్మకమైన వేదమంత్రములకు, సామవేదమందురు,

అలౌకిక శక్తులద్వారా లోక సంబంధమైన కార్యములను నెరవేర్చుకొనుటకు యేర్పడిన వేదమంత్రములకు అథర్వణ వేదమని వ్యవహారము,

శాంతి పుష్ట్యభిచారార్థ ఏకబ్రహ్మర్త్విగాశ్రయాః
క్రియన్తే థర్వవేదేన త్రయోవాత్మ్య యగోచరాః

అను రీతిని శాంతికరమైన కార్యములు పుష్టిని గలిగించు కార్యములు, అభిచారక కర్మములు మొదలైనవి యథర్వణ వేదమంత్రిల వలన చేయదగినవి కనుక, ఉపనయనము చేయగనే, గురువు ఆబాలునకు

"ఉపనీయ గురుః శిష్యం మహావ్యాహృతి పూర్వకం।
వేదమధ్యాపయేత్, ఏవం, శౌచాచారాంశ్చ శిక్షయేత్

అను ధర్మవచనము రీతిని, బాలునిచే వేదము నేర్పించి, శౌచ ధర్మములు ఆచార ధర్మములు నేర్పించవలయును.

పూర్వము మహనీయులు నాల్గు వేదములు, ఆరు శాస్త్రములు. అష్టదశ పురాణములు, శిక్షాచ్ఛందో జ్యోతిష నిరుక్తాదులు నేర్చుచుండిరి, ఈ శాస్త్రములకే షడంగములని వ్యవహారము.

'బ్రాహ్మణేన నిష్కారణో ధర్మో షడంగో వేదోధ్యేయో జ్ఞేయశ్చ' అను విధి వాక్యానుసారము బ్రాహ్మణుడు (ఏకోరికలు లేకనే) ఏ కారణములు లేకనే నాల్గు వెదములను నేర్వవలయును. షడంగములను అనగా శిక్షా, వ్యాకరణ, ఛందో జ్యోతిష, నిరుక్త, కల్పములను నేర్వవలయును, దర్మశాస్త్రములను చదువవలయును. వీనినంతయు నేర్చుటకుగాను దైవికమైన శక్తిని బడయుటకై ఎనిమిదవ వత్సరముననే యుపనయనము చేయవలయునని నిర్ణయించిరి, ఇట్లు ఎనిమిదవ వత్సరమున నుపనయనము

చేసి నిష్కామముగ వీనినంతయు నేర్పినచో నాబాలుడు తప్పక లోకమున కంతయు యుపకరించి దైవశక్తి సంపన్నుడై లోకోద్ధారకుడు కాగలడు. అందుకై పూర్వము పెద్దలెల్లరు, విధిగ నెనిమిదవ వత్సరమున నుపనయ నాది సంస్కారములు జరిపి వేదశాస్త్రములను చదువుచుండిరి.

ఈనాడు పాశ్చాత్య విద్యా నాగరికతలకు లోనై నీ సంస్కార ములు సకాలమున చేయకను, నీ వేదశాస్త్ర విద్యలను చెప్పించకను, తమకు దేశమునకు జాతికి, నిర్వీర్యత్వము నాపాదించుకొనగల్గుచున్నారు, ఇది మిక్కిలి శోచనీయము.

ఏదో యుద్యోగ వ్యామోహమునకు లోనై, భూసురత్వమును తొలగించుకొని, వేద సంస్కారమ్మునకు దూరులై కేవలము ఉదర నిమి త్తమే జీవించుచున్నామను భ్రాంతికి లోనై మన విద్యలు కళలు సంస్కా రములోని గొప్పదనమును తెలిసికొన నేరక రత్నమును చూచి నెరుంగ లేని యంధునివలె ఈ వేద విద్యలలో గల మహిమ నెరుంగలేక యండ మావులకై పరుగిడు లేళ్ళవగిది, పాశ్చాత్య విద్యా వ్యామోహమనెడి యండమావులకై పరిగిడి పరిగిడి నిర్వీర్యులై యీరీతిని గుర్తింపలేక యుండడము మిక్కిలి విచారకరమేగదా!

ఈ యుపనయన విధిచే 1 శిఖా 2 యజ్ఞోపవీతము 3. సంధ్యా వందనము 4. గాయత్రీ జపము 5. వేదాధ్యయనము అనునవి ముఖ్యముగా భావించి ప్రవర్తించిననే యుపనయనమునకు చరితార్థము కాగలదు.

1. శిఖా:- ద్విజన్మత్వముపనయనముచే సిద్ధించును. ఈద్విజన్మము గల్గిన విప్రుని ద్విజుడనియునందురు. ద్విజునకు శిఖముఖ్యము. శిఖలేని దియే వైదిక కార్యము ఫలించదు. ధర్మశాస్త్రమునను శిఖా ప్రాముఖ్య

మును గూర్చి నిర్ణయించి యున్నారు భారతీయులనదగు హిందువు లెల్లరు శిఖ విధిగ నుంచుకొనవలయును.

ప్రయోగరత్నే - మధ్యే శిరసి చూడా స్యాత్, వాశిష్ఠానాంతు దక్షిణే, ఉభయోః పార్శ్వయోః అత్రికశ్యపానాం, శిఖామతా।

మాధవీయేప్యేవం ఆపస్తంబస్త్వాహ। తూష్ణీం కేశాన్వినీయ యదిర్షి శిఖానిదధాతి, యదిర్షి ప్రవరసంఖ్యయా తాసాం, మధ్యేశిఖా, వర్జ ముపనయనే వపనం కార్యం ప్రతిదివసం ప్రవపతి, త్యుపనయనే తైర్నైవోక్తేః॥

రిక్తో వా ఏషోనపిహితో యన్ముండస్తస్మై తదపి దానం యచ్ఛిఖేతి శ్రుతేః॥

విశిఖోవ్యుపవీతశ్చ యత్కరోతి నతత్కృతమితిని పేఛాచ్చ।

నశిఖనోపవీత్ స్యాత్ నోచ్చరేత్ సంస్కృతాంగిరం।

అను ధర్మాలననుసరించి ద్విజునకు "శిఖ" ముఖ్యమని, శాస్త్రవేత్తలైన మహర్షులెల్లరు నంగీకరించి నిర్ణయించి యున్నారు, శిఖ లేనిదియే వైదికకర్మ యాచరించినను వ్యర్థమంచురు. గాన శిఖ ముఖ్యాతి ముఖ్యము.

గాయత్ర్యాతు శిఖాంబద్ధ్వా నైఋత్యాం బ్రహ్మరంధ్రతః
జుటికాంచతతో బద్ధ్వాతతః కర్మసమారభేత్"

అను ధర్మాన్ననుసరించి వైదిక కర్మలాచరించు తరిని శిఖ ముడివేసి యనంతరము ప్రారంభింపదగియున్నది.

నిబద్ధ శిఖ ఆసీనోద్విజ ఆచమనం చరేత్।
కృతోపవీతం సవ్యేంశే వాఙ్మనః కాయసంయతః॥

శిఖాబంధనమొనర్చి కూర్చొని యాచమనాదులాచరింపదగినదందురు.

శిరః ప్రావృత్యకంఠంవాసక్త కచ్ఛశిఖోపివా।
అకృత్వాపాదయోః శౌచం ఆచాన్తోప్యశుచిర్భవేత్ ॥

పాదములు కడుగుకొనకను, శిఖ ముడివేయకను, వస్త్రము కప్పుకొని గాని ఆచమనాదులు చేయతగదు. ఈ రీతిని ధర్మశాస్త్ర గ్రంథములు గాని, ఆహ్నికతత్వ గ్రంథములుగాని శిఖ లేనిదే వైదికర్మలకు ప్రాశస్త్యమే లేదని వచించుచున్నవి గాన శిఖ ముఖ్యమని యెంత గ్రహించిన యంత మేలు. ద్విజులు తప్ప నింకనేని శిఖా ప్రాముఖ్యమును గ్రహింతురుగాక.

## 2. యజ్ఞోపవీతము

యజ్ఞధృతం ఉపవీతం – యజ్ఞోపవీతం లేక యజ్ఞసూత్రమనియు నందురు. బౌధాయనః ॥ కౌషం సౌత్రం, త్రిస్త్రివృతం, యజ్ఞోపవీతమానామేః। మనుః – కార్పాసముపవీతంస్యాత్.

కార్పాసముపవీతం, వృత్తస్తు త్రివృతం, బ్రాహ్మణస్య అను ధర్మశాస్త్రకారుల వచనముల ననుసరించి, ప్రత్తితో వడికిన దారములు మూడు పోరలతో చేర్చి నొక్కపోగువలె మూడు పోగులకు మూడు మూడులతొమ్మిది పోగులుండులాగున యజ్ఞోపవీతము ధరింపదగినది.

యజ్ఞోపవీతం కుర్వీతసూత్రాణినవతన్తవః
ఏకేనగ్రంధినాతన్తుస్త్రిగుణోధవా.

యనురీతిని తొమ్మిది పోగులతో చేర్చిన మూడుపోగులను 'బ్రహ్మముడి' యనుపేర నొకముడి వేయదగినది. "ఏకోగ్రంధిరీతి, నానాత్వ

నిషేధార్థం" యనురీతిని యొకేముడి యుండదగినది. ఇట్టి నవతన్తునామక యజ్ఞోపవీతధారణార్థమై గర్భాష్టమేబ్దే బ్రాహ్మణస్యోపనయనం శస్తం" అను ధర్మాన్ని పురస్కరించుకొని యేడవ వర్షముననే యుపనయనము బ్రాహ్మణ బాలునకు చేయుట యుత్తమము.

షోడశవర్షాణాం ఉపనయనాంగయపరితీయనే
పతితా యస్యసావిత్రీదశవర్షాణిపంచచా.

అనురీతిని పదునేడు సంవత్సరములు కాగానే సావిత్రీ పతితుడగును, గాన పదునారు సంవత్సరములలోపుగనే బ్రాహ్మణ బాలునకుపనయనము చేయుట ముఖ్యము.

"బ్రాహ్మణో యజ్ఞోపవీత్యధీతే" యను తైత్తిరీయారణ్యకమున యజ్ఞోపవీతము బ్రాహ్మణునకు ముఖ్యాతిముఖ్యమని వచింపబడియున్నది.

నవతన్తు యజ్ఞోపవీతమునకు అధిపతులు

ఓంకారః ప్రథమస్తన్తుః
ద్వితీయోగ్నిస్తథైవచ
తృతీయోభగదైవత్యః
చతుర్థస్సోమదైవతః
పంచమః పితృదైవత్యః
షష్ఠశ్చైవప్రజాపతిః
సప్తమోవిష్ణుదైవత్యః
ధర్మశ్చాష్టమఏవచ
నవమః సర్వదైవత్యః
ఇత్యేతేనవతన్తవః.

## 3. సంధ్యావందనము

ఉపనయనము చేసిన దినము సాయంకాలమునుంచి సంధ్యావందన మాచరింపదగియున్నది. ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము మూడు వేళల సంధ్య వార్చుట విధి, సంధ్యావందనము చేయనిది యుపనయనము చేసియు వ్యర్థము.

"ఉదన్త మస్తంయన్త మాదిత్యమభిధ్యాయన్ కుర్వన్బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్రమశ్నుతే" యను యారణ్యక శ్రుతి ప్రమాణాను సారము ఉదయాస్తమయ సంధ్యాకాలములలో సూర్యున కర్ఘ్యమిచ్చి సంధ్యావందన మొనర్చు బ్రాహ్మణునకు సర్వ శుభములు గలిగించగలనని వేదమాత వచించుచున్నది, ఈ వేదవాక్యమ నను సరించి, సూర్యోదయ కాలమున ప్రాతఃసంధ్యయు, అస్తమయ (మూన) కాలమున సాయం సంధ్యయు సకాలమున నాచరించువారికి శుభ పరంపరలు కొరత యుండవు, ఈ రీతినే మాధ్యాహ్నిక సంధ్యయు తప్పక యాచరించదగి యున్నది.

"వినాయచ్ఛిఖయాకర్మ, వినాయజ్ఞోపవీతతః।
రాక్షసం తద్ధి విజ్ఞేయం, సమస్తానిష్ఫలాఃక్రియాః

అను ధర్మము ప్రకారము, శిఖ లేకపోయిననూ, యజ్ఞోపవీతము లేకున్ననూ, వైదిక కార్యము లాచరించినచో నిష్ఫలములే గాన, శిఖా యజ్ఞోపవీతములు సంధ్యావందనమునకుగూడ ముఖ్యమనియే గ్రహింపదగినది.

నాభేరూర్ధ్వ మనాయుష్యం। అధోనాభేస్త పక్షయః।
తస్మాన్నాభిసమం కుర్యాత్, ఉపవీతం విచక్షణఇతి.

యను రీతిని, యజ్ఞోపవీతము నాభికి సమముగా పొడవుండదగినదిగాని, నాభి

కూర్ధ్వముగానున్నచో ఆయుస్సు క్షీణించును. నాభికి క్రిందనుండినచో చేసిన జపాది తపస్సు నశించును గాన నాభి సమంగా యజ్ఞోపవీతమున్నది లేనిది గమనించి నాభి సమంగా నొనర్చుకొని సంధ్యావందనాది కర్మ లాచరింపదగినది.

"స్తనాదూర్ధ్వం, అధోనాభేఃనకర్తవ్యంకదాచనా" అనురీతిని నాభికి పైకినుండరాదు, నాభికి క్రిందికి నుండరాదు, నాభి సమంగానుండు టయే శ్రేయము.

శిఖా యజ్ఞోపవీతము లెప్పటికి ధరించియే యుండవలయును గాని, అవసరమగుతరిని యుంచుకొని మిగతా సమయములలో తీసివేయరాదు. ఇందుకు ప్రమాణంగా ధర్మశాస్త్రికారిట్లు వచింతురు.

కాయస్థమేవతత్కార్యం, ఊర్ధ్వాప్యంనకదాచన।
సదోపవీతినాభావ్యం, సదాబద్ధశిఖేనచ॥

ఎప్పటికి శరీరముననే ధరించియుండదగిది. శిఖను ముడివేసియే నుంచదగినది. ఉపవీతిగనే యజ్ఞోపవీతము ధరించియుండదగినది. ఈరీతిని శిఖా యజ్ఞోపవీతములు ధరించి యుపనయన ప్రభృతి గాయత్రి యనుష్ఠానమున నుపక్రమింపదగియున్నది,

మౌంజీబంధడనే తిష్ఠేత్ సావిత్రీమభ్యసన్ గురోః
సూర్యేస్తశిఖరం ప్రాప్తే సాయం సంధ్యాం సమభ్యసేత్.

ఉపనయనమయిన వెంటనే నిలచియే సాయంకాలమువరకు సావిత్రి యుపాసనము (గాయత్రీజపము) చేయుచుండవలయును. సూర్యాస్తమయ మగుతరిని సాయంసంధ్యా వందనము చేయదగినది.

ఉపనయన వటువు సంధ్యావందనమువలెనే మఱునాటినుంచి బ్రహ్మయజ్ఞముగూడా నాచరింపవలయును. వేదాధ్యయనమే ప్రారంభించలేదుగాదా? బ్రహ్మయజ్ఞమెట్లు చేయడమను సందియముగలుగవచ్చును. అందులకు ధర్మకారుల సమాధానము పరికించునది.

ఆరభేత్ బ్రహ్మయజ్ఞన్తు, మధ్యాహ్నేతు పరేహని మఱుదినము మధ్యాహ్నమునుంచి బ్రహ్మయజ్ఞముగూడా చేయువలయును.

అను పాకృత వేదస్య, బ్రహ్మయజ్ఞః కథంమ వేత్ ।
వేదస్థానేతు గాయత్రీ గద్యతేన్యత్న మంభవేత్ ॥

వేదము రాకపోయిననూ వేదస్థానమున గాయత్రీ మంత్రమే పఠింపదగినది

వేద మధ్యాపయేత్ ఏనం. శౌచాచారాంశ్చ శిక్షయేత్ ॥

ఉపనయనముచేసిన వటువునకు వేదము నేర్పించవలయును. శౌచాచారాదులలో బాగా శిక్ష యిప్పించవలయును.

దివా సంధ్యాసుకర్ణస్థః బ్రహ్మసూత్రీః ఉదఙ్ముఖః
కుర్యాన్మూత్ర పురీషేవా రాత్రౌ చేద్దక్షిణాముఖః ॥

ఉపనయన వటువు శౌ చా చా ర ము లు తప్పక పాటించడము నేర్వదగియున్నది గాన, పగలుగాని సంధ్యాకాలములలోగాని మూత్ర పురీషములు విడువవలగినచో, యజ్ఞోపవీతము కుడి చెవునకు చుట్టుకొని ఉత్తరముఖముగ కూర్చొని మూత్ర పురీషాదులు వదలదగినది.

రాత్రికాలమున మూత్ర పురీషాదులు వదలవలసివచ్చినచో యజ్ఞోప

వీలము చెవునకు (కుడి చెవుకు) చుట్టుకొని దక్షిణాభి ముఖముగ కూర్చొని విడువదగినది,

మధు మాంసాం జనోచ్ఛిష్టశుక్తం, స్త్రీ ప్రాణిహింసనం,
భాస్కరాలోకనా శ్లీల పరివాదాది వర్జయేత్।

మధు మాంసములు తినరాదు, ఎంగిలి తినరాదు. నిష్ఠురమైన మాటలు పలుకరాదు. (శుక్తం-నిష్ఠుర వాక్యం) స్త్రీలను తదితప్రాణి లోకమును బాధించరాదు, సూర్యుని చూడరాదు. అశ్లీలమైన పలుకులు పలుకరాదు కొట్లాడరాదు. ఈ నియమములు బ్రహ్మచారి (ఉపనయనమైన బాలునకు బ్రహ్మచారి యని పేరు) తప్పక యాచరింపదగినది. ఈ నియమములు విధిగ పాటించుచు సంధ్యావందనము చేయుచు వేదాధ్యయనము చేయుట ముఖ్యము.

అహోరాత్రిస్య యస్సంధిః సూర్యనక్షత్రి వర్జితః।
సాతు సంధ్యా సమాఖ్యాతా, మునిభిస్తత్వ దర్శిభిః॥

అహోరాత్రముల యొక్క సంధి కాలమునకు "సంధ్యా" యని పేరు, ఈ సంధ్యాకాలము ఉదయ సంధ్యాకాలము సాయం సంధ్యాకాలమని ద్వివిధము, సూర్యుడు కనబడకయు నక్షత్రములు లేకనూ యున్నకాలమే సంధ్యాకాలమనదగును.

ఉపాస్యవిధివత్ సంధ్యాం" అను ధర్మము ప్రకారము ఈ సమయమున సంధ్యోపాసన యథావిధిని చేయదగినది.

యదహ్నా కురుతే పాపం, కర్మణామనసాగిరా
ఆసీనః పశ్చిమాం సంధ్యాం ప్రాణాయ మైస్తుహన్తితత్.

ఉదయకాలమున చేసిన పాపములన్నియు, మనోవాక్కాయములకు సంబంధించ పాపములన్నియు, సాయం సంధ్యాకాలమున కూర్చొని ప్రాణాయామము చేయుటచేతనే నశించును,

యద్రాత్ర్యాకురుతే పావంకర్మణామనసాపివా
పూర్వాం సంధ్యాముపాసీనః ప్రాణాయామైర్వ్యపోహతి.

రాత్రికాలమున చేసిన మనోవాక్కాయ కర్మలకు సంబంధించిన పాపములన్నియు యుదయకాలమున చేయు ప్రాణాయామము చేనశించును

ఉపాశ్య పశ్చిమాం సంధ్యాం సాదిత్యాం వైయథావిధి
గాయత్రీమభ్యసేత్తావత్ యావదృక్షాణిపశ్యతి.

సాయంసంధ్య, సూర్యుడ స్తమించుటకు కొంచెమునుపే ప్రారంభించవలయును. నక్షత్రములుదయించువరకు గాయత్రీ జపము చేయు చుండవలయును.

పూర్వాంసంధ్యాం సనక్షత్రాముపక్రమ్యయథావిధి
గాయత్రీ మభ్యసేత్తావత్ యావదాది దర్శనం.

ప్రాతఃకాలమున సంధ్య నక్షత్రములుండగనే ప్రారంభించవలయును సూర్యోదయమగువరకు గాయత్రీ జపము చేయదగినది. సూర్యోదయ కాలమున ఉపస్థానము చెప్పదగినదని విధిగలదు.

ఛాందోగ్యమున "సాయమాసీన,, సంధ్యాముపాస్తే" అని బ్రహ్మవేత్తలు సాయంసంధ్యను కూర్చొని యాచరింపవలయుననియు "ప్రాతః తిష్ఠన్" సంధ్యాముపాస్తే" యను విధిచే నుదయకాలమున నిలిచి సంధ్యావందనము చేయదగినదనియు చాందోగ్యోపనిషత్తులో సవివరముగ బ్రహ్మవేత్తలు తర్కించి నిర్ణయించినట్లు గలదు.

"ఈ విధిని యుల్లఘించినచో దోషము పొందుగాగలదు.

"ఉల్లంఘయతి యో మోహాత్ సయాతినరకం ధ్రువం" అను విధి చొప్పున నరక ప్రాప్తి తప్పదు, సంధ్యావందనమున, అర్ఘ్యప్రదానము, గాయత్రీజపము సూర్యోపస్థానము అని మూడు విధులు ముఖ్యము. అర్ఘ్యప్రదానము సూర్యోదయ సూర్యాస్తమయకాలమున సూర్యునితో "మందేహ" నామకరాక్షసులుసూర్యుని బాదించెదరు. ఆ రాక్షసబాధ నుండి తొలగించుటకై అర్ఘ్య ప్రదానము విధిగ సూర్యోదయానికి కొంచెము ముందుగను అస్తమయకాలానికి కొంచెము ముందుగ చేసినచో మనమిచ్చు మంత్రపూతమైన నీటిబిందువులే వజ్రాయుధరూపమున మారి మందేహ రాక్షసులను దూరముగ పారద్రోలగలవని వేదప్రమాణము గలదు. శాస్త్రప్రమాణముగలదు.

-: వేద ప్రమాణము :-

"పూర్వాభిముఖాః, సంధ్యాయాం గాయత్రియా
అభిమంత్రితా, అపఊర్ధ్వం విక్షిపన్తి"

సంధ్యాకాలమున తూర్పుముఖమున నిలిచి దోసిలినిండా నీరుగొంపు కొని గాయత్రీమంత్రముచే నానీరు నభిమంత్రించి పైకి మూరెడెత్తుకు మించకుండా నుండులాగున ఎగుర (శృంగప్రమాణమెత్తునీరు) వేయదగినది.

"తా ఏతా ఆపోవజ్రీభూత్వా, తాని రక్షాంసి
మందేహారుణేద్వీపే ప్రక్షిపన్తి"

ఆ ఎగురవేసిననీరు వజ్రాయుధమువలె మారి ఆరాక్షస గుణమును మందేహారుణద్వీపమున పడవేయును. అని ఆరణ్యకశ్రుతిలోని సంధ్యావందన ప్రాముఖ్యమునదగిన యనువాకమునగలదు.

ఈ యభిప్రాయమునే శాస్త్రికారురీతిని వివరించియున్నారు.

-: శాస్త్రిప్రమాణము :-

"బ్రహ్మవ్యాహృతి సంయుక్తం గాయత్ర్యాచ, అభిమంత్రితం
దహ్యాన్తేతేనతేద్రైత్యాః వజ్రీభూతేన వారిణా.

యను నియమానుసారము వ్యాహృతిత్రియ సంయుక్తమైన గాయత్రీ మంత్రముతో నభిమంత్రించి పైకి వెదజల్లిడిన నీటిబిందువులు వజ్రసదృశములైనవై రాక్షసబాధను నశింపజేయగలవు.

"ఏతద్విదిత్వాయస్సంధ్యాం, ఉపాస్తే సంసితవ్రతః"

ఈ విషయమెరింగి నియమముతో సంధ్యోపాసన జేసినవాడు,

"దీర్ఘమాయుస్సవిందేత, సర్వపాపైః ప్రముచ్యతే
యస్తుతాం కేవలాం సంధ్యాం ఉపాసీత సపుణ్యభాక్.

సర్వపాప విముక్తుడు, దీర్ఘాయుర్దాయముగలవాడు పుణ్యవంతుడు కాగలడు,

దీనిచే సకాలమున సంధ్యావందనమాచరించు నెడల ఆయుర్వృద్ధి కాగలదు గాన నందుకైన సంధ్యావందనము చేయుట ముఖ్యమని నేటి యువకులు భావించుట యుత్తమము.

ఇట్టి గుణములు మెండుగ సంధ్యావందనము చేయగలవు కనుకనే,

సంధ్యాత్రయంతుకర్తవ్యం ద్విజేన ఆత్మవిదాసదా

ఆత్మవేత్తయగు ద్విజుడు, త్రికాల సంధ్యావందనము తప్పక చేయ దగియున్నది,

ఈ యర్ఘ్య ప్రదానముచేయు విధాన మీరీతిని శాస్త్రికారులు నిర్ణయించియున్నారు,

"అనుసన్నమః ప్రభాతేతు, మధ్యాహ్నే బుజుస్థితః
గాయత్ర్యా ప్రక్షి పేదర్ఘ్యం, సాయంతూపవిశన్ భువి.

ప్రభాతకాలమున నిలిచియుండి కొంచెము వంగి దోసిలిలోని నీరు అభిమంత్రించి పైకి గోశృంగప్రమాణమెత్తులో పైకి యెగురవేసి వదలవలయును. మధ్యాహ్నము చక్కగయుండి వదలవలయును, సాయాహ్నమున కూర్చొని వదలవలయును.

"గోశృంగ మాత్రముధృత్య రవిందృష్ట్వా జలాం జలిం।
దేహపాదే సమేకృత్వా పార్ష్ణి ఉధృత్య ప్రక్షి పేత్॥

దోసిలిలో నీరు నింపుకొని, శరీరము పాదములు చక్కగను చేర్చియు, నుంచుకొని, కొంచము వంగి, సూర్యాభి ముఖముగ నిలిచి, కొంచము మెడమలు ఎత్తి, గాయత్రి మంత్రముతో నభిమంత్రించిన నీరు, గోశృంగ మాత్రి యెత్తు కెగురులాగున నీరు నెగరవేయ వలెను.

ఈ విధి ననుసరించి గాయత్రీ మంత్రము చే యర్ఘ్య మొసంగిన ద్విజునకు, సమస్త శుభములు వేద పురుషుడు పరమేశ్వరుడొసంగగలడని వేద ప్రమాణమే గలదు.

గాయత్రీ జపమహిమ

ప్రిచ్ఛన్నానిచ దానాని, జ్ఞానంచ నిరహంకృతం।
జప్యానిచ సుగుప్తాని, తేషాం ఫలమనంతకం॥

దానము చేయడము రహస్యముగ నుండదగినది. అహంకారములేని రీతిని జ్ఞానవృద్ధిని పొందదగినది. రహస్యముగ జపము చేయదగినది. ఈ విధిని పాటించునెడల, అనంతమైన ఫలములు గలుగగలవు గాన, జపము చేయుతఱిని, గుప్తముగ చేయవలయును,

"పూర్వాం సంధ్యాం జపంస్తిష్ఠేత్, సావిత్రీ మర్కదర్శనాత్"
అను విధి రీతిని, ప్రాతఃకాలమున, సూర్యాభిముఖముగ నిలిచి జపము చేయదగినది.

"పశ్చిమాన్తు సమాసీనః సమ్యగాఋక్ష విభావనాత్"
సూర్యాస్తమయ కాలమున సంధ్యావందనము ప్రారంభించి, సాయం సంధ్యాకాలమున, నక్షత్రదర్శనము వరకు కూర్చొనియె జపము చేయదగినది.

ఆసూర్యదర్శనాస్తిష్ఠన్ ప్రాఙ్ముఖో గాయత్రీం జపేత్
ఆనక్షత్రదర్శనాత్ సాయమాసీనః ప్రత్యఙ్ముఖో జపేత్

"తిష్ఠన్ ప్రాతర్జపేదార్షీం, ఆసీనః పశ్చిమాం జపేత్.
అని పై విధికి ప్రబలముగా మరికొన్ని ప్రమాణములుగలవని చూపడమైనది, వీని చే తేలిన సారాంశమేమనగానుదయము సూర్యాభిముఖముగ నిలిచి జపము చేయదగినదనియు సాయంకాలము పశ్చిమాభిముఖముగ కూర్చొని గాయత్రీ జపము చేయదగినదనియు పెద్దల యభిప్రాయము,

"గాయన్తం, త్రాయసే యస్మాత్ గాయత్రీత్వం తతస్స్మృతాః
తన్నుగూర్చి స్తుతించువానిని రక్షించునది గాన గాయత్రియని పేరు,

మకారం మననాత్ప్రాహుః త్రకారం త్రాణమేవచ।
మనః ప్రాణసమాయుక్తో మంత్ర ఇత్యభిధీయతే॥

మనస్సును రక్షించునది గాన మంత్రమందురు. రక్షించునట్టి మంత్రము గాన "గాయత్రీ మంత్రమని పేరువచ్చుటకు కారణముయినది,

జకారో జన్మవిచ్ఛేదః పకారః పాపనాశనః
జన్మకర్మహరో యస్మాత్, జప ఇత్యభిధీయతే,

జపమని వ్యవహరింతుము. కారణమేమన, జ అనునది, జన్మ లేకుండా జేయును. ప యనునది పాపము నశింపజేయును. కాన, జన్మకర్మల రెంటిని హరింపజేయు జ్ఞానశక్తి నిచ్చునది గాన జపమని వ్యవహారము, యీ కారణములచే "గాయత్రి మంత్ర జపము" అనుటకు కారణమైనది.

"ఉభయతః ప్రణవాం సవ్యాహృతికాం, జపేత్" అను విధి ననుసరించి, వ్యాహృతులకు, మొదట యంత్యమున ప్రణము నుచ్చరించుచు, చేర్చి మంత్రమును జపింపదగినది.

"గృహస్థో బ్రహ్మచారీచ ప్రణవాద్యామిమాం జపేత్"

గృహస్థులు, బ్రహ్మచారులు, ప్రణవత తొలుతనుండులాగున గాయత్రీ మంత్రమును జపించవలయును,

ఉత్తమం మానసం జప్యం, ఉపాం సుక్ష్మధ్యమంస్మృతం।
అధమం వాచికం: ప్రాహుః సర్వమంత్రేషు వైద్విజాః

అన్ని మంత్రములుగూడా, మనస్సులో జపించుట ఉత్తమ ఫలము. కొద్దిగ ధ్వని వచ్చులాగున జపించుట మధ్యమ ఫలము. గట్టిగ జపించుట అధమ ఫలము గలుగగలదు.

"ముక్తి దో మానసోజ్ఞోయః ఉపాంసుస్సర్వ సిద్ధిదః

మోక్షార్థులు మానసికముగ జపింపదగును. ఉపాంసుగ జపించునెడల సర్వ సిద్ధులు సమకూడును అను విధానము గలదు.

"గాయత్ర్యా వేద మూలత్వాత్ వేదః పర్యానుగీయతే।
సావిత్ర్యాస్తు జపస్తాభ్యాం ఏకోప్యానన్యమృచ్ఛతి॥
గాయత్ర్యా వేద బీజత్వాత్ పర్వాభిశ్చ జపస్మృతః

అను విధి ననుసరించి, గాయత్రీ మంత్రము జపించు తజని వ్రేళ్ళ కణుపులతో లెక్కింపదగును, వ్రేళ్ళ కణుపులతో లెక్కించుకొనుటయే గాయత్రీ మంత్రమునకు ముఖ్యము.

అనామికా మధ్యరేఖా మారభ్య తర్జనీ మూల రేఖా పర్యన్తం. ప్రాదక్షిణ్యే క్రమేణ. అంగుష్ఠాగ్రేణ స్పృశన్ మధ్య మాంగుళి మధ్యరేఖా ద్వయం మేరుం।'

అనతిలంఘ్య ప్రాతిలోమ్యేన అంగుష్ఠ మానీయ పూర్వవత్ గుణయన్ తత్తజ్జప సమాపనోక్త కాలపర్యన్తం జపేత్।

అనామిక (ఉంగరపు వ్రేలు) మధ్య కణుపు నుంచి, లెక్కింపదగినది, క్రమముగ, చిటికెన వ్రేలు, అనామిక పై గణుపు, మధ్యవ్రేలు పై గణుపు చూపుడు వ్రేలు మూడు గణుపులవరకు లెక్కింపదగినది. ఇక్కడికి దశ సంఖ్య యగును.

(మధ్య వ్రేలు మధ్య గణుపు చివర గణుపు లెక్కింపదగదు. ఈ రెండు గణుపులకు మేరువని పేరు.)

మరలా, చూపుడు వ్రేలు చివరిగణుపు. మధ్యగణుపు పై గణుపు, మధ్యవ్రేలు పైగణుపు, అనామిక పై గణుపు, చిటికెనవ్రేలు పైగణుపు మధ్య గణుపు, చివరి గణుపు, అనామిక చివర గణుపు మధ్యగణుపు వరకు క్రమంగా లెక్కించునది. ఈరీతిని, అనులోమ విలోమములుగ లెక్కించునది.

''ప్రమాదాత్ క్షుత జృంభణ అధోవాయు నిర్గమనే
ఆచమనస్థానే దక్షిణ శ్రవణం, ఆర్ద్రాం భూమింవాస్పృష్ట్వా జపేత్''

పై రీతిని జపించు సమయమున, ప్రమాదవశమున, తుమ్ము, ఆవలింపు

అధోవాయు నిర్గమము, వచ్చునెడల: దక్షిణ చెవును స్పృశింప వలయును, లేదా భూమిని నేని, గాని తాకవలయును.

"ప్రదక్షిణే ప్రణామేచ పూజాయాంహవనే జపే।
న కంఠా వృత వస్త్రి స్యాత్. దర్శనే గురు దేవయోః॥

జపముచేయు తఱిని శరీరమునిండుకు వస్త్రము కప్పుకొని జపము చేయరాదు. ఈ రీతినే. ప్రదక్షిణము చేయు. తరిని, నమస్కరించు తఱిని, పూజచేయు నప్పుడు. హోమము చేయువేళలలోను, పై వస్త్రము నడిమ కట్టుకొనవలయునేగాని కప్పుకొనరాదు.

"గర్భాధానాద్యాః క్రియా ఉపనైన పర్యన్తా యధావిధి కృత్వా వేదమస్మై బ్రహ్మచారిణే ప్రయచ్ఛతి సగురుః"

గర్భాదానాది యుపనయన పర్యంతముగల సంస్కారములు యథా విధిని జరిపించి, వేదము నేర్పినవానిని "గురువు" అని వ్యవహరింపదగినది.

"యః ఉపనయన మాత్రం కృత్వా వేదం ప్రయచ్ఛతి

స ఆచార్యః" ఉపనయన సంస్కార మొక్కటి మాత్రము జరి పించి వేదము బోధించిన వానిని "ఆచార్యుడందురు.

"మంత్ర బ్రాహ్మణయోః ఏకంవా, అంగానివా యోధ్యాపయతి స ఉపాధ్యాయః

వేదము నందలి మంత్ర భాగముగాని, బ్రాహ్మణ భాగముగాని. లేక శిక్షా, వ్యాకరణ, ఛందో జ్యోతిష నిరుక్త కల్పములలోనే యొక్క భాగ ముగాని బోధించిన వానిని ఉపాధ్యాయుడందురు,

పాకయజ్ఞాదికం కరోతి స ఋత్విక్.

యజ్ఞయాగాది భాగాలు చేయించు వానిని ఋత్విజుడందురు.

"తపసశ్చ పరస్యైహ నిత్య స్వాధ్యాయవాన్ ద్విజః

నిత్యము వేదాధ్యయనము చేయు నెడల, తపస్సగును, అనగా నింత కన్నా మించిన తపస్సు వేరొండు లేదని భావము. కనుక ఉపనయనము నాటినుండి వేదము నేర్చి వేదాధ్యయన, తత్పరుడై తపోవంతుడగుట, యుత్తమలక్షణము, కాన గురువు వచించిన రీతిని నిత్యము గాయత్రీమంత్ర జప తత్పరుడగుట ముఖ్యము,

"గృహస్థో బ్రహ్మచారీచ శత మష్టోత్తరం జపేత్"

అను ధర్మము ప్రకారము, గృహస్థుడు బ్రహ్మచారియు నిత్యము నూట యెనిమిది సంఖ్యాకముగ గాయత్రీ మంత్ర జపము చేయదగి యున్నది.

"స్వర వర్ణ పదై ర్వాక్యం. శుద్ధ మావర్తయన్ జపేత్।

స్వరము, అనగా, ఉదాత్త, అనుదాత్త, స్వరిత ప్రచయాది స్వరము లేయే యక్షరములకు గలవో వానిని గురుముఖతః బాగుగ నెరిగి. వర్ణములేవేవి యెట్లెట్లు చ్చరించునది గుర్తించి. పదవిభాగ కాలమున చెందు మార్పులను పరిశీలించి, వాక్యత్రియ యుక్తముగ నుండు రీతి నెరింగి తప్పులు లేక శుద్ధముగ నుండులాగున గమనించి జపింప దగినది.

"ప్రణవం వ్యాహృతీ స్తిస్రో గాయత్రీంచ జపేత్క్రమాత్"

అను విధి చొప్పున. తొలుత ప్రణవముచ్చరించి, అనంతరము వ్యాహృతీ త్రియమును చెప్పి, యనంతరము గాయత్రీ మంత్రము నుచ్చరింపదగినది.

"అచ్ఛిన్న పాదా గాయత్రీ బ్రహ్మహత్యాం ప్రయచ్ఛతి।
భిన్న పాదాతు గాయత్రీ బ్రహ్మహత్యాం వ్యపోహతి

అను వైద్యనాథీయ స్మృతి ముక్తా ఫల ధర్మశాస్త్రమున విష్ణు వచనాను సారము గాయత్రీ మంత్రమును, పాద భేదము లేక జపించినచో బ్రహ్మ హత్యాది దోషములు గల్గును గాన, పాదత్రయ భేదముతో గాయత్రీ మంత్ర జపము చేయు నెడల బ్రహ్మహత్యాది దోషము లెల్లయు తొలగును.

> "ఉత్తమం మానసంజప్యం, ఉపాం శుర్మధ్యమం స్మృతం।
> అధమం వాచికం ప్రాహుః సర్వ మంత్రేషు వైద్విజాః॥

అను రీతిని, మానసికంగా చేయు జపముత్తమము ఉపాంశువు అనగా, ధ్వని రహితముగా పెదములు కదలించుచు చేయు జపము మధ్యమ ఫలితము. ధ్వనితో బిగ్గరగ జేయు జపము అధమ ఫలితము గల్గును. గాన క్రమక్రమముగా, సాధకుడు. వాచికము నుంచి, వుపాంశువునకు, వుపాంశవునుంచి మానసిక జప శక్తిని, సోపానక్రమునుగ నధిరోహింపదగును,

> "ప్రాతరుత్తాన పాణిభ్యాం, స్తబ్ధాభ్యాం దినమధ్యమే।
> అధోముఖాభ్యాం పాణిభ్యాం. సాయం సంలక్ష్మీతో జపేత్
>
> ప్రాతర్నాసా సమాం కుర్యాత్. మధ్యాహ్నే తూరసాసమా
> సాయంకాలే నాభి సమా, కర్తా, కుర్యాదతంద్రిత,

అను వైద్యనాథీయాహ్నిక కాండములోని వ్యాసోక్తి ననుసరించి, వుదయము నిలువబడి, హస్తములు రెండు ముక్కుకు సూటిగ నుండులాగున నుంచుకొని, నూటయెనిమిగి సంఖ్యగ. గాయత్రీ జపము చేయదగినది.

మధ్యాహ్నకాలమున హృదయమునకు సరిగ నుండులాగున హస్తములుంచుకొని జపింపదగినది.

సాయంకాలము నాభికి సమముగ హస్తములుంచుకొని జపింప దగినది.

"సత్త్వైరపివభాషేత జపహోమార్చనాదిషు"

అను ధర్మము ప్రకారము జపము, హోము, పూజ చేయుకాలమున యదార్థవిషయములైనను మాట్లాడరాదు.

'మతిమాన్నకదాచిత్తు గాయత్రీముదకేజపేత్
గాయత్ర్యగ్నిముఖేప్రోక్తా తస్మాదుత్తీర్యతాం జపేత్"

అని వైద్యనాదీయస్మృతిముక్తాఫల ధర్మశాస్త్రమున అహ్నిక కాండలో గోభిలవచనముకీతిని నీటిలో నిలిచి, యెన్నడూ బుద్ధిమంతుడైనవాడు గాయత్రీ జపము చేయరాదు. గాయత్రి "అగ్నిముఖ" గాన నీటిలో నిలచి చేయతగదు.

"నజీర్ణేన ననీలేన పరిప్లుష్టేనవాజపేత్"

అను నియమము మేరకు చినిగిన వస్త్రము ధరించిగాని, నీలవర్ణ వస్త్రము ధరించిగాని మలిన వస్త్రము ధరించిగాని గాయత్రీజపము చేయుతగదు.

ఏతదక్షరమేతాంచ, జపన్వ్యాహృతి పూర్వికాం।
సంధ్యయోర్వేదవిప్రో వేద పుణ్యేనయుజ్యతే"

("ఏతదక్షరం – ప్రణవం, ఏతాం – గాయత్రీం")

ప్రణవముతో వ్యాహృతిత్రయముతో గాయత్రీ జపము చేయ దగినది.

వ్యాసః। ప్రణవవ్యాహృతియుతాం గాయత్రీన్తుతతో జపేత్
సమాహితమనాః తూష్ణీం మనసా వాపి చిన్తయేత్.

అను వ్యాసవచనానుసారము ప్రణవ వ్యాహృతిసహిత గాయత్రిని జపింపదగదది.

బోధాయనః। ప్రణవో వ్యాహృతయస్తిస్రః సావిత్రీచేత్యేతే పంచ బ్రహ్మయజ్ఞా అహరహః బ్రాహ్మణం కిల్బిషాత్ పావయన్తీతి, అను రీతిని ప్రణవము వ్యాహృతిత్రయముతో గాయత్రిని జపింపదగుననిరి.

యోగయాజ్ఞవల్క్యః "ఓంకారం పూర్వముచ్చార్య భూర్భువస్స్వస్తథైవచ। గాయత్రీం ప్రణవంచాన్తే జపఏవముదాహృతః। అను రీతిని ఆద్యన్తములలో ప్రణవసహిత వ్యాహృతియుత గాయత్రిని జపింపదగుననిరి. బోధాయనోపి "ఉభయతః ప్రణవాం, సవ్యాహృతికాం జపేత్" అనురీతిని వ్యాహృతితో గూడిన ఉభయస్థానముల ప్రణవముగ గాయత్రిని పఠింపదగుననిరి.

"పఞ్చోంకారాన్ జపేద్విప్రో గాయత్రీం మనసాశుచిః
అనేక జన్మజైః పాపైర్ముచ్యతే నాత్రసంశయః

అని యీరీతిగ పలుపలు విధములుగ గాయత్రీ మంత్రమునకు ప్రణవమును గూర్చి చర్చించిరి. ఈ చెప్పిన విధానమంతయు "తత్సర్వంగృహస్థబ్రహ్మచారి వ్యతిరిక్త విషయం" అను ప్రమాణము ప్రకారము,

"ప్రణవోవ్యత్రమంత్రాద్యా, వ్యాహృతీత్రితయంతతః। జపేత్ప్రశస్తాసావిత్రీ ప్రణవేన సమన్వితా, అతిప్రశస్తాతేనాపి వ్యాహృతిత్రితయేనచ,

అనురీతిని ప్రణవము వ్యాహృతిత్రయము ప్రణవముతో మంత్రము పఠింపదగినది. అని విశ్వామిత్రవచనమునకు భావము.

సంవర్త: "ప్రణవా ద్యాంతు, సంధ్యాయాం, జపేత్ వ్యాహృతిభిః సహ" అనురీతిని ప్రణవముతో మంత్ర జపము చేయదగును.

"గాయత్రీరహితావిప్రాః తత్రైవ నరకం ప్రజేత్.

అని గాయత్రీ తంత్రమున చెప్పినరీతిని గాయత్రీ మంత్ర జపము లేని విప్రులు నరకమును బొందుదురు.

"శాలగ్రామశిలామగ్రే కృత్వా దివ్యంకరోతియః"

అను గాయత్రీ తంత్ర ప్రమాణానుసారము శాలగ్రామముల యెదుట గాయత్రీ జపమొనర్చినెడల దివ్యత్వము గల్గును.

ఛాందోగ్యోపనిషత్తులోని ద్వితీయ ప్రపాఠకము మొదలీ గాయత్రీ యనుష్ఠాన విధానముగలదు. అందులోని తృతీయ ప్రపాఠకమున "ఇత్యు పాసీత తేజస్వ్యన్నాదో భవతియ ఏవం వేద" అను మంత్రములోని ధర్మము ప్రకారము గాయత్రీ జపతత్పరుడు తేజోవంతుడు కాగలడు. కాన శిష్టాను సారము గురుముఖతః వచ్చినరీతిని ప్రణవసహిత వ్యాహృతిసహిత గాయత్రినిగాని ప్రణవ వ్యాహృతి ప్రణవసహిత గాయత్రినిగాని ప్రణవ త్రయ గాయత్రినిగాని జపించదగునని రూఢి.

అగ్నికార్యము – లేక – సమిధాధానము.

ఉపనయనమయిన వటువునకు బ్రహ్మచారియని వ్యవహరింతురు. బ్రహ్మచారియైన వటువు సంధ్యావందనము యెంతముఖ్యమో నంత ముఖ్యము సమిధాధానము చేయదగినది. ఈ సమిధాధానమునకే అగ్ని కార్యమనియు పేరు.

ఈ అగ్ని కార్యము ఉదయము సాయంకాలములయందు చేయదగినది. రాగి సమిధలచేతగాని, మోదుగ సమిధలచేగాని నీ యగ్నికార్యము చేయవలయును.

సమిధాదానము ఉపనయనమునాటినుంచి వివాహ పర్యంతము బ్రహ్మచారి విధిగ చేయవలయును. "ఆయుషా, వర్చసా, యశసా, బ్రహ్మవర్చసేన, అన్నాద్యేన" అనునట్లు అగ్నిహోత్రమున బ్రహ్మచారి, సమిధలను అర్పించి తనకు ఆయుర్వృద్ధి కావలయుననియు తేజోవృద్ధి కావలయుననియు, కీర్తివృద్ధి కావలయుననియు బ్రహ్మవర్చస్సు వృద్ధికి వలయుననియు కోరి యగ్ని కార్యమాచరింపదగియున్నది పదమూడు మంత్రములతో నిత్యము పదమూడు సమిధలు హోమము చేయుటకే సమిధాధానమని వ్యవహారము.

శ్రద్ధాం మేధాం. యశః ప్రజ్ఞాం, విద్యాం బుద్ధిం శ్రియం బలం
ఆయుష్యం తేజ ఆరోగ్యం దేహిమే హవ్యవాహన,

అని శ్రద్ధా మేధా ప్రజ్ఞా బుద్ధి బల యారోగ్యాదుల నివ్వమని యగ్నిని ప్రార్థించి పొందుటకై విధిగ నీ సమిధాధానము యేర్పడియున్నది కాన బ్రహ్మచారులెల్లరు నీ సమిధాధానమాచరించిన తప్పక శ్రద్ధా మేధా బుద్ధి బలాదులు బొందగలరు.

## — ఉపాకర్మ —

ఉపనయన ప్రభృతి ఆ జీవితము శ్రావణ పౌర్ణమినాడు ఉపాకర్మ విధి నాచరించుచునేయుండదగినది. ముఖ్యముగ తొలి యుపాకర్మ, లేక ప్రథమ శ్రావణము అనురీతిని నూతనముగ ఉపనయనమైన వటువు యథా విధిని యుపాకర్మను నాచరించుటకై ప్రయత్నింపదగియున్నది, ఇందుకు బోధాయనులు;

"శ్రావణ్యాం పౌర్ణమాస్యాం ఆషాఢ్యాంవా ఉపాకృత్య తైష్యాం మాఘ్యాంవా ఉత్సృజేయుః॥ అను నిర్ణయము ప్రకారము, శ్రావణ పౌర్ణమినాడు గాని ఆషాఢ పౌర్ణమినాడు గాని, ఉపాకర్మ నాచరింప దగి నదనియు పుష్య పౌర్ణమిగాని మాఘ పౌర్ణమిగాని, ఉత్సర్జనము చేయదగి నదనియు నిర్ణయించిరి.

ఆపస్తంబహాగ్ని పుంగవులు:- శ్రావణ్యాం పౌర్ణమాస్యాం అధ్యాయము పాకృత్య మాసం ప్రదోషేనాధీయీత తైష్యాం పౌర్ణమాస్యాం రోహిణ్యాంవా పిరమేద,

అను విధి చెప్పున, శ్రావణ పౌర్ణమి నాడు ఉపాకర్మనొనర్చి పుష్య పౌర్ణ మినాడు ఉత్సర్జనము చేయదగినది. లేదా, రోహిణీ నక్షత్రయుక్త పుష్య మాసమున యైన ఉత్సర్జనము చేయదగినది.

"అధ్యాయనాం ఉపాకర్మ శ్రావణ్యాం తైత్తిరీయకాః,
బహ్వృచాః శ్రవణే కుర్యుః సింహస్థోర్కేభ వేద్యది॥

యజుర్వేదీయులైన తైత్తిరీయ శాఖాధ్యాయులు శ్రావణ పౌర్ణమి నాడే యుపాకర్మ చేయదగినది. ఋగ్వేదీయులు శ్రావణ మాసములో శ్రవణ నక్షత్రమెన్నాడుండునో నాడే యుపాకర్మ చేయదగినది.

"గహణే సంక్రమేచ, తదుపాకర్మనకుర్యుః" అను నిషేధము చెప్పున, శ్రావణ పౌర్ణమినాడు, గ్రహణముగాని, సంక్రమణము గాని యున్నచో, ఉపాకర్మ చేయరాదు, కాన

"సమాస్త శుక్లపంచమ్యాం నతద్గ్రహణ సంక్రమే।
అసింహార్కే ప్రోష్ఠపద్యాం శ్రవణెచ వ్యవస్థయా।

అను రీతిని, "తత్రాసంభవే తస్మాదేవ హస్తా నక్షత్రయుక్త పంచమ్యాం వాకుర్యుః। గ్రహణే సంక్రమే చ తదుపాకర్మ న కుర్యుః కాన, శ్రావణశుద్ధ పంచమీ హస్త నక్షత్ర యుక్తమై యున్నచో పౌర్ణమి గ్రహణ సంక్రమాది దోషమైనచో, యుపాకర్మ చేయరాదు గాన, హస్త నక్షత్రయుక్త శ్రావణ శుద్ధపంచమి యుపాకర్మ చేయుదగినది.

"అసింహార్క ఇతి, యది సూర్యః సింహ రాశిస్థో౽భవతి. తదా ప్రోష్ఠపద్యాం తైత్తిరీయకాః కుర్యుః। బహ్వృచాః శ్రవణ నక్షత్రయుక్త తిథే ఇతివ్యవస్థా। చకారాత్ భాద్రపదమాసే హస్తా నక్షత్రయుక్త తిథౌ ఇతి సూచితం॥

సింహారాశిలో సూర్యుడు లేని తఱిని శ్రావణ పౌర్ణమిరోజున తైత్తిరీయులు యుపాకర్మ చేయతగదు గాన భాద్రపదమాస పౌర్ణమినాడుపాకర్మ చేయు దగును. ఋగ్వేదులు మాత్రము శ్రవణ నక్షత్రయుక్త శ్రావణమాసము ననే యుపాకర్మ చేయుదగినది. హస్తా నక్షత్రయుక్త భాద్రపద మాసము ననూ చేయుదగును.

"పర్వణ్యౌదయికే కుర్యుః శ్రావణే తైత్తిరీయకాః
బహ్వృచాః శ్రవణే కైతు హస్తర్క్షే సామవేదినః

శ్రావణ పౌర్ణమినాడు ఉపాకర్మ తైత్తిరీయులు చేయదగినది, ఋగ్వేదులు శ్రవణ నక్షత్రమున్న రోజుననే యుపాకర్మ చేయదగినది. సామవేదులు హస్తా నక్షత్ర తిథి రోజున యుపాకర్మ చేయుదగినది,

మలమాసే నిపతితే సూతకే మృతకేపివా।
గ్రహణే సంక్రమేవాపి మేధ్యేపి గురుశుక్రయోః॥
ప్రోష్ఠపద్యాం అథాషాఢ్యాం ఉపాకరణ మిష్యతే॥

శ్రావణ మాసము అధిక మాసముగనున్ననూ, జాతాశౌచ, మృతాశౌచ మును వచ్చియున్ననూ, శ్రావణమాసమున పౌర్ణమినాడు ఉపాకర్మ చేయరాదు. ఆరీతిని, శ్రావణ పౌర్ణమినాడు, గ్రహణముగాని, సంక్రమణము గాని లేక గురు శుక్ర మౌఢ్య దోషములున్ననూ శ్రావణ పౌర్ణమి యుపాకర్మకు తగదు గాన, భాద్రపద మాసమున యుపాకర్మ చేయదగినది ఈ భాద్రపదమునను దోషయుక్తమే యై యున్నచో ఆషాఢ పౌర్ణమి నాడే యుపాకర్మ చేయదగినది.

"ప్రోష్ఠపద్యాం ఉపాకుర్యాత్, శ్రావణీ దూషితాయది।
ఆషాఢేవాపి కర్తవ్యం, ప్రోష్ఠపద్యాస్తు దూషణే।
మాసత్రయేపి దోషశ్చేత్ శ్రావణ్యామేవ కారయేత్॥

శ్రావణ పౌర్ణమి పై చెప్పిన దోషయుక్తమై యున్నచో భాద్రపద పౌర్ణమి నాడుపాకర్మ చేయదగును. భాద్రపద పౌర్ణమి దోషయుక్తమైనచో ఆషాఢ పౌర్ణమినాడుపార్మ చేయదగును. ఆషాఢ శ్రావణ భాద్రపద పౌర్ణమిలు మూడు దోషయుక్తములై యున్నచో శ్రావణ పౌర్ణమి నాడే యుపాకర్మ చేయదగును,

త్రిష్వపి దుష్టేతు శ్రావణేమాసి శాంతిపూర్వకా కర్తవ్యా
ఉదితశాంతిక్రైః గ్రహయజ్ఞోక్త మంత్రైః॥

అనుగీతిని శ్రావణ భాద్రపద ఆషాఢ మాసములు మూడు గురు శుక్రాస్తమయములచేతను. గ్రహణ సంక్రమణాదులచేతను. అధిక మాసాద్యుల చేతను దోషవంతములైనచో శ్రావణమాస పౌర్ణమినాడే నవగ్రహాది శాంతి జరపుకొని, యుపాకర్మ చేయదగినది.

కాన యీరీతిని శ్రావణమాసమును పరిశీలించి యుపాకర్మ యాచ

రింప దగినది ఈ యుపాకర్మ చేసినచో వేద చోదిత కర్మలు తాను యాచ రించు నెడ, ఫలవంతములగును. వేదపాఠము ఫలించును. లేనిచో అనగా యుపాకర్మ యాచరింపనిచో ఫలితము వైదిక కర్మలకు తక్కువయగును.

అందు చేతనే, యుపాకర్మ విధిని నీరీతిని గృహ్య సూత్రమున చెప్ప బడి యున్నది.

ఓషధీషు ప్రాదుర్భావే శ్రావణ్యాం పౌర్ణమాస్యాం, శిష్యైస్సహాచారః నదీం తటాకం వాగత్వా, కేశశ్మశ్రులోమనఖాని వాపయిత్వా మృత్తికాస్నానం, వారుణ స్నానంకృత్వా సంధ్యావందనాదికం కుర్యాత్। ప్రాగ్దేశే గోమయే నానులిప్య, రంగవల్ల్యాది భిరలంకృత్య. నూతన వస్త్రేణ మంటప మాసాద్య, తస్యోపరి, యథాశక్తి తండులాన్నిధాయ, ఆదే దీపా రాధనంకృత్వా ప్రణమ్య।

అను సూత్రకారులైన, ఆపస్తంబ మహర్షుల వచనానుసారము, ఓషధులు మొలచిన కాలమైన శ్రావణ పౌర్ణమినాడు, శిష్యులతో గూడ, గురువు, నదికి గాని, తటాకమువద్దకు గాని వెళ్ళి ఆయువక్రకర్మ నిర్వర్తించి మృత్తికాస్నానములు, వారుణస్నానములు చేసి, సంధ్యావందనాదులు ఆచ రించి. తూర్పుదిశలో గోమయముచే నలికి, ముగ్గులు తీర్చి, నూతన వస్త్ర మువరచి, తండు బియ్యముపోసి, దీపారాధనాదులు చేసి యుపాకర్మ యారంభింపవలయును.

బ్రహ్మచర్య వ్రత లోప ప్రాయశ్చిత్తార్థం, సహిత్రయోదశ హోమము చేయవలయును, ప్రాజాపత్యాది నవ ఋషులను పూజింపవలయును

చదివిన వేదాధ్యయనము శక్తివంతమగుటకను అధీతానాంచందసాం

సవీర్యత్వాయ అధ్యాయోపాకర్మ హోమం కరిష్యే అని యుపాకర్మ హోమము చేయుదగినది

"ఛందసాం సవీర్యత్వాయ. శ్రౌతస్మార్త నిత్యకర్మానుష్ఠాన యోగ్యతాఫల సిద్ధ్యర్థం. యజ్ఞోపవీత దానం, ధారణం కరిష్యే" అని యజ్ఞోపవీత దాన ధారణములు చేయవలయును.

సంవత్సరకృత దోష ప్రాయశ్చిత్తార్థం, విరజా హోమము చేయవలయును,

మాతుల మసీతి యను వాకచతుష్టయమును. జపించి స్వగృహాముపకు విచ్చేయవలయును.

ప్రాజాపత్యాది వేదవ్రత చతుష్టయమును నిర్వర్తించి, స్నాతక వ్రతము ఆచరించి. యనంతరము వివాహము చేసికొనవలయును ద్విజులు

అనంతరము "మమఆయుష్యాభివృద్ధ్యర్థం, స్నాతకవ్రతాఖ్యం కర్మ కరిష్యమాణః" యని ఆయుర్వృద్ధికై స్నాతక వ్రతము విధిగ చేయుదగినది.

"సర్వేషాం దోషాణాం అపనోదనార్థం, స్నాతక వ్రతము, నాచరింపదగినది. "ఉపనయనాది సమావర్తన పర్యన్తం మధ్యే సంభావితానాం పాపానాం వృద్ధోల్లంఘన పాషండాది సంసర్గ ప్రభృతిత్రియ త్రింశన్నిమిత్తానాం సర్వేషాం దోషణాం అపనోదనార్థం, బ్రహ్మచర్యవ్రత లోపప్రాయశ్చిత్తం నిశ్చిత్య ఉపదిశ్య మామను గృహ్ణాంతు భవంతః" అని, బ్రాహ్మణవటువు, విద్యాభ్యాసాద్యనంతరం స్నాతక వ్రతమను కార్యమును నాచరింప దగియున్నది. అనంతరము వివాహార్థమై ప్రయత్నాదులు చేయదగును.

''చరిత బ్రహ్మచర్యోహం, కృతవ్రత చతుష్టయః
కాశీయాత్రాం గమిష్యామి అనుజ్ఞాం దేహిమే శుభామ్''

అని స్నాతక వ్రత కాలమున చేరిన పెద్దలనుగూర్చి కాశీయాత్రకు, అనుజ్ఞ యియ్యవలసినది, విద్యాభ్యాసానంతరము వేదవ్రత చతుష్టయమును నాచరించిన పిదప, కోరవలయును.

అట్టితరిని, కన్యాదాత, యెదురై,

"సాలంకారాంమమసుతాం, కన్యాం దాస్యామి హేద్విజ
పాణింగృహీత్వా సాగ్నిస్త్వంరం గచ్ఛ, స్వాగచ్ఛమద్గృహమ్''

అని యాచించి వివాహార్థమై కన్యనొసంగును.

''వి వా హ ము''

గార్హస్థ్య ధర్మమునకు వివాహము నాంది వయస్సు వచ్చిన బిడ్డలకు వారి వారి తల్లిదండ్రులు దాంపత్యము నిమిత్తమై నీ వివాహ కార్యము నిర్ణయింతురు.

విశిష్టం వహానం (వి + వహ + ఘఞ్) అను వ్యుత్పత్తి ననుసరించి. వరుడు శ్రేష్ఠమైన కన్యను వరించడము అను భావము వివాహమునకు నిర్ణయింతురు.

ఉహ్యతే అనేనేతి – వహ + కరణేల్యుట్ – వాహః యథా ।
తరణోభేల కే వారి రథోనౌస్త్రికః ప్లవః

వాహస్తు వాస్తుర్వాహనం పహితం వార్యటః పుమాన్, అను త్రికాండ శేష నిఘంటువు ననుసరించి'' వాహః.

వివాహము - ఉద్వాహము - దారపరిగ్రహము - ప్రణయము- పాణిగ్రహణము, అని పర్యాయ పదములుగా నీ వివాహమునకు లోకమున వాడుటయు గలదు. ఈ వివాహము లెనిమిది భేదములని శాస్త్ర వేత్తలు నిర్ణయించియున్నారు.

“బ్రాహ్మో దైవస్తథార్షః ప్రాజాపత్య ఆసురో, గాంధర్వో రాక్షసః పైశాచ ఇత్యష్టౌ వివాహాః” యని యీ యెనిమిదింటికిని పేరు. అనగా 1. బ్రాహ్మము 2. దైవము 3. ఆర్షము 4. ప్రాజాపత్యము 5. ఆసురము 6. గాంధర్వము 7, రాక్షసము 8 పైశాచము అని యెనిమిదింటినందురు

1. బ్రాహ్మ వివాహమనగా “యోగ్యవరమాహూయ అలంకృత్య కన్యాదాన విధినా తస్మై దానం బ్రాహ్మో వివాహః” అను ధర్మము ననుసరించి యోగ్యుడైన వరుని రావించి యా వరునికి తగినరీతిని యలంకరించి, కన్యాదాన కర్మము పరికారము చేయు వివాహమునకు బ్రాహ్మ వివాహమందురు. ఈ బ్రాహ్మ వివాహమునే ప్రకృతము లోకమున యెల్లరు నాచరించుచవి, చెప్పబడు నెన్మిది వివాహములపైకి నీ బ్రాహ్మ వివాహము మిక్కిలి శ్రేష్ఠము. శాస్త్రికారులెల్లరు నంగీకరించినది. కన్యాదాత వంశమునకు కన్యను గ్రహించిన వరుని వంశమునకు ఇహపర సాధనమైనది. వరుని శ్రీలక్ష్మీ నారాయణ స్వరూపులుగ భావించి కాళ్ళు కడిగి ధారాదత్తముగ నాచరించు వివాహ మీ బ్రాహ్మీ వివాహమే కనుకనే కన్యాదాన సమయమున

“కన్యాం కనక సంపన్నాం కనకాభరణైర్యుతాం
దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోక జిగీషయా”

అని వరునికి కన్యాదాత పైరీతిని వచించుచు కన్యాదాన మొనర్చును.

బంగారాభరణములతో నలంకరించిన యీ కన్యను విష్ణుస్వరూ

పుడవైన నీకు దానమొసంగు చున్నాను. ఈ దాన కార్యముచే, బ్రహ్మ లోకమును పొందు శక్తి నాకు గల్గుగాక.

"కన్యామమాగ్రతో భూయాః కన్యే మే దేవి పార్శ్వయోః కన్యమే సర్వతో భూయాః త్వద్దానాత్ మోక్షమాప్నుయాం"

"విశ్వంభరస్సర్వభూతాః, సాక్షిణ్యః సర్వదేవతాః
ఇమాం కన్యాం ప్రదాస్యామి పితవాణాం తారణాయవై

"కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే
ప్రియతోహం ప్రియచ్ఛాచః ధర్మకామార్థ సిద్ధయే

అను రీతిని. మోక్షార్థము, పితృదేవతలెల్లరు తరించుటకుగాను, ధర్మకా మార్థ సిద్ధులు గల్గుటకును. కన్యాదాన మొసంగుచున్నామని కన్యాదాత వరునితో నుడువదగు వివాహము బ్రాహ్మ వివాహము. అందు చేతనే. బ్రహ్మ క్షత్రి వైశ్య శూద్రులందురు. పై చెప్పిన యెన్మిది వివాహముల పైకి, యీ బ్రాహ్మ వివాహముచే. పురార్థసిద్ధి. పితృదేవతలు తరించ డము వంటి మహాఫలములు గలవని భావించి, ఈ వివాహమును ముఖ్య ముగ నాచరింపదలంచు చున్నారు.

(2) యజ్ఞేబుత్విక్ కర్మ కుర్వతే, అలంకృత్య కనార్పణం దైవః" అను వచనానుసారము యజ్ఞయాగాదులాచరించు తఱిని, యా కార్యము లలో పాల్గొనిన. వటువునకు, అలంకరించిన కన్యనొసంగడము "దైవ" వివాహమందురు.

అనగా నేదేని యాగాదులాచరించు కాలమునః వచ్చిన వారిలో తగిన వటువునుగాంచి. వానికి వివాహార్థమై కన్యనొసంగడము దైవ వివాహము గాన నిందు కన్యా దానము లేదు కన్యను అర్పించడము మాత్రమే, కాన

దాన ఫలము సమగ్రముగ చేకూరదు గాన, మొదట చెప్పిన బ్రాహ్మ వివాహమునే నాచరించుట పరిపాటియైనది.

(3) వరాదేకం గోమిథునం ద్వేవాగృహీత్వా తస్మై కన్యాప్రదానం ఆర్షః" అనురీతిని, వరుని వద్దనుంచి, ఆవులను పుచ్చుకొని బదులుగ కన్యను యిచ్చివేసినచో, నీ వివాహమునకు ఆర్ష వివాహమని పేరు. అనగా వరుని నుండి ప్రతి ఫలమును గోరి కన్యనొసంగడము, కాన నిదియు వైవాహికాముష్మిక ఫలము నివ్వజాలదు, పితృవర్గమును తరింపజాలదు. కన్యాదాతకు బ్రహ్మలోక నివాససిద్ధి యివ్వజాలదు గాన, పెద్దలు తొలుత జెప్పిన బ్రాహ్మవివాహమునే నాచరించుటకు కారణమైనది.

(4) స్వయమేతద్వైవసహ గృహధర్మ ఆచరణీయ ఏతస్యా జీవన పర్యన్తం వివాహోత్తరం చతుర్థ్యాం శ్రీమేవాన కార్యఇత్యా భావ్య కన్యాదానం ప్రాజాపత్యః" అను రీతిని, వధూవరు లుభయులు, జీవిత పర్యన్తము దాంపత్య ధర్మముతోనే మెలంగుచుండవలయునని మాట్లాడుకొని, వారి ఇష్టరీ, యొకరినొకరు నిర్ణయించుకొని నాచరించు వివాహమునకు ప్రాజాపత్య వివాహమందురు. ఇందు వధూవరులే వివాహ నిశ్చయము జేసికొని తగిన ధర్మాన్ని నిర్ణయించుకొని వివాహము జేసికొందురు గాన, తల్లిదండ్రులకిందు గల్గు బ్రహ్మలోకాది కన్యాదాన ఫలములుండవు గాన పెద్దలు మొదటిరకము మనదగిన బ్రాహ్మవివాహ ధర్మము శ్రేష్ఠమని వాకొనిరి.

(5) జ్ఞాతిభ్యోయథేచ్ఛం ధనం దత్వా వివాహః ఆసురః" వరుడు బంధువులకు కోరినంత ధనమును యిచ్చి చేసికొను పెండ్లికి ఆసుర వివాహమని పేరు. ఇందు వరుడు కన్యవైపు వారికి ధనమిచ్చుటచే, కన్యను కొనినవాడగును. కన్యాదాతలు కన్య నమ్ముకొను వారగుదురు. దీనివల్ల

ఉభయలోక ఫలములు నశించును. ఎందుకనగా ఈ లోకమున. కన్య నమ్ముకొని వారనే యపకీర్తి గల్గును.

పరలోకమున కన్యా విక్రియముచే మహాపాపము గల్గిన నరకలోకాదివాస మేర్పడును, అందుచే. రెండు లోకములకు నీ కన్యా విక్రియముచే బాధలుండును గాన నియ్యదంత శ్రేష్ఠమైనది గాదని భావించి పెద్దలు బ్రాహ్మ వివాహ మొనర్చుటకు కారణమైనది.

(6) వగవ ధ్వోరిచ్ఛయాన్యోన్య సంయోగో గాంధర్వః" కన్యా. వరుడు యువురు పరస్పరము ప్రేమించుకొని. కలుసుకొనుటకు గాంధర్వ వివాహమందురు. ఈనాడు ప్రేమ వివాహాలీ తెగకు చెందగలవు ఇందు, కన్యాదాన ఫలమినుమాత్ర మేవి, కన్యయొక్క తలిదండ్రులకు దక్కదు. మరియు వారి ప్రేమ యెంతవరకు పవిత్రమో! ఆవరుడెంతటి గుణవంతుడో ఆకన్య యెంతటి గుణవతియో! వారి ప్రేమానురాగాలెంతటి స్థిరములో నెవరూహింపగలరు? తలిదండ్రులకు బంధువులకు యిందు ప్రమేయ మేమాత్రము లేదు, ఈ వివాహ మెంత స్థిరమో! భారతమున శకుంతలా దుష్యన్తుల గాథ నరిగిన తెలియగలదు.

మహాధర్మాత్ముడు. మహాసాంరాజ్య పాలకుడైన దుష్యంతుడే, గాంధర్వ విధిని శకుంతలను మహాఋషి యాశ్రమమున పెండ్లియాడీ, కామబాధను తొలగించి పురమునకేగి మిన్నకుండెను. శకుంతలకు పుత్రుడు సహా గలిగెను. దుష్యంతుడు రాకపోగా తానే దుష్యన్తుని కడకు హాస్తినగరమునకు వెళ్ళి రాజసభలో తమ వివాహమునుగూర్చి ముచ్చటింపగా తనకు సంబంధములేనివానివలె దుష్యంతుడు పలికెనుగదా! ఇంక సామాన్య మానవులు యీ కలికాలమున నీ ప్రేమ వివాహములో నైనచో, కొంత

కాలమున కాదంపతులు విడివడినచో, స్త్రీ గతి యేమికావలయును? అందుచే పెద్దలీ వివాహమున కంత ప్రాముఖ్యమివ్వక, తొలి వివాహమున దగిన, బ్రాహ్మవివాహమునకు ప్రాముఖ్యమివ్వవలసి వచ్చినది.

(7) యుద్ధాదినా బలా ద్వరణం రాక్షసః" రాజులు మొదలైన వారు శతృవులతో యుద్ధాదులు జేయగా సంధి కాలమున, గాని, బలవంతముగా గాని. శతృపక్షమునగల కన్యను నిర్బాధముగా వివాహము చేసి కొనడము రాక్షస వివాహమందురు, ఇందు కన్య తలిదండ్రులు వద్దరా బంధుజాలమునకు. యీ కన్యను యిచ్చుటకు యిష్టము లేకపోయిననూ, విధిలేక, ప్రాణ రక్షణార్థమో! దేశరక్షణార్థమో. కులరక్షణార్థమో, కన్యను, అయిష్టముగ వరునకు యిచ్చివేయిడమునకు రాక్షస వివాహమందురు.

శ్రీకృష్ణదేవరాయలు, గజపతులను నోడించు తరిని. సంధిజేసికొని వారి పుత్రికను, వివాహమాడినట్లు చరిత్ర గలదు. ఈ రీతిని పూర్వపు రాజాదులు బలవంతముగ, కన్యను గ్రహించు చున్నట్లు చరిత్రలున్నవి. ఈ వివాహాలు రాక్షసకృత్యములు గాన రాక్షస వివాహమనిరి.

ఇందు తల్లిదండ్రులు బదిలిర బంధువులు దుఃఖమునునుందురు. ఇష్టపడరు. కాని, శతృవు బలవంతుడగుటచే విధిలేక కన్య నొసంగుటచే కన్యాదాన ఫలమిందు లేశమాత్రమేని లేని కారణాన బ్రహ్మలోకాది సిద్ధులు కలుగవు. పితృగణము తరించరు గాన, గర్హ్యమని భావించి, బ్రాహ్మమము శ్రేష్ఠమని నిర్ణయించిరి.

(8) చౌర్యేణా న్యాహరణం పైశాచః" అను రీతిని. కన్యను దొంగిలించుకొని వచ్చి, దొంగపెండ్లి యను రీతిని కన్యను పెండ్లియాడడము పైశాచము అందురు. ఇందు వరుడు, కన్యను గోరిగాని, కన్య వరుని

గోరిగాని, యుండి వేరొక వరునకు, కన్య నివ్వదలంచియుండ నాసంగతి యెరింగి, ఆ నిర్ణయించిన వరునికి కన్య దక్కనివ్వకుండా కన్యను హరించు కొనివచ్చుట యుండుటచే, అసురకృత్యముగాన నిద్దానికి ఆసుర వివాహామనిరి. శ్రీకృష్ణుడు, రుక్మిణిని హరించుకొనివచ్చి పరిణయమాడిన విధానము భాగవత దశమ స్కంధమున గలదు. ఇందు, రుక్మిణీదేవి కృష్ణు పెండ్లియాడదలంచియుండెనది. శ్రీకృష్ణుడామెను వివాహామాడవలయు నని భావించియుండెను, రుక్మిణీదేవి తండ్రిగూడ, రుక్మిణిని కృష్ణునకే యివ్వదలంచియుండెను. కాని, రుక్మిణియొక్క పెద్దఅన్న, కృష్ణుడనిన సరి పడనివాడు, ద్వేషించువాడు, మూర్ఖుడు, దుర్మార్గుడు వీనిబాధకు తలిదం డ్రులుగూడ భయపడి కృష్ణునకు కన్య నివ్వలేకుండిరి. రుక్మిణికీసంగతి తెలు సును గాన, శ్రీకృష్ణుని రమ్మనమని దూతినంపి. కృష్ణుని వెంట వచ్చినది గాన. నిందు కొంత ధర్మమున్నది. అయిననూ శ్రీకృష్ణుడు పెండ్లియాడె నుగదాయని యందరూ నారీతిని, నాచరించడమయుక్తముగాన నీ పైశాచిక వివాహామంత యుక్తముగాదు గాన పెద్దలెవ్వరు దీనినంతగా నంగీకరింపక మొదటిది యనదగు బ్రాహ్మవివాహాము శ్రేష్ఠము, ధర్మవం తము, కులము కుటుంబమునకు బంధువులకు మంత్రులకు. లోకమునకు, కీర్తికరము, ధర్మవంతము ఇహపరలోక సాధనముగాన, నీ బ్రాహ్మవివా హామే సర్వులకు. నాచరణీయమని నిర్ణయించిరి,

ఈ వివాహాములను గూర్చి భారతమున అనుశాసనిక పర్వమున ద్వితీయాశ్వాసమున భీష్ముడు ధర్మరాజునకు, గాంధర్వాది వివాహాములను గూర్చి నీరీతి నెఱింగించెను,

ధర్మరాజు భీష్ము నీరీతిని ప్రశ్నించెను.

"కన్యావరణ పరికారంబు విచారణీయంబైన కృత్యంబు దాని తెలుంగెలెంగింప వేడునుటయు, నతండతనికిట్లనియె

౬౦। "కులమును శీలము విద్యయుగల వానిఁబిలచి ప్రీతిఁగన్నియనీఁగా,
వలయు నుదకప్రదానా కలితంబుగ బ్రాహ్మికర్మ గతి యిది
యధిపా."

యని భీష్ముడు ధర్మజునకు బోధించిన తెలుగు పరిశీలించిచో మంచి కులమున జన్మించినవాడై యుండవలయుననియు. మంచినడవడిక గలవాడును విద్యావంతుడగు వాడును, గుర్తించి నట్టివానిని రావించి కన్యను నుదకదాన పూర్వకముగ కన్యాదాన మొనర్చుట శ్రేయమనియు, నీ వివాహమునకు బ్రాహ్మ వివాహమని పేరనియు నుడివెను.

ఆ॥ క్షాత్రమందురు బుధులు కన్య పురుషగోర, నతడు కన్యమీద
నాససేయ। నచలమగు పరస్పరానురాగము గని ప్రియుద మొసగఁజేయు
పరిణయంబు॥

తొలుత మనవిజేసిన నాలుగవదగు పాశ్చాత్య వివాహమునే నిందు, క్షాత్రవివాహమను పేరనుడివినట్లున్నది. కన్య వరుని జూచి వరుడు కన్యను జూచి ప్రేమించి జేసికొను వివాహము.

౬౧ కన్య మనంబును దనిసినఁగన్నియ యెవ్వానిఁగోరు గాంధర్వంబా।
యన్న నతని కిచ్చుట, వెలవన్నుట యాసురము సూవే పౌరవ
ముఖ్యా"

కన్నియ రూపరేఖా లావణ్యాదులుగాంచి వరించి పరస్పరానుబద్ధులై యొండొరులు ప్రేమించుకొని జేసికొను పెండ్లికి, గాంధర్వ వివాహమనియు,

వెలయిచ్చి కన్నియను పెండ్లియాడు విధికి యాసుర వివాహము నియు నందు రనెను.

క॥ బలిమి వఱడు గన్నెకుఁగల వారింబోడిచి కరము క్రౌర్యంబున, నప్పోలతుక, దుఃఖంపఁగ వారలు వాగులఁగఁ దెచ్చికొనుట రాక్షసము నృపా''

బలవంతుడై, కన్యయొక్క బంధువర్గమును బాధించి బలవంతముగ కన్యను తెచ్చుకొనుటను రాక్షస వివాహమని నందురు,

ఈ రీతిని గల వివాహములపైకి ధర్మబద్ధమైన వివాహమొక్క బ్రాహ్మవివాహమే గాన నీ యెన్మిదింటిపైకి బ్రాహ్మ వివాహమునకే లోకమున నాల్గు వర్ణములవారికి శ్రేయోదాయకమని పెద్దలు నిశ్చయించుటకు కారణమైనది,

మఱియు బ్రాహ్మవివాహమున దర్మబద్ధముగ గల్గిన సంతానమే, యుత్తమమైనదనియు భారతమున అనుశాసనికమున నిట్లుగలదు.

తే॥ పరమ సంస్కృతయగు నాత్మ భార్యయందు
ధర్మ విధిఁగలిగించిన తనయుఁడనఁగ
దాన యౌరసుఁడను నభిదాన మొప్పఁ
బరఁగు నుత్తముఁడాతఁడు పృథముఁడధిప॥

అనుటచే నీ నెన్మిది వివాహములపైకి సత్కుల సంజాతమైన సచ్ఛీలవతి యగు కన్యను బ్రాహ్మవివాహముగ పెండ్లియాడినచో, నాపెండ్లికి పరమ సంస్కృత విధియందురు. ఇట్టి ధ ర్మ వి ధి చొప్పున గల్గిన భార్యయందు పుట్టిన సంతానమునకే, '' యౌరస సంతానమనియు నిద్యది యుత్తమ

సంతానమనియు తొలుత తెక్కింపదగిన సంతతియనియు యుధిష్ఠిరునకు భీష్ముడు వచించెను.

ఇందుచే వేదమంత్ర సంస్కారముచే ధర్మబద్ధముగ పెండ్లియాడు విధియొక బ్రాహ్మవివాహమునకే గలదు గాన బ్రాహ్మవివాహమూ యెన్మిదింటిపైకి యుత్తమమని శాస్త్రవేత్తలు నిర్ణయించుటకు హేతువైనది.

మిగతా వివాహాలు వారివారి యిష్టానుసార ముండును గాన బ్రాహ్మవిధివలె, ధర్మబద్ధము వేదమంత్ర సంస్కార పూతములు గావని మాత్రము యెఱుంగ దగియున్నది.

అరణ్య పర్వమున యక్షుడు ధర్మజుని నీరీతి ప్రశ్నించెను.

"నరునకు. నాత్మ యెవ్వఁడు, ఘనంబుగ దైవికమైన చుట్ట మెవ్వరు"

అని యడుగ ధర్మజు డీరీతిని ప్రత్యుత్తర మొసంగెను.

"ఆత్మజుఁడు నువ్వే, పురుషున కాత్మయయ్యె. నాతనికి భార్య దైవికమైన చుట్టము." అనెను.

ధర్మబద్ధమైన వివాహమున గల్గిన భార్య దైవ నిర్ణయమైన చుట్టము మానవునికనియు, అట్టి ధార్మిక వివాహమున గల్గిన పుత్రుడు, ఆత్మతో సమానమైన వాడనియు వేద సాంప్రదాయ సిద్ధమైన భావమును వ్యక్తీకరించెను. వేదమునను "ఆత్మావై పుత్రనామాసి" యని గలదు. ఆత్మయే పుత్రుఁగా జన్మించుచున్నాడని భావము.

ఇట్లు వేదములు శాస్త్రములు పురాణములు బ్రాహ్మవివాహమే

శ్రేష్ఠమనియు. నా సంస్కారముతో గల్గిన వసతియే, దైవనిబద్ధమైన చుట్టమనియు, నీరీతిని సంస్కారపూతులైన దంపతులకు గల్గిన సంతానమే, యౌరసనామమున చెప్పదగిన సంతానమనియు, నీరీతిని గల్గిన పుత్రుడే ఆత్మసదృశుడనియు నున్నందున పెద్దలెల్లరు, సత్కుల ప్రవృద్ధికై, సత్సంతాన విప్తికై బ్రాహ్మవివాహమును నాదరింపుమని వచ్చిరని సుస్పష్టమగుచున్నది.

ఈ యెన్మిది వివాహములపైకి బ్రాహ్మవివాహమున, కులము, గుణము, రూపము, విద్య, శీలములు ముఖ్యముగ గమనించెదరు. కానీ యీనాడు కులము మతము అనునవి యొక్క మూఢ విశ్వాసములనియు నివి యంతగా పాటింప నవసరము లేదనియు నొక పరివాదమున్నది. ఇది కేవలము "కులమన" నేమో తెలియని వారనదగు మాటయే గాని యన్యముగాదు. కులము శీలము విద్యాగుణములు గుర్తింప నేరక వివాహము కేవలము సినీమాలలో చూపు రీతిని ప్రేమవివాహాలు చేసికొనినచో, నా ప్రేమికులు తాత్కాలికావేశమునకు లోనై, ప్రేమించుకొనిరే గాని యనంతరము వారనుభవించు యనుభవములు వర్ణనాతీతము. పాశ్చాత్య దేశీయుల వలెను, మన దేశమున కొందరగు ఎరికల యానాది తెగలవారును, చేసికొను ప్రేమవివాహాలవలెనుండి, ఇష్టమున్న రోజులు భార్యాభర్తలు, కష్టమైన రోజులలో విడిపడి మరొకరిని చేబట్టు సాంప్రదాయములకు లోను గావలసి వచ్చుచుండును గదా! ఈ సాంప్రదాయమే మంచిదనినచో వారికొక నమస్కారము. ఇంతకన్నా యెక్కువ వ్రాయడ మెందులకు? శాస్త్రమునకు సాంప్రదాయమునకు కట్టుబడు వారి కైన్నా చెప్పవచ్చును. లాభముండునుగూడా! భిన్నులకు చెప్పడము వృధా కంఠశోష గాని వేరుగాదు గదా?

ప్రేమవివాహాలకన్నను, తల్లిదండ్రులు, అనురూపుడైన వరుని నిర్ణ

యించి ధారాదత్తముగ వివాహమొనర్చు విధియే "ఏకక్రియాద్వ్యర్థకరీ బభూవ" యను విధి ప్రకారము ఈ లోకమున కీర్తికరము పరలోకమున ముక్తిప్రదమని పెద్దలవలన శాస్త్రధర్మముల ననుసరించియు గుర్తించిన వారు గనుక భారతీయులైన సనాతన ధర్మ పరాయణులెల్లరు సత్సాం ప్రదాయముగ భావించిన వారై తమ పుత్రులకు పుత్రికలకు, కులాను క్రమముగ నీ ధర్మమును విధిగ ననుసరించుచున్నారు.

"అప్లుత బ్రహ్మచర్యః, లక్షణ్యాం స్త్రియముద్వహేత్"

అను ధర్మముననుసరించి విద్యాభ్యాసానంతరము మంచి లక్షణవతియైన కాంతను వివాహమాడడము ధర్మము.

"అనన్యపూర్వికాం కాంతాం అసపిండాం యవీయసీం
అరోగిణీం, భ్రాతృమతీం అసమానార్షగోత్రజాం॥

అను ధర్మము ప్రకారము ఇతరులచే తొలుత వివాహమాడనట్టిది, కన్యకగా నుండునది రోగము లేనట్టిది సోదరులున్నట్టిది తమ గోత్రముగాక ఇతర ఋషుల గోత్రమునకు సంబంధించిన కన్యను వివాహమాడవలయునని ధర్మము.

(1) తొలుత నొకరు వివాహమాడిన యువతిని నేడు ప్రేమ వివాహాలక్రింద జమకట్టుకొనదగునేమోగాని పూర్వీకులు యీ యువతిని మరలా ధారాదత్తముగ పెండ్లియాడనర్హముగాదని నిర్ణయించిరి.

(2) తన గోత్రమునకు చెందిన కాంత చెల్లెలుతో తుల్యము గాన చెల్లెలును పెండ్లియాడురీతి నీ పెండ్లి కాగలదు గాన సగోత్ర వివాహము కూడదని నిర్ణయించిరి.

(3) రోగవంతురాలు దాంపత్య సుఖములకుగాని గార్హ్యస్థ్య జీవనమునకుగాని నంతగా యోగ్యురాలుగ నుండదు గాన రోగముతో గూడిన కాంతను పెండ్లియాడ నర్హ్మముగాదని నిషేధించిరి.

(4) సోదరులుగల కన్యనే వివాహమాడదగినదని నిర్ణయము సోదరులులేని కాంతవల్ల ఏమేని ఆస్తి వచ్చిన రావచ్చునేమోగాని దాని వల్ల ఏనాటికైనా వంశక్షయముగాని సంపద క్షీణముగాని కాగలదుగాన సోదరవతినే వివాహమాడదగినదని భావము.

మన భారతీయులైన సనాతన ధర్మ పరాయణులెల్లరు ఋషుల వంశమునకు జెందినవారమని శాస్త్రికారులు నిర్ణయించి నిరూపించి యున్నారు. ఈ రీతిని ఋషుల గోత్రమునకు జెందిన వారముగాన, "ఆర్ష గోత్రజులమని మనకు పేరు. ఇట్టి ఆర్ష గోత్రజులైనవారు ఒక గోత్రజుడు వేరొక గోత్రమునకు జెందిన కన్యను వివాహమాడవలయునని "అసమానార్షగోత్రజమైన కన్యను వివాహమాడవలయునేగాని సగోత్రజమైన కన్యను వివాహమాడరాదని నిర్ణయించిరి.

"కన్యాదానంతు సర్వేషాం, దానానాముత్తమం స్మృతం" అను రీతిని తమకులమునకు సాంప్రదాయమునకు జెందిన వరునకు యథాశక్తిని అలంకరించిన కన్యను దానము అనగా (బ్రాహ్మ వివాహ రూపమైనధారా దత్తముగ యథా శాస్త్రానుసారము వివాహము చేసినచో సమస్త దానములకన్నా నీ కన్యాదాన ముత్తమోత్తమమైనదిగా రాణించగలదు

"పైశాచశ్చారక్షైవ నకర్తవ్యౌకదాచన
చతుర్ణామపివర్ణానాం ఏషధర్మః సనాతనః"

అనురీతిని నాల్గు జాతుల వారికిని మునుపుజెప్పిన ఎన్మిది వివాహములలో

పైశాచిక వివాహము అసుర వివాహము యోగ్యములుగావుగాన నీ రెంటిని అధర్మములుగ నెరుంగదగినదని భావము అనగా కన్యాపితరులకు నిర్ణయించియుండగ హరించడము రాక్షసమందురు. కన్యా సంబంధము లైన పెద్దలను మోసగించి బాధించి కన్యకకు ఇష్టములేకున్నను బలవంతముగా నెత్తుకొని వెళ్ళి పెండ్లియాడడము పైశాచకమందురు, ఈ రెండు వివాహములు బ్రిహ్మ, క్షత్రియ, వైశ్య శూద్రులగు నాల్గు వర్ణముల వారికి నిషేధించిరి, కనుకనే ధర్మబద్ధమైన బ్రిహ్మ వివాహమునే నాల్గు వర్ణములవారు నాచరించుటకు కారణమైనది.

"ధర్మార్థ కామ మోక్షదాం దారాః సంప్రాప్తి హేతః
పరీక్ష్యాస్తే ప్రియత్నేన పూర్వామేవ కరగ్రిహాత్"

అను ధర్మాన్ని పురస్కరించుకొని ధర్మము అర్థము కామము మోక్షణము అను నాల్గు పురుషార్థములకు కారణభూతురాలుగ నేర్పడి వంశమునకు కీర్తి ప్రితష్ఠతీను వంశాభివృద్ధిని చేకూర్చెదగు సమర్థురాలుగ మున్ముందు కాదగియున్నది, గాన కన్యను సర్వవిధములా పరిశీలించి, వివాహమునకు తగిన కన్యకయని నిర్ణయించుకొనిన యనంతరమే వివాహము నిశ్చయించుకోవలయును. ఈరీతిని కన్యను పరిశీలించిన యనంతరము "సువర్ణాం భార్యాం ఉద్వహేత్" అను బుధధర్మశాస్త్రి వచనానుసారము సమానమైన తెగలో అనగా తన కులములో జన్మించిన కన్యనే వివాహమాడవలయునని నిర్ణయము.

ఈరీతిని వరుని గూడపరీక్షించిగాని కన్యనివ్వరాదందురు. కనుకనే "కులంచ శీలంచ వపుర్వయచ్చ విద్యాంచ విత్తంచ సనాథ ఏతాన్ గుణాః సప్త పరీక్ష్య కన్యాదేయా బుధైః శేషమ చిన్త నీయమ్॥
అనురీతిని కులము, శీలము, శరీరపుష్టి, వయస్సు, విద్య, ఆస్తి, అధికారము అను నేడింటిని పరిశీలించి,నీ సప్తగుణములు గల వానికే కన్యనివ్వదగినది

## [1] కులము

కులమనగా నేను సరియైన నిర్వచనము చేయలేక ఏదో రీతిని, జాతియని, వంశమని, పలురీతులుగా ననుచున్నారు. కాని శాస్త్రవేత్తలు నిర్ణయించి నరీతిని కులమనగా నిట్లుగలదు.

"ఆచారో వినయో విద్యాప్రతిష్ఠా తీర్థదర్శనం,
నిష్ఠావృత్తిః తపోదానం నవధాకులలక్షణమ్।

అనురీతిని, ఆచారము, వినయము, విద్య, గౌరవము, తీర్థయాత్రలు చేయు డము, దైవకార్యములయందుగల పట్టుదల, మంచి జీవనము, తపస్సు, దానము, అను తొమ్మిది గుణములు గల్గి యుండు రీతికి, 'కులమని' సంకే తముగ వచించిరి.

"విహితాచార విహీనేషుక్షిప్రంనశ్యతి వైకులమ్। అను రీతిని వారివారికి నిర్ణయించిన ఆచారముల ప్రకారము నడవనిచో, కులధర్మము వానిలో నశించుననిరి. కాన మంచి కులధర్మములు గల వరునికి కన్య నివ్వడము శ్రేయస్కరమని భావము.

## [2] శీలము

మంచినడవడికకే శీలమందురు. కనుక మంచి వంశ మెంతముఖ్యమో మంచి శీలమంత యవసరము. వంశము మంచిదైనను, వరుడు శీలవంతుడు కానిచో కన్యనివ్వదగదందురు.

ఈ రీతిని వరుని సహితము పరీక్షించి యోగ్యమైన వరుని నిర్ణయించి

కన్యనిచ్చుతరిని వధూవరు లుభయుల జాతకములను పరిశీలించి, యీ యిరువురికి దాంపత్యానుకూల్యములుండునది లేనిది పొంతనముల వలనను, ఆయుర్దాది భావములు భావ ఫలములవలనను, జీవిత సుఖ సంతోషాదులు దశాఫలముల వలననూ సుదీర్ఘముగ పరిశీలించి కన్యనివ్వడము శ్రేయస్కరము, వీని నెల్ల మంచి జ్యోతిష శాస్త్రవేత్త కడ నెఱుంగుట యుత్తమము, కొంతవరకు వధూవరుల జాతక పరిశీలనములను సంక్షేపముగ పొందుపరతును. వివరణములవసరమగునేని పెద్దలకడ నెఱుంగుట యుత్తమము.

(1) "ఏకరాశ్యాది యోగేతు నాడీదోషోనవిద్యతే" అనురీతిని వధూవరుల లగ్నములు ఏకరాశి యైనచో నాతరిని నాడీదోషము లేదందురు.

(2) ఏకరాశేచ దంపత్యోః శుభంశ్యాత్ సమసప్తకే
చతుర్థే దశమేచైవ తృతీయైకాదశేతథా।

వధూవరుల లగ్నములు ఏకరాశి యైనచో చాలా శ్రేష్ఠము. ఆరీతినే సమసప్తకరాశులైననూ మూడు పదునొకండు రాశులైననూ శ్రేష్ఠతరమందురు.

(3) "యదిశ్యాత్ రాక్షసీభర్తా కన్యకామానుషీభవేత్
వివాహే సుఖమాప్నోతి వైపరీత్యం వివర్జయేత్

అను ధర్మముప్రకారము వరుని జన్మనక్షత్రము రాక్షసగణమై యుండి కన్య జన్మనక్షత్రము మనుష్య గణమైనచో సుఖ సంపదలు గల్గురు. కన్య నక్షత్రము రాక్షసగణమై వరుని నక్షత్రము మనుష్యగణమైన విరుద్ధ ఫలితములు గల్గును. కనుకనే "స్త్రీ రాక్షసం నకర్తవ్యం" అనియందురు.

"అవ్యంగాంగీం సౌమ్యనామ్నీం హంసవారణగామినీం
తనులోమ కేశదశనాం మృదంగీం ఉద్వహేత్ స్త్రియమ్.

అనురీతిని వివాహయోగ్యమైన కన్య సమానమైన అవయవములు గల దియై యుండవలయును. మంచి పేరు, హంసనడకగాని, ఏనుగు నడకగాని యుండదగినది మంచి పలువరుసగలది మృదువైన శరీరముగలదియైన వనితను వివాహమాడదగినది:

"హంసస్వరాం, మేఘవర్ణాం, మధుపింగళలోచనాం
తాదృశీం వరయేత్ కన్యాం గృహస్థఃసుఖమేధతే.

హంసధ్వనిగలది మేఘవర్ణముగలది, మధువు (తేనె) గాని పింగలవర్ణము గాని గల కండ్లుగల కన్యను వివాహమాడినచో సుఖవృద్ధిగల్గును.

నోద్వహేత్ కపిలాంకన్యాం నాధికాంగీం, నరోగిణీం
నాలోమకాం నాతిలోమ్నాం. నవాచాటాం. నపింగళాం.

అనునట్లు కపిలవర్ణముగలది అధికమైన అవయవములుగలది, రోగవంతు రాలు వెంట్రుకలులేనిది ఎక్కువ వెంట్రుకలుగలది. అధికముగమాటలాడు నట్టి కన్యను పెండ్లియాడదగదు.

శ్యామాసుకేశీతనులోమరాజీ సుభ్రూః సుశీలాసుగతిః సుదన్తా-
వేదీవిమధ్యాయది పంకజాక్షీ కులేనహీనాపివివాహనీయా.

శరీర లావణ్యకాంతులుగల కన్యక మంచి శిరోజములుగలది మంచి కను బొమల వరుసగలది, మంచి శీలముగలది మంచి గుణవతి, మంచి పలువరుస గలది, సన్నని నడుముగలది, పద్మ నేత్రములుగల కన్యను తక్కువ కుల ముననున్ననూ పెండ్లియాడ దగునందురు.

"తస్మాత్ కులనక్షత్రవిజ్ఞానోపన్నాం వరయేత్" అని పెద్దలను రీతిని కన్య మంచి కులవతి, మంచి నక్షత్రమున జన్మించినదిగా గుర్తించి వివాహమాడ దగునందురు. ఎందుకనగా, ఆశ్లేష నక్షత్రమున జన్మించిన కన్యక అత్తను హరించును. మూలా నక్షత్రమున పుట్టిన వనిత మామను హరించును. జ్యేష్ఠానక్షత్రమున జనించిన పడచు బావకు దోషము గల్గించును. విశాఖ నక్షత్రమున పుట్టిన కన్య మరుదులకు చెడుపు చేకూర్చును గాన నక్షత్ర విచారము తప్పక చేయదగినదని పెద్దల వచనము, శాస్త్ర నిర్ణయముగలదు. ఈ రీతిని వధూవరుల జాతకములను పరిశీలించి నయనంతరము వివాహ నిశ్చయము చేయదగినది.

"మాఘ ఫాల్గుణ వైశాఖ జ్యేష్ఠ మాసాః శుభప్రదాః

అనునట్లు వివాహమునకు 1 మాఘమాసము, 2 ఫాల్గుణమాసము, 3 వైశాఖమాసము, 4 జ్యేష్ఠమాసము శుభములిచ్చును.

"మధ్యమం కార్తికే మార్గశీర్షే వైనిందితాఃపరే"

కార్తీకమార్గశీర్షమాసములు మధ్యమ ఫలములు. మిగతా, 1, చైత్ర, 2. అషాఢ, 3. శ్రావణ 4. భాద్రపద 5. ఆశ్వయుజ, 6. పుష్య మాసములు అధమములు. మరియు ఆషాఢమాసము, పుష్యమాసము భాద్రపద మాసము మరి నింద్యములని పెద్దలంతగా వీనిని నంగీకరించరు.

మూల మైత్ర మృగ రోహిణీకరైః।
పౌష్ణ మారుత మఖోత్తరా న్వితైః।
వీర్య వద్భిః ఉడుభిః మృగీదృశాం।
పాణి పీడన విధిః విధీయతే।

1 మూల 2 అనూరాధ 3 మృగశిర 4 రోహిణి 5 హస్త 6 రేవతి 7 స్వాతి 8 మఖ 9 ఉత్తర 10 ఉత్తరాషాఢ 11 ఉత్తరాభాద్ర అను నీ పదునొకండు నక్షత్రములు వివాహమును శుభప్రదము.

వివాహమైనది మొదలు పదునారు దినములలోపుగ సమదినముల లో కన్యను గృహప్రవేశమునకు పిలుచుకొని వెళ్ళదగును. ఈ పదునారు దినములలో తిథి వార నక్షత్రములు గుర్తింపపనిలేదని శాస్త్ర ప్రమాణము.

"వివాహమారభ్యవధూ ప్రవేశోయుగ్మేతిధౌ షోడశవాసరాన్తే
పంచాంగ శుద్ధించ దినంవినాపితిథౌనసద్గోచర గేపికార్యః.

అను ప్రమాణమున్నదిగాన తిథి వార నక్షత్రములనెంచకనే పదునారు గినములలోపుగ వధూ గృహ ప్రవేశము చేయదగినది.

శుభేక్షితయుతాశ్చస్తాః ఉద్వాహేఽఖిలరాశయః
శుభషడ్వర్గకేలగ్నేమహాదోషవివర్జితే.

అను రీతిని శుభగ్రములుగల లగ్నము శుభగ్రములు చూచులగ్నము వివాహమునకు యోగ్యముగాన నీవివాహలగ్నము తెలిసిన పెద్దలచే నిర్ణయించి వివాహము చేయ తగినది.

శుక్రఃపంచసహస్రాగి బుధః పంచశతానిచ
లక్షమేకంతుదోషాణాం గురుః కేంద్రేవ్యపోహతి,

అను ధర్మముప్రకారము వివాహలగ్నమునగాని, వివాహ లగ్నమునకు నాల్గు పదిరాశులయందుగాని, గురువుగాని శుక్రుడుగాని, బుధుడుగాని, యున్నచో సమస్త దోషములు హరించును. గాన గురు, శుక్ర, బుధులు

వివాహలగ్న కేంద్రములలో నుండులాగున వివాహలగ్నము నిర్ణయించ వలయును.

బుధ గురు శుక్ర వారములు త్తములు ఆదివారము మధ్యమము. సోమ శని మంగళవారములు నింద్యములు (ఆచార్య కావ్యసౌమ్యానాం. వారాశ్శస్తాశ్శుభోదయే। అని యిందులకు ప్రమాణము గాన, బుధ గురు శుక్రవారములు త్తమములు.

"సహస్రగుణయుక్తోపిమందవారేకుజేతథా
శుభకర్మనకుర్వీత కుర్యాచ్చేత్ మరణం ధ్రువం.

అను ధర్మము ప్రకారము వివాహాది శుభకార్యములు. మంగళవారము నాడుగాని శనివారమునాడుగాని చేయదగదు. అట్లు చేసినచో తప్పక మరణము గల్గునని శాస్త్రప్రమాణమున్నది గాన శని మంగళవారములు శుభకార్యములు చేయరాదని పెద్దలు నిషేధించిరి.

ఈ రీతిని వివాహమునకు మాసములు, తిధులు వారములు నక్షత్రములు, లగ్నములు, ఉత్తమ, మధ్యమ అధమములుగ నిర్ణయించి యున్నారు గాన తెలిసిన పెద్దలచే వివాహముహూర్తము నిశ్చయించ వలయును. ఎందుకనగా

జన్మోదయే, జన్మరాశౌ జన్మర్క్షే జన్మవాసరే.
జన్మమాసేచదంపత్యోః వివాహోత్పన్న దుఃఖదః

అనురీతిని జన్మలగ్నమునగాని, జన్మనక్షత్రమునగాని జన్మించిన వారమునగాని జన్మించిన నెలలోగాని వివాహము గావించినచో నాదంపతులకు సౌఖ్యము తక్కువయగునుగాన వీనిని గుర్తించి ముహూర్త నిర్ణయము చేయుట శ్రేయస్కరము.

మఱియు

వివాహశ్చైక జన్యానాం షణ్మాసాభ్యంతరే యది
అసంశయం త్రిభిర్వర్షైః తత్రైకా విధవా భవేత్.

అను ధర్మము ప్రకారము, ఒక తల్లి బిడ్డలకు (పురుషులుగాని, స్త్రీలుగాని లేక స్త్రీ పురుషులుగాని) వివాహము ఒకరికి మాత్రమే చేయదగును, ఒకరికి చేసిన పిదప యారు మాసములకు వేరొకరికి చేయుట ధర్మము. అట్లుగాక ఇరువురికి వివాహము ఒకేదినమునగాని ఒకరికైనపిదప యారు నెలలో మరొకరికి వివాహము చేసిననూ ఎవరో యొకరు నశింతురని భావము.

కదాచిత్ ఏకజన్యానాంవివాహమృతుత్రయే
యత్రవర్షేణతత్రైకా విధవైవనసంశయః

ఒక తల్లి బిడ్డలకు మూడు ఋతువులు దాటనిదే (ఆరు నెలలు) వివాహము చేసినచో నాయిద్దరిలో నొకరు వైధవ్యమును బొందుదురని పైభావాన్ని యీ ధర్మము బలపరచుచున్నది. కానీ కూతురు వివాహము తొలుత జేసి యనంతరము కుమారుని వివాహము మాత్రము నారు మాసములు కాకపోయిననూ వెనువెంటనే యైననూ చేయవచ్చునని నీ ప్రమాణము బలపరచుచున్నది.

"పుత్రీవివాహాత్ పరతః త్వదైవశుభప్రదం పుత్రవివాహకర్మ"
కూతురు వివాహము చేసినపిదప వెంటనే కుమారుని వివాహ కార్యము చేయుడము మంగళప్రదము కాగలదు.

1. సూర్యసంక్రాంతి యున్న దినమున వివాహ నిర్ణయము చేయరాదు.

2. తిథి వార నక్షత్రములు, యోగ కరణములు వివాహ యోగ్యముగ లేని దినము పంచాంగశుద్ధిలేని దినమందురు. ఇట్టి పంచాంగశుద్ధి లేని దినమున వివాహము చేయరాదు.

3. కర్తరీదోషము. అనగా లగ్నమునకు కర్తరీదోష మున్న వివాహము యోగ్యముగాదు.

4. వివాహ లగ్నములకు చంద్రుడు ఆరు ఎనిమిది రాశులలో నున్నచో వివాహ యోగ్యముగాదు.

5. ఉదయాస్తమయశుద్ధి. అనగా సూర్యోదయ సూర్యాస్తమయ లగ్న శుద్ధులు లేని తఱి వివాహము చేయదగదు.

6. వార జనిత దుర్ముహూర్తములని గలవు. ఇట్టి దుర్ముహూర్తములలో వివాహము చేయతగదు.

7. గండాంత దోషములు అనగా పూర్ణ తిది నంద తిథుల సంధికాలము లు. నాల్గు ఘడియల పర్యంతము గండాంత దోషమందురు. ఈగండాంత దోషములు మృత్యు ప్రదము గాని వివాహ యోగ్యముగాదు.

8. భృగుషట్క దోషము- శుక్రుడు వివాహలగ్నమునకు నాఱవ యింట నుండరాదు. "శుభసంయుక్తం తల్లగ్నం సర్వదాత్యజేత్" అన ధర్మము. గాన, ఎంత శుభలగ్నమైననూ, శుక్రుడు ఆరవయింట యున్న విడువదగినది.

9. "కుజాష్టమో మహాదోషః" అను విధి ననుసరించి, వివాహ లగ్నమునకు కుజుడు ఎనిమిదింట నుండరాదు. ఉన్నచో మహాదోషములని చెప్పును.

10. "ఉభయోః అష్టమం లగ్నం, వివాహా శుభ కర్మాణి దంపత్యోః మరణ ప్రదః" అని విధి గనుక వధూ వరులకు, వారి వారి జన్మ లగ్నమునకు, ఎనిమిదవ లగ్నము ఎంత శుభప్రదముగ నున్ననూ, కూడదు. ఎందు కనగా వారి వారి జన్మలగ్నానికెనిమిదవ లగ్నము ఆయుః స్థానమందుగు ఈ యష్టమ లగ్నమున వివాహానిర్ణయము చేసినచో వధూ వరులకు మరణ ప్రదమగును.

11. విషనాడీ–యని లగ్నమునకు, మునుపు రెండుఘడియలు అనంతరము రెండుఘడియలు "విషనాడీ" యందురు. ఈ విషనాడీ ఘడియలలో వివాహము చేయతగదు.

12. గ్రహణ దినమునగాని. వింతలు ఉత్పాతములు గలు కాలమున గాని వివాహము చేయతగదు.

13. పాపగ్రహముచే వేధింపబడిన నక్షత్రముగల దినమున వివాహ చేయదగదు,

A. క్రూర నక్షత్రము వదలిన నక్షత్రమునకు దగ్ధ నక్షత్రి మనియు

B క్రూర గ్రహముతో గూడిన నక్షత్రమునకు జ్వలిత నక్షత్రి మనియు

C. క్రూర గ్రహాధిష్టత నక్షత్రమునకు ధూమిత నక్షత్రమ్మనియు. పేర్లు గలవు. "సమస్త కార్యేషు వర్జయేత్ ధీమాన్" అను ధర్మము ప్రకారము బుద్ధిమంతులైన వారు వీనిని గుర్తించి, ఈ నక్షత్రములు గల దినమున వాహములు చేయరాదందురు.

ఈ రీతిని గుణ దోషములు గుర్తించి "గుణాధికః స్వల్ప దోషం సకలం మంగళప్రదం" అను ధర్మము ప్రకారము, ఎక్కువ గుణములు గల్గి

సది తక్కువ దోషములు గల్గినదిగా గమనించి వివాహ నిర్ణయ కాలము చేయదగినది.

ఈ రీతిని వివాహ విషయమున తిథి వార నక్షత్ర లగ్న యోగాదులు బుద్ధిమంతులు పరిశీలించి తారాబలము గమనించి వివాహ నిర్ణయము చేయదగును.

తారాబలమనగా

జన్మ నక్షత్ర మారభ్య నిత్యభాంతంచ గణ్యతే
నవ సంఖ్యాహృతం భాగం నవతారాః ప్రకీర్తితాః

అను రీతిని, వధూవరుల జన్మనక్షత్రము మొదలు, ఏ దిన నక్షత్రము కోరుదుమో ఆ నక్షత్రము వరకు లెంచి తొమ్మిదింటిచే భాగించి శేషించిన సంఖ్యను తారగ గ్రహింప దగినది.

జన్మసంపత్ విపత్ క్షేమప్రత్యక్ సాధన నైధనం
మిత్రం పరమమైత్రంచ నవతారాః ప్రకీర్తితాః.

అనురీతిని శేషము ఒకటి మిగిలిన జన్మతారయందురు. శేషము రెండు మిగిలిన సంపత్తార మూడు శేషములు మిగిలిన విపత్తార నాల్గు శేషమున్న క్షేమతార. అయిదు శేషమున్న ప్రత్యక్తార, ఆరు శేషమున్న సాధన తార, ఏడు శేషమున్న నైధనతార. ఎనిమిది శేషమున్న మిత్రతార, తొమ్మిది శేషమున్న పరమమైత్రతారయని చెప్పుదురు.

ఒకటవతార; జన్మతార దేహమునకు దోషమిచ్చును •

రెండవతార: సంపత్తార - సంపదనిచ్చును.

మూడవతార: విపత్తార - విపత్తులనిచ్చును.

నాలుగవతార. క్షేమతార - సౌఖ్యములనిచ్చును.
అయిదవతార; ప్రత్యక్తార - కార్యహానినిచ్చును.
ఆరవతార: సాధనతార - కార్యసాధనాశక్తినిచ్చును.
ఏడవతార; నైధనతార - మరణాది బాధలనిచ్చును.
ఎనిమిదవతార: మిత్రతార - సుఖ సౌఖ్యములిచ్చును.
తొమ్మిదవతార: పరమమైత్రితార - సంతోషాదుల నొసంగును.

కాన తారాబలమును ప్రధానముగ నెంచి వధూవరులకు యోగ్యమైన తారాబలమున్న దినమున వివాహము చేసినచో నా తారాబలమునకు చెప్పిన ఫలితములు వారికి చేకూరగలవు.

చంద్రబలమును చూడవలయును. అనగా వారి వారి జాతకరీతిని చంద్రుడు లగ్నమున మూడవయింట, ఆరవయింట, యేడవయింట పదునొకండవయింట చంద్రుడున్న దినమున సంపూర్ణ చంద్రబలమున్న దినము గాన. పై రీతిని తారాబలము చంద్రబలము చూచి పై చెప్పిన దోషములులేని లగ్నమును గుర్తించి వివాహము చేయదగినది. ఈ రీతిని వివాహము చేసినచో సర్వ సంపదలు చేకూరగలవు.

వివాహము చాలా ప్రశస్తమైన కార్యము, వధూవరుల జీవన సౌఖ్యములకు వంశవృద్ధికి ప్రధానముగాన నిర్విఘ్నతా సిద్ధికొరకై గణపతి పూజతో ప్రారంభింతురు.

"మంగళస్నానంకృత్వా పాణిగ్రహణాఖ్యం కర్మకరిష్యమాణః
తదంగత్వేన తదాదౌ శుద్ధ్యర్థం వృద్ధ్యర్థం, శాంత్యర్థం
అభ్యుదయార్థంచ మహాజనైఃపుణ్యాహవాచనం కరిష్యే
ఆదౌనిర్విఘ్నతాసిద్ధ్యర్థం, మహాగణపతి పూజాంచ కరిష్యే".

అని వధూవరులకు మంగళ స్నానములు చేయించి వివాహార్థమై కూర్చొనబెట్టి పరిశుద్ధికొరకు అభివృద్ధికొరకు, శాంతికొరకు పుణ్యాహ వాచనము తొలుత నాచరింపజేయదలంచి నిర్విఘ్నతా సిద్ధ్యర్థమై మహా గణపతిపూజ తొలుత నాచరింప జేయదగినది.

అనంతరము "బ్రాహ్మణుల యిండ్లలో వరు నెడల "మదర్థం కన్యాం వృణీధ్వమితి" యని కన్యా వరణార్థమై. అనగా కన్యను చూచి నిశ్చయించుట కొరకై, కన్యా వరణము జేతురు.

"నప్త్రే - పౌత్రాయ - పుత్రాయ శర్మణేవరాయ, కన్యాం ధర్మ ప్రజా సంపదర్థం వృణీమహే" యని, ఫలానావారి ముని మనవుడు, ఫలానావారి మనుమడు, ఫలానావారి పుత్రుడు. ఫలానా పేరుగల నీ వరుని కొరకై ధర్మము, సంతాన వృద్ధి నిమిత్తమై, ఈ కన్యను, వరింప జేయుచున్నాము. అని నిర్ణయింతురు,

ఈ రీతినే "నప్త్రీం - పౌత్రీం - పుత్రీం - నామ్న్యాం - కన్యాం - ధర్మప్రజా సంపత్యర్థం వృణీమహే" యని. ఫలానావారి, మునిమనుమ రాలు ఫలానావారి మనుమరాలు ఫలానావారి, పుత్రిక - ఫలానా పేరు గల నీ కన్యకను, ఈవరునికి, ధర్మము - ప్రజ (సంతానము) సంపదలు యభివృద్ధి జెందుట కొరకై నీకన్యకను వరింపజేయు చున్నాము. అని, కన్యావరణము జరుపుదురు, అనంతరము వరునిచేత "ధర్మప్రజా సంపత్యర్థం స్త్రియముద్వహే" యని చెప్పింతురు. అనగా, నీ కన్యను, ధర్మము - సంపద, సంతానాభివృద్ధుల కొరకై వివాహము చేసికొన గల్గుచున్నానని వచింప జేతురు, అనంతరము "కన్యాదాత "వరమలంకృత్య" వరుని యథా శక్తి విభవములతో నలంకరింప జేయవలయు నను విధి ననుసరించి. ప్రకృత కాలమున వర కట్నములు వ్యగ్రరాలు తారాపథము నందుకొను చున్నవి.

శాస్త్రమున వర దక్షిణలు, నూటు బూటు రిష్టు వాచీలు యివ్వమని లేదు. ఒకరిని చూచుకొని వేరొకరి రీతిని, గొత్తెదాటుగ వరకట్నాలాసించడము పరిపాటియగుచున్నది. ఇది అశాస్త్రీయమే.

కన్యాదాన సమయే మహాసంకల్ప వఠనం కరిష్యే" యని మహా సంకల్ప పఠనము చేయుదురు.

వేద సంబధమైన ప్రతి కార్యమునకు సంకల్పం చెప్పుట ముఖ్యము. సామాన్యముగ చెప్పు సంకల్పం సామాన్య సంకల్పం. వివాహమునను భూదాన గోదాన, గృహ దానా దులలో మహాసంకల్పం జెప్పుదురు.

ఈ మహా సంకల్పము ప్రతియొక్కరు వినదగినది. ఆచరింపదగినది. ఇందు భారతీయుల యొక్క సమైక్య భారతీయత సువ్యక్తమగును, నా దేశము, నాభాషా నాయూరు నావారు, నాయిల్లు అను సంకుచిత భావము సంకుచిత విధానము సంకుచిత ధోరణులు తొలగును. విశాల దృక్పధము విశాల భావ పరంపరలు గల్గుటిమిత్తమై, కల్పసూత్రకారులైన, ఆపస్తంబ మహర్షి, ఆశ్వలాయన మహర్షి బోధాయన మహర్షి వంటి మహర్షియులు భారతీయులు అందులో సనాతన ధర్మ పరాయణుల యొక్క విశాల భావ సమైక్యతను చేకూర్చ నిమిత్తమై నీ మహా సంకల్పమును నేర్పరచిరి. మహాకార్యములు చేయు తరిని నీ మహాసంకల్పము విధిగ చెప్పుదురు, ఇందలి భావములు సమైక్యత భారతీయతకు ప్రతిపదికలు, కాన సర్వులు తప్పక వినదగినది గనుక నా మహాసంకల్పమును, సంపూర్ణముగ నర్ధముతో నెరుంగుట ముఖ్యము గాన వ్రాయుచున్నాను. పరిశీలింతురుగాక.

దేవలక మహర్షి నీ మహాసంకల్ప మహాకార్యములలో తప్పక చెప్ప దగినదని యిట్లు నిర్ణయించిరి.

"మహాదానేషు యజ్ఞాదౌ, ప్రాయశ్చిత్తేషు కర్మసు।
కన్యా దానే నదీస్నానే, మహాసంకల్ప మాచరేత్"

అని మహాదానములు చేయు సమయమున యజ్ఞయాగాదులు చేయు కాలమున ప్రాయశ్చిత్త కార్యములు చేయునప్పుడు కన్యాదాన కాలమున మహానదులలో స్నానము చేయునప్పుడు మహా సంకల్పము చెప్పదగినదని దేవలకుల మతము.

మరీచి మహర్షి "కన్యాదానే, నదీస్నానే, తులాదానాదిషు,ద్విజః ప్రాయశ్చిత్తేషుయజ్ఞాదౌ, వ్రతాదిషు విశేషతః ఏతదాదిషు, సర్వత్రమహా సంకల్పమాదరాత్। కృత్వాయత్కురుతేకర్మ తదానంత్యాయకల్పతే॥

అను ప్రమాణము ప్రకారము మరీచిమహర్షి మహా సంకల్పము కన్యాదాన సమయమున. మహానదీస్నానకాలమున తులాదానాది మహాదానములిచ్చు కాలమున యజ్ఞ యాగ వ్రతకాలములయందు ప్రాయశ్చిత్తాది కార్యములాచరించు సమయమున నీ మహాసంకల్పము చెప్పినచో నా కార్యము అనంతఫలితము నొసంగగలదని వచించిరి కాన తప్పక కన్యాదాన కాలమున మహాసంకల్పము కల్పసూత్రకారులు విధిగ చెప్పమని నిర్ణయించిరి:

అర్థముతో గూడ నీ మహా సంకల్పమును వివరింతును తప్పక పరిశీలింతురుగాక.

(1) "అస్యశ్రీ భగవతో మహాపురుషస్య, అనివార్య వీర్యస్య అఖిలలోక పరిపాలన పరాయణస్య ఆదినారాయణస్య.

భగవంతుడు మహాపురుషుడు సమస్తలోక పాలకుడు అయిన శ్రీమన్నారాయణుని యొక్క

(2) "నిత్య నిరుపమ నిరవధిక అప్రమేయమహిమ మహిత, మాయాశక్త్యాభ్రియమాణ మహాజలౌఘమధ్యే పరిభ్రమతాం.

నిత్యము నిరుపమము నిరవధికము అప్రమేయహిమముతో గూడిన మాయాశక్తితో తిరుగుచున్న మహాసముద్రమువంటి నీటిమధ్యమమున తిరుగాడుచున్నట్టి

(3) "క్రమాద్దశగుణోత్తరైః అప్తేజోవాయ్వాకాశాహంకార మహదవ్యక్తాత్మక సప్తావరణైః పరివేష్టితానాం,

ఒకదానికన్ననూ యొక్కొక్కటి పదిరెట్లధికముతోగూడిన నీరు తేజస్సు వాయువు ఆకాశము అహంకారము మహత్ అవ్యక్తముల నేడావరణములతో చుట్టబడియున్నట్టి

(4) "అనేకకోటి బ్రహ్మాండానాం ఏకతమేస్మిన్ మహతి బ్రహ్మాండమండలే,

అనేకములైన కోటి సంఖ్యాత్మకములైన బ్రహ్మాండములపైకి ఒకటియై యున్న ఈ గొప్ప బ్రహ్మాండమండలమునందు

(5) ఆదిశక్తి కూర్మ వరహానంతో పరిభాగప్రతిష్ఠితానాం ఆదిశక్తి

ఆదికూర్మము. ఆదివరాహము అనంతనామకవాసుకియొక్క పై భాగమున ప్రతిష్ఠింపబడి యున్నట్టియు

(6) అతల – వితల – సుతల – తలాతల – రసాతల – మహాతల – పాతాళాఖ్య సప్తలోకానాం ఊర్ధ్వభాగే

అతలము. వితలము. సుతలము. తలాతలము, రసాతలము. మహాతలము పాతాళము అను సప్తలోకములకు పైభాగమునయున్నట్టి

(7) భువర్లోక – సువర్లోక – మహర్లోక – జనోలోక – తపోలోక – సత్య లోకాఖ్య షడ్లోకానాం, అధోభాగే

భువర్లోక - సువర్లోక - మహాలోక - జనోలోక - తపోలోక సత్యలోకములను, నారకలోకములకు క్రింది భాగమునను న్నట్టియు

(8) ఐరావత - పుండరీక - వామన - కుముద - అంజన - పుష్పదన్త సార్వభౌమ - సుప్రతీకాఖ్యాష్ట దిగ్వేదండ. శుండాదండోత్తంభితే

ఐరావతము - పుండరీకము - వామనము - కుముదము - అంజ నము - పుష్పదంతము - సార్వభౌమము - సుప్రతీకము అను ఎనిమిది మహాగజముల తొండములతో యెత్తిపట్టబడుచుండునట్టిది

(9) అయోధ్యా - మధురా - మాయా - కాశీ - కాంచీ - అవన్తి ద్వారవతీ - అశోకవతీ - భోగవతీ - సిద్ధవతీ - అమరావతీ - తేజోవతీ - సంయమనీ - రక్షోవతీ - సింధుమతీ - గంధవతీ - అలకావతీ - యశోవతీ - ప్రభృత్యనేక పుణ్యపురీ విరాజితే.

అయోధ్య, మధుర, మాయ, కాశీ, కాంచీ. అవన్తి, ద్వారవతీ, అశోకవతీ, భోగవతి, సిద్ధవతి, అమరావతి, తేజోవతి. సంయమిని రక్షోవతి, సింధుమతి, గంధవతి, అలకావతి. యశోవతి మొద లైన మహాపట్టణములతో ప్రకాశించునట్టియు

(10) ఇంద్రాగ్ని, యమ, నిర్బుతి, వరుణ, వాయు, కుబే, రేశానాఖ్యా ష్ట దిక్పాలపాలితే.

ఇంద్రుడు, అగ్ని, యముడు. నిర్బుతి, వరుణుడు, వాయుము కుబేరుడు, ఈశానుడు అను అష్టదిక్పాలుర చేత పాలింపబడునట్టియు

(11) అనలానిల ప్రత్యూషప్రభాస సోమాధ్వర ధ్రువాపాఖ్యాష్టవసు విరాజితే.

అనలుడు, అనిలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు, సోముడు, అధ్వరుడు, ధ్రువుడు, ఆపాఖ్యుడు, అను ఎనిమిదిమంది వసువులతో ప్రకాశించునట్టిది.

(12) సూర్య చంద్రాంగారక బుధ బృహస్పతి, శుక్ర శనైశ్చరరాహు కేత్వాఖ్యనవగ్రహ పరిపాలితే.

సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు శనైశ్చరుడు, రాహువు, కేతువు అను నవగ్రహములచేతను పరిపాలింపబడునట్టియు

(13) ఆవహ, నివహ, సంవహానువహ ప్రవహోద్వహ పరివహాఖ్య సప్తమరుత్సంచార సంజీవిత జీవనికురమ్బే,

ఆవహుడు, నివహుడు, సంవడు, అనువహుడు, ప్రవహుడు, ఉద్వహుడు, పరివహుడు అను పేర్లుగల సప్త వాయువుల వలన, జీవింపబడునట్టి జీవరాసుల సమూహములు గల్గినట్టియు,

(14) వింధ్యారణ్యా, దండకారణ్యా, చంపకారణ్యా, శ్వేతారణ్యా, నైమిశారణ్యా, ద్వైతారణ్యా, గుహారణ్యా, దేవదారువన, ఇక్షువన, కదళీకావనాఖ్య దశారణ్యా పరిమండితే.

వింధ్యారణ్యము, దండకారణ్యము, చంపకారణ్యము, శ్వేతారణ్యము నైమిశారణ్యము, ద్వైతారణ్యము, గుహారణ్యము, దేవదారువనము, ఇక్షువనము, కదళికావనము, అను పది యరణ్యములతో ప్రకాశించునట్టిదియు,

(15) శివ, శంభు, పినాకి, గిరీశ, హర, స్థాణు, భర్గ, భైరవ, సదాశివ, కపాలీశ్వరా, ఖ్యైకాదశ రుద్రవిద్యోతితే.

శివుడు. శంభుడు. పినాకుడు. గిరీశుడు, హరుడు. స్థాణుడు. భర్గుడు. భైరవుడు, సదాశివుడు. కపాలుడు. ఈశ్వరుడు. అను పదునొకండు రుద్రులతో నొప్పచుండ నట్టిదియు,

(16) మిత్రార్య మత్వష్టధాతృ వివస్వదరుణ భగాంశు మదింద్ర పర్జన్య విష్ణు పూషాఖ్య ద్వాదశాదిత్య ప్రకాశితే,

మిత్రుడు, అర్యముడు. త్వష్ట, ధాతృడు, వివస్వత్, అరుణుడు, భగుడు, అంశుమంతుడు, పర్జన్యుడు, విష్ణువు. పూషుడు, ఇంద్రుడు అను పండ్రెండు పేర్లతో నొప్పుచుండు, ద్వాదశాదిత్యులతో ప్రకాశించు నట్టిదియు.

(17) భిండివాల దండ భ్రుశుండి, నళిక ముసల చక్ర లవిత్ర కాళరాత్రి ద్రుఘణ బాణ స్థూణ శక్తి తోమర పరిఘ పట్టస, మహాష్టిక కుంత దశ కంటక ప్రాసపాశ ముదర్గ శతఘ్ని సీరగదా గోశీర్ష మయూఖ యాపన పినాకా సిధేను కాస్త్ర శేలా హాస్త్రాముక్త వజ్రాఖ్య ద్వాత్రింశత్ ఆయుధమండల మండిత, దోర్దండ,

భిండి, వాలము, దండము, భ్రుశుండి, నళికము, ముసలము, చక్రము, లవిత్రము, కాళరాత్రి. ద్రుఘణము. బాణము, స్థూణము, శక్తి, తోమరము. పరిఘము. ఘట్టసము, మహాష్టికము. కుంతము. దశకంటకము, ప్రాసము, పాశము. ముద్గరము, శతఘ్ని, సీరము. గద, గోశీర్షము, మయూఖము. యాపనము. పినాకము, అసి. ధేనుకము. అస్త్రము, ఇళా. హాస్త్ర; ముక్తము. వజ్రము, అను ముప్పదిరెండు, పేర్లుగల యాయుధములతో ప్రకాశించు, భుజబలముతో నొప్పుచుండునట్టి.

“(శ్రీ)రామ, జామదగ్న్య దిలీపాంగ గయాంబరీష శశబిందు శిబి

మాంధాతృ మరుత్త భరత యయాతి పృథు భగీరథ రంతిదేవ, సుహోత్రాఖ్య షోడశ భూపాల పాలితౌ,

(శ్రీ)రాముడు, జామదగ్న్యుడు. దిలీప్రుడు, అంగుడు, గయుడు, అంబరీషుడు, శశబిందువు, శిబి. మాంధ్యాతృడు. మరుత్తుడు, భరతుడు. యయాతి. పృథుచక్రవర్తి, భగీరథుడు, రంతిదేవుడు, సుహోత్రుడు. అను పదునాఱుగురు మహారాజులచే పాలింపబడి. నట్టియు.

(18) విశాలాక్షి, మీనాక్షీ, కామాక్షీ. సింహికా. శంకరీ, కబ్జికా. మహాలక్ష్మీ, మహాదేవీ, మహాకాళీ, పార్వతీ. సుప్రభా భ్రమరాంబికా, వింధ్యవాసినీ, యోగినీ. హిమరూపిణీ, మాణిక్యదేవీ. కాద్రవేయీ, పూర్ణికాఖ్యాష్టా దశపీఠదేవీ సమలంకృతౌ,

విశాలాక్షి, మీనాక్షి, కామాక్షి, సింహిక, శంకరి, కుబ్జిక, మహాలక్ష్మిదేవి, మహాకాళి, పార్వతి, సుప్రభ, భ్రమరాంబిక, వింధ్యవాసిని, యోగిని, హిమరూపిణి, మాణిక్యదేవి, కాద్రవేయి పూర్ణిక" అను పేర్లతో నొప్పుచున్న పదునెన్మిది మహాపీఠములందలి దేవీ సమలంకృతమైనట్టియు,

(19) యమనియమాసన ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యానధారణ, సమాధ్యష్టాంగ యోగనిష్ఠాగరిష్ఠ, వశిష్ఠ, వాలఖిల్య విశ్వామిత్ర వాల్మీకి, జమదగ్ని, చ్యవన, దుర్వాస, కపిల, మౌద్గల్య, కౌండిన్య కశ్యప, గార్గ్య గౌతమ, అంగీరస, దక్షపరాశర, జైమిని, పతంజలి కణ్వ, బోధాయన, ఆశ్వలాయన. కాత్యాయన, గాత్రహ్యాయణ, వైశంపాయన, ఆపస్తంబజాబాలి, మార్కండేయ, మాండవ్య భరద్వాజ, సనకసనందన, సనత్కుమార, సనత్సుజాత, అగస్త్య శౌనకాది, అనేకమునిరాజ విరాజితే,

యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము ధారణము సమాధి, అను పేర్లుగల ఎనిమిది యోగములతో గొప్పవారైయున్నట్టి, వశిష్ఠుడు, వాలఖిల్యుడు విశ్వామిత్రుడు, వాల్మీకి, జమదగ్ని, చ్యవనుడు, దుర్వాసుడు, కపిలుడు, మౌద్గల్యుడు, కౌండిన్యుడు, కశ్యపుడు, గార్గ్యుడు, గౌతముడు, అంగిరసుడు, దక్షుడు, పరాశరుడు, జైమిని, పతంజలి, కణ్వుడు, బోధాయనుడు, ఆశ్వలాయనుడు, కాత్యాయనుడు, ద్రాహ్యాయణుడు, వైశంపాయనుడు, ఆపస్తంబుడు, జాబాలి, మార్కండేయుడు, మాండవ్యుడు, భరద్వాజుడు, సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు, అగస్త్యుడు, శౌనకుడు, మొదలైన మునుల సమూహముతో ప్రకాశించునట్టియు,

(20) మలయ, మహేంద్ర, సహ్య, శుక్తిమ, దృక్షవద్వింధ్యపారియాత్రాఖ్య సప్తకులాచలవలయితే, ఋష్యమూక మతంగ, కిష్కింధ మాల్యవద్ధిరణ్యశృంగాఖ్య పంచమహానగసమధిష్ఠితే,

మలయము మహేంద్రము, సహ్యము, శుక్తిమంతము, ఋక్షము, వింధ్యము, పారియాత్రము, అను పేర్లుగల సప్తకులపర్వతములతో చుట్టబడియున్నట్టియు.

ఋష్యమూకము, మతంగము, కిష్కింధము, మాల్యవంతము, హిరణ్యశృంగము, అను అయిదు మహాపర్వతములున్నట్టియు,

(21) 'లవణేక్షుసురాసర్పిదధిక్షీర శుద్ధోదకాఖ్య సప్తసముద్ర సంవృతే' ఉప్పు, చెఱుకుపాలు, కల్లు, నెయ్యి, పాలు, పెరుగు, మంచినీరు,

అను నేడు ద్రివ్యములుగల, నేడు సముద్రములతో చుట్టబడి యున్నట్టియు.

(22) వేద వేదాంగేతిహాసాగమ, న్యాయకావ్యాలంకార, నాటక. గాన కవిత్వ కామశాస్త్రి శకున. సాముద్రికారత్న పరీక్షాస్వర్ణపరీక్షా శ్వలక్షణ, గజలక్షణ, మల్లవిద్యా, పాకకర్మ దోహాళ గంధవాద ధాతువాద ఖనీవాద, రసవాదాగ్నిస్తంభ జలస్తంభ వాయుస్తంభ ఖడ్గస్తంభ, వశ్యాకర్షణ మోహన విద్వేషణోచ్చాటన మారణ కాలవంచన వాణిజ్య, పాశుపాల్య కృష్యా సవకర్మలావుక యుద్ధ మృగయా, రతికౌశలా దృశ్యకరణీద్యూతకరణీ చిత్రిలోహ పాషాణ మృద్దారు వేణు చర్మాంబరక్రియా చౌర్యౌషధసిద్ధి స్వర వంచనా దృష్టివంచనాంజన, జలప్లవన వాక్సిద్ధి, ఘటికాసిద్ధి, ఇంద్రజాల మహేంద్రజాలాఖ్య చతుష్షష్టివిద్యా నిషద్యాయమాన నిరవద్య విద్యజ్ఞాన- విద్యోతితే.

1. వేదములు (ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అథర్వణవేదము అను నాల్గు)

2 వేదాంగములు – వేదములకు సంబంధించిన యారు శాస్త్రములు

(1. శిక్షలు 2. వ్యాకరణము 3. ఛందస్సు 4. జ్యోతిషము, 5, నిరుక్తము 6. కల్పములు అని వేదాంగములు. ఆరు శాస్త్రములు)

3. ఇతిహాసములు – పురాణాదులు

4. ఆగమశాస్త్రములు– 1. శైవాగమము 2 పాంచరాత్రాగమము 3 వైఖానసాగమము 4 స్మార్తాగమము అని ఆగమములునాల్గు

5. న్యాయము - తర్కశాస్త్రమునకు పేరు

6. కావ్యాలంకారములు - రఘువంశాది సర్గసంబంధమైన కావ్యములు వీనిలోని యర్థాదుల భేదమును బోధించు ఉపమాలంకారాదియలంకారాదులు (వీనికే సాహిత్య శాస్త్రమందురు)

7. నాటకములు - దశరూపాత్మకమనదగు పదిభేదములతో గూడిన, శాకుంతలము ఉత్తరరామచరిత్రము. ముద్రారాక్షసమువంటి దృశ్య కావ్యములనదగు నాటకములు

8. గానము - సంగీతము - 1. శాస్త్రీయ సంగీతమనదగు, త్యాగరాజాదికీర్తనలు 2. సినిమాసంగీతము 3. జానపద సంగీతము 4. లలిత సంగీతము అను భేదములతో నేడు ప్రచారములో సంగీతములున్నవి. ప్రాచీనకాలమున 1. కర్నాటక సంగీతము 2. ఉత్తర హిందూస్థానీ సంగీతమనురీతిని వ్యవహారముగలదు.

9. కవిత్వము ఛందోబద్ధముగ పద్యమునుగాని శ్లోకమునుగాని రచించడము. ప్రకృతము గేయ కవిత్వము వాడుక మెండైనది.

10. కామశాస్త్రము - వాత్స్యాయనమహర్షి ఈ శాస్త్రమునకు సూత్రములు రచించినవారు. యశోధరుడను పండితుడు ఈ సూత్రములకు జయమంగళమను పేర వ్యాఖ్య రచించినవారు. దత్తకసూత్రములు బాభ్రవీయకారికలు, సింహాళీయుడైన కొక్కోకగ్రంథము, పరసింహావృత్తి. కందర్పచూడామణి, నాగరసర్వస్వము మొదలైన పెక్కు నీ శాస్త్రమునకు సంబంధించ గ్రంథములుగలవు.

11. ద్యూతము - జూదమాడడము; జూదమునకు సంబంధించిన సూక్తములు ఋగ్వేదమునను కొన్నిగలవు. వీనికే అక్షసూక్త

మనియునందురు, కార్తిక శుద్ధ పాడ్యమినాడు జూదమాడవలయు ననియు శాస్త్రవచనములు గలవు. ఇదియు నొకకళ.

12. దేశభాషాజ్ఞానం – దేశమున జనులు మాట్లాడుకొను తెలుగు, కన్నడ, తమిళ, మళయాళ, హిందీ, ఉర్దు, ఇంగ్లీషు మొదలగు భాషలలో నేర్పు.

13. లిపికర్మ – దేశభాషలకు సంబంధించిన అక్షరములు నేర్పుగ వ్రాయువిధానము,

14. వాచకము – ఏగ్రంథమైననూ తప్పులేకుండ శ్రావ్యముగ నర్థవంతముగ చదువు నేర్పు

15. సమస్తావధానములు: అష్టావధాన, శతావధాన, నేత్రావధానాది, అవధానములలో నైపుణ్యము

16. స్వరశాస్త్రము – ఉచ్ఛ్వాస నిశ్వాసములకు సంబంధించినదై ఇడా పింగళా సుషుమ్నా నాడులకు చేరినదై చెప్పబడు శుభాశుభ ఫలబోధకమైన శాస్త్రము,

17. శకునము – ప్రయాణ కాలమున, పక్షులు జంతువులు మానవులు, ఎదురురావడం గూర్చి గాని, ప్రక్కలకు వెళ్ళడం గూర్చి భాషించు భాషణములను గూర్చి, గమనించి, తన కార్యము యొక్క శుభాశుభముల నెఱుంగునట్టి శాస్త్రము

18. సాముద్రికము – హస్తరేఖలు, బిందువులు, వర్తులాలను గుర్తించి శుభాశుభముల నెఱుంగ జేయు శాస్త్రము

19. రత్నపరీక్ష నవరత్నముల నెఱింగి, యందలి జీవశ_క్తిని గు_ర్తించి రేఖలు, బిందువుల గమనించి, వానివల్ల గల్గు మంచిచెడుల నెఱుంగు జ్ఞానము

20. స్వర్ణపరీక్ష - బంగారమును గుర్తించు జ్ఞానము

21. అశ్వలక్షణము = గుఱ్ఱము యొక్క సుళ్ళు ప్రగరాల నెఱుంగు విధానము

22. గజలక్షణము - ఏనుగు లక్షణములు బోధించు విద్య

23. మల్లవిద్య - కుస్తీలు పట్టు విధానము

24. పాకకర్మ - రుచికరమైన వంట పదార్థముల నేర్పు రీతి

25. దోహళము - కెట్టింపు ఫలములు వృక్షాదులవల్ల పొందదగు దోహదక్రియలు

26. గంధవాదము - వివిధములైన సువాసన వస్తువులు అత్తరు పన్నీరు వంటివి తయారుచేయు నేర్పు

27. ధాతువాదము - రసాయన వస్తువులు నెఱుంగు విద్య

28. ఖనీవాద - గనులు మొదలైనవి నెఱుంగు విధము.

29. రసవాదము - పాదరసము మొదలైన వానితో బంగారు మొదలైనవి చేయు నేర్పు.

30. అగ్నిస్తంభనము - అగ్నిలో కాలకుండ తిరుగాడు రీతి.

31. జలస్తంభము - నీళ్ళను గడ్డగట్టించి, నందులో మెలంగుట.

32. వాయుస్తంభము - గాలిలో తేలియాడు విద్య

33. ఖడ్గస్తంభము - శత్రువుల ఖడ్గాదులను నిలుపుదల జేయు విద్య

34. వశ్యము - పరులను, లోబచుకొను విద్య

35. ఆకర్షణము - పరులను, చేర్చుకొను విద్య,

36. మోహనము – పరులను మోహింపజేయు తెరంగు.
37. విద్వేషణము – పరులకు విరోధము కల్పించడము,
38. ఉచ్చాటనము – పరులను ఉన్నచోటునుంచి వెళ్ళగొట్టడము,
39. మారణము – పరులకు ప్రాణహాని గల్గించడము.
40. కాలవంచనము – కాలముగాని కాలమున పరిస్థితులు మార్పు గలిగించడము.
41. వాణిజ్యము – వ్యాపారాదులు.
42. పాశుపాల్యము – పశువులను పెంచడములో నేర్పు.
43. కృషి – వ్యవసాయ నేర్పు.
44. ఆసవకర్మ – ఆసవములను, మందులను చేయు తెరంగు
45. లావుకర్మ – పశువక్ష్యాదులను స్వాధీనపరచుకొను రీతి.
46. యుద్ధము – యుద్ధముచేయు నేర్పు.
47. మృగయా – వేటాడు నేర్పు.
48. రతికళాకౌశలము – శృంగార కార్యములలో నేర్పు.
49. అదృశ్యకరణీ – పరులకు కానరాని రీతిని మెలంగడము,
50. దూత్యకరణీ – రాయబార కార్యములలో నేర్పు.
51. చిత్ర – చిత్రరూపులు వ్రాయడము.
52. లోహ – పాత్రలు చేయు నేర్పు
53: పాషాణ – రాళ్ళు చెక్కడము.
54. మృత్ – మట్టితో చేయు పనులలో నేర్పు.
55. దారు – చెక్క పని
56. వేణు – వెదరుతో చేయు కార్యములు,

57. చర్మ - తోళ్ళపరిశ్రమ.
58. అంబర - వస్త్ర పరిశ్రమ
59. చౌర్య - దొంగతనము చేయుటలో నేర్పు
60. ఓషధసిద్ధి - మూలికలద్వారా కార్యసాధనావిధానము
61. మంత్రసిద్ధి - మంత్రములద్వారా కార్యసాధనము
62. స్వరవంచనా - కంఠధ్వనివల్ల ఆకర్షణము
63. దృష్టివంచన - అంజనవంచన - చూపులతో ఆకర్షణము
64. పాదుకాసిద్ధి - ఇంద్రజాల మహేంద్రజాలములు తలచినచోటికి ఇంద్రజాలములనెడు గారడీవిద్యలతో నేర్పుకులుగలిగినట్టియు అనగా ఈ యరువదినాల్గు విద్యలతో ప్రకాశించు విద్యావంతులతో రాణించుచున్నట్టిదియు

23 అంగ, వంగ, కళింగ, కాశ్మీర, కాంభోజ, కామరూప, సౌవీర, సౌరాష్ట్ర, మహారాష్ట్ర, బెంగాళ, నేపాళ, మళయాళ, కేరళ, సింహాళ, చోళ, పాంచాల, కోసల, కుంతల, జ్వాలా, సాళ్వ, మగధ మాగధ, మాళవ, మత్స్య, వత్స, మద్ర, నైందం, సింధు, సైంధవ, ఆంధ్ర, గాంధార, లాట, వరాట, కర్నాట, ద్రమిడ, ద్రావిడ, పాండ్య, పుళింద, పారశీక, బాహ్లీక, బర్బర, విదర్భ కేకయ, కురు కిరత, దశార్ణ, హూణ, కెంకణ, కొంకణ, యవన, సూరసేన ఘూర్జర, విదేహ, చేది, భోజ, అవన్త్యాఖ్య మల్పంచాశత్, దేశ సమలంకృతే,

1. అంగము, 2. వంగము, 3. కళింగము, 4, కాశ్మీరము, 5. కాంభోజము, 6. కామరూపము, 7. సౌవీరము, 8, సౌరాష్ట్రము, 9, మహారాష్ట్రము, 10. బంగాళము, 11, నేపాళము, 12. మళ

యాళము, 13. కేరళము, 14. సింహళము, 15. చోళము, 16, పాంచాలము, 17, కోసలము, 18, కుంతలము, 19. జ్వాలము, 20, సాళ్వము, 21. మగధము, 22. మాగధము, 23. మాళవము, 24, మత్స్యము, 25. వత్సము, 26. మద్రము, 27. మైందము, 28. సింధు, 29. సైంధవము, 30. ఆంధ్రము, 31. గాంధారము, 32. లాటము, 33. వరాటము, 34. కర్నాటకము, 35. ద్రమిడము. 36, ద్రావిడము, 37. పాండ్యము, 38. పుళిందము, 39. పారశీకము 40. బాహ్లీకము, 41. బర్బరము, 42. విదర్భము. 43 కేకయము 44. కురుదేశము, 45. కిరాతము, 46. దశార్ణము, 47. హూణము 48. కొంకణము, 49, కోంకణము, 50. యవనము, 51 శూరసేనము 52, ఘూర్జరము, 53. విదేహము, 54, చేదితము, 55. భోజ దేశము 56, అవన్తి దేశములతో గూడిన ఈ దేశములెల్ల ప్రాచీన కాలమున వ్యవహారము. ప్రకృతము దేశములివియేయున్ననూ కాలానుసారము పేర్లు మార్పులు, కూర్పులు. చేర్పులు పొంది వికృతిరూపాలు జెందియున్న వేగాని వేరుగాదు.

24. "భాగీరధీ, భీమరధీ, సరస్వతీ, గౌతమి, నర్మదా. యమునా, కృష్ణవేణీ, వేణుకా, తుంగభద్రా, చంద్రభాగా, వరుణా, మలాపహారి, కావేరీ, కపిలా, కౌండినీ, కృతమాలా, విపాశా, తాపినీ, పూర్ణిమా తామ్రపర్ణీ, వేగతీ, హేమవతీ, వేత్రవతీ, నేత్రవతీ, విశోకా, కౌశికీ, గండకీ, గోముఖీ. పినాకినీ, పుణ్యాదాద్యనేక మహానదీ విరాజితే:

గంగానదీ, భీమరధీనదీ, సరస్వతీనది, గోదావరినది. నర్మదానది, యమునానది, కృష్ణానది, వేణుకానది, తుంగభద్రానది, చంద్ర

భాగానది, వరుణానది, మలాపహారీనది, కౌండినీనది, కృతమాలా నది, విపాశానది, తాపినీనది, పూర్ణిమానది, తామ్రపర్ణీనది, వేగవతీనది, హేమవతీనది, వేత్రవతీనది, నేత్రవతీనది, విశోకానది, కౌశికీనది, గండకీనది. గోముఖీనది. పినాకినీనది, (పెన్నానది) మొదలైన పుణ్యము నొసంగు మహానదులులతో ప్రకాశించు - (నీ భూ భాగమున)

25. వారణసీ, చిదంబర, శ్రీశైల, అహోబిల, వేంకటాచల, శ్రీరంగ సేతు, జంబుకేశ్వర, కుంభఘోణ, హాలాస్య, గజారణ్యా, గోకర్ణ రామనాధపుర, ఆవర్తపుర, అనంతశయన, అమరగిరి, యాదవగిరి, కరిగిరి, కకుద్గిరి, శ్వేతగిరి, నీలగిరి, గోవర్ధనగిరి, గయా, ప్రగాద్యనేక పుణ్యక్షేత్ర సంయుతే,

కాశీ, చిదంబరము, శ్రీశైలము, అహోబలము, తిరుపతి. శ్రీరంగము, సేతు రామేశ్వరము, జంబుకేశ్వరము. కుంభఘోణము, హాలాస్యము, గజారణ్యము, గోకర్ణము, రామనాధపురము, ఆవర్త పురము, అనంతశయనము (తిరునూ్కాడు) అమరగిరి. యాదగిరి కరిగిరి, కకుద్గిరి, శ్వేతగిరి. నీలగిరి, గోవర్ధనగిరి, గయా, ప్రయాగ, మొదలైన పుణ్యక్షేత్ర సమూహాములతో కూడిన (భూభాగము)

26. వారిశ్చంద్ర, నళ, పురుకుత్స, పురూరవః. సగరకార్తవీర్యాఖ్య షట్చక్రవర్తి పరిపాలితే.
వారిశ్చందు్రడు, నలచక్రవర్తి, పురుకుత్సమహారాజు, పురూరవ చక్రవర్తి, సగర చక్రవర్తి, కార్తవీర్యార్జున మహారాజు. అను నార్గురు పేరుపొందిన మహా చక్రవర్తులచే పరిపాలింపబడినట్టి (భూభాగమున)

27. బ్రాహ్మీ, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, ఇంద్రాణీ, వారాహీ, చాముండాఖ్య సప్తమాతృకావిరాజితే,

1. బ్రాహ్మీ, 2. మాహేశ్వరీ, 4. కౌమారీ, 4. వైష్ణవీ 5. ఇంద్రాణి, 6 వారాహీ, 7. చాముండా అను పేర్లతో గూడిన యేడుగురు మాతృమూర్తులతో ప్రకాశించునట్టిదియు (భూమి)

28. సావిత్రీ, సత్యవతీ, దమయంతీ, మదయంతి, లోపాముద్రా సుకన్యా కేశినీ, సుశీలా, అనసూయ, అరుంధతీ, ప్రభృతి మహాపతివ్రతా సందోహ సమలంకృతే,

సావిత్రి, సత్యవతి, దమయంతి, మదయంతి. లోపాముద్రా సుకన్యా కేశినీ, సుశీలా, అనసూయ, అరుంధతి మొదలైన మహా పతివ్రతల సమూహముతో ప్రకాశించునట్టిదియు

29. జంబూప్లక్ష, కుశక్రౌంచశాకశాల్మలి క్రౌంచనామక సప్తద్వీపైరావృతే, జంబూద్వీపము, ప్లక్షద్వీపము, కుశద్వీపము. క్రౌంచ ద్వీపము, శాకద్వీపము, శాల్మలీద్వీపము, క్రౌంచద్వీపము అను యేడు ద్వీపములతో కూడియున్నట్టియు,

30. రమ్యా రమణక, ద్వారకా, సింహళ, కైవల్య, మలయ, అశ్వభద్ర, కేతుగోభిలా, వంత్యపుష్కర, ఋషభ, రైవత, నిర్మోచనీయా మ్యపారావార. లంకాసార. కృతమాలాఖ్యాష్టాదశోపద్వీపవిరాజితే రమ్యకద్వీపము, రమణక ద్వీపము, ద్వారకా ద్వీపము, సింహళ ద్వీపము, కైవల్యము, మలయాద్వీపము, అశ్వభద్రము, కేతు, గోభిలము, అవంతి ద్వీపము, పుష్కరద్వీపము, ఋషభద్వీపము, నిర్మోచనీయము, అపారావారద్వీపము, లంకాద్వీపము, సార

ద్వీపము, కృతమూలము, అను పదునెన్మిది ఉపద్వీపములతో ప్రకాశించునట్టిదియు (ఈభూమికి విశేషణము)

31. ఇంద్రద్వీప, కశేరు, తామ్ర, గభస్తి, నాగ, సౌమ్య, గంధర్వ, చారణ భారతాఖ్య నవఖండ మండితే,

ఇంద్రద్వీపఖండము, కశేరుఖండము. తామ్రఖండము, గభస్తిఖండము, నాగఖండము, సౌమ్యఖండము, గంధర్వఖండము, చారణ ఖండము, భారతఖండము, అను తొమ్మిది ఖండములతో ప్రకాశించు నట్టిదియు,

32. సుందర తర, చందన మందార, కోవిదార, కుటజ, వట, పాటల, కరవీర, కురంటక, కంటకీ, పిప్పల, కర్పూర, కదళీ, ఖర్జూర, నారికేళ. రసాల, తమాల, తాళ, హింతాళ, కృతమాల, సరళ, వకుళ, వంజుల, పున్నాగ, జంబూజంబీర, నింబి. కదంబ, సారంగ, లవంగ, కుదాక్ష. ఇక్షు. కపిత్థ, అశ్వత్థ, బిల్వ, భల్లాతక, సల్లకీ, బదరీ, లికుచ, చంపక, కేతక, కుద్దాల, బంధూక, సింధువార, పిచుమంద, ఉదుంబర, పలాశ, పారిజాతాది, అనేక నోకహనివహ, నిరంతర, మనోహర, నందనవన, వ్రీడావహ, క్రీడా, వనవిహార, దేవదానవ గరుడ గంధర్వ, కిన్నర కింపురుష, సిద్ధసాధ్య. విద్యాధర, యక్ష రాక్షసాది దివ్యజన నివాస, సమలంకృతే,

సౌందర్యవంతమైన, చందన వృక్షములు, మందారములు, కోవిదారములు, కుటజములు, వటవృక్షములు పాటలవృక్షములు, కరవీరములు, కురంటకములు, కంటకీవృక్షములు, పిప్పలవృక్షములు, కర్పూరవృక్షములు, కదళీ (అరటి) ఖర్జూరము, నారికేళము (కొం

కాయ) రసాలము (మామిడి) తమాలము, తాళవృక్షము (తాటి) హింతాళము, కృతమాలము సరలము, వకుళము, వంజుళము పున్నాగము, జంబూవృక్షము (నేరేడు) జంబీరము, నింబము, కదంబము, సారంగము, లవంగము, ద్రాక్షవృక్షము, ఇక్షు (చెరకు) కపిత్థము (వెలగ) అశ్వత్థము (రాగి) బిల్వము (మారేడు] భల్లాతకము, సల్లకీ బదరీ (రేగు) లికుచము, చంపకము, కేతకీ (మొగలి) కుద్దాలము, బంధూకము, సింధువారము, పిచుమందము, ఉదుంబరము, పలాశము, (మోదుగ) పారిజాతము మొదలైన వృక్షములతో నందన వనమువలె, నొప్పుచుండ, విహరించుటకై వచ్చిన దేవతలు, రాక్షసులు, గరుడులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, యక్షులు, దానవులు, మొదలైన, యుత్తములతో పరికాశించు నట్టిదియు,

33. భారత కింపురుష, హారీళావృత భద్రాశ్వ కేతు మాల హిరణ్యక రమణక కురువర్షాఖ్య నవర్షాణాం మధ్యే భారతవర్షే.

భారతము. కింపురుషము, హరివర్షము, ఇళావృత్తము, భద్రాశ్వము కేతుమాలము, హిరణ్యకము, రమణకము, కురువర్షము, అను తొమ్మిది వర్షములలోగల భరతవర్షమునందు,

34. మత్స్య కూర్మ వరాహ నారసింహ, వామన, భార్గవ రామ శ్రీరామ బలరామ, బౌద్ధ, కల్క్యాద్యనేకావతార వైభవస్య.

మత్స్యావతారము. కూర్మావతారము. నరసింహావతారము. వామనావతారము. పరశురామావతారము, రామావతార. బలరామావతారము. బుద్ధావతారము కల్క్యావతారము. అను, అనేకావతారముల వైభవముతో గూడినట్టిదియు.

35. ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్య రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణ బలి హనుమదాఖ్య షోడశ మహా భాగవత విమలతర హృదయాన్తరాళ నిరన్తర నిర్గళ దోళావిహార సమాసక్తస్య గర్భస్థానేకకోటి బ్రహ్మాండ మండలస్య

ప్రహ్లాదుడు నారదుడు పరాశరుడు. పుండరీకుడు. వ్యాసుడు. అంబరీషుడు, శుకుడు శౌనకుడు. భీష్ముడు దాల్భ్యుడు. రుక్మాంగదుడు, అర్జునుడు. వశిష్ఠుడు. విభీషణుడు బలి. హనుమంతుడు మొదలైన భాగవతోత్తములతో గూడినట్టి నీ యనేకకోటి బ్రహ్మాండమండలమునకు,

36. భగవతో లక్ష్మీపతేర్నారాయణస్య నాభీ సరోజ మధ్య సముద్భూతస్య. చరాచరాత్మక నిఖిల ప్రపంచ నిర్మాణ కపట నాటక సూత్రధారస్య.

ఈ సమస్త, చరము అచరముతో గూడిన ప్రపంచ నిర్మాణ కపట నాటక సూత్రధారుడనదగిన, శ్రీ భగవంతుడైన లక్ష్మీపతి యగు నారాయణమూర్తి యొక్క నాభికమలము మధ్య భాగమున జన్మించినట్టియు,

37. శారద నీరద. పారద సచ్ఛాయ వాగ్దేవతా నిరర్గళ నిరన్తర వారణ విలాస భవనాయ మాన వదనారవిందస్య. సరస తర సారస నికర భాసుర మానస సరోవర, విహరణలాలస మానస రాజహంస వాహనస్య,

శరత్కాల మేఘము పోలికను, పాదరసమువలెను స్వచ్ఛమైన తెలుపు వర్ణముతో నొప్పుచుండు సరస్వతీదేవి యెల్లప్పుడు, నడ

యాడుచుండు ముఖముగల వాడును. స్వచ్ఛమైన పద్మములసమూహముగల మానస సరోవరమున విహరించి రాజహంసలు వాహనము గాగల వాడును,

38. (శ్రీ) భగవదాజ్ఞయా ప్రవర్తమానస్యాద్య బ్రహ్మణః ప్రథమ పరార్థే, పంచాద్వత్సరే వ్యతీతేషు, ద్వితీయ పరార్థే, ప్రథమవర్షే ప్రథమమాసే, ప్రథమపక్షే ప్రథమదివసే, అహని ద్వితీయయామే తృతీయముహూర్తే ప్రథమ ప్రాణాయామ సమయే,

(శ్రీ) భగవంతుని యాజ్ఞ మేరకు మెలంగు చుండెడు, ఆద్యబ్రహ్మ యొక్క నూరు వత్సరముల యాయువులో, నర్థ భాగమనదగు, ప్రథమ పరార్థకాలమున, ఏబది వత్సరములు నిండిన యనంతరము ద్వితీయ పరార్థము ప్రారంభించిన, తొలిసంవత్సరమున, మొదటి నెలలో మొదటిపక్షమున, మొదటిదినమున పగలు రెండవ యామములో మూడవ ముహూర్తమున తొలి ప్రాణాయామ కాలము నందు,

39. పార్థివ, కూర్మ, ప్రళయానతం శ్వేతవరాహ, బ్రాహ్మసావిత్ర్యాఖ్య సప్తకల్పానాం, మధ్యే శ్వేతవరాహకల్పే,

పార్థివకల్పము కూర్మకల్పము ప్రళయకల్పము అనంతకల్పము శ్వేతవరాహకల్పము బ్రాహ్మకల్పము సావిత్రికల్పము అనబడు ఏడు కల్పములప్తైకి, శ్వేతవరాహ కల్పమనబడు కాలమున

40, స్వాయంభువ, స్వారోచిషోత్తమ తామస రైవత చాక్షుష వైవస్వత్వ సూర్యసావర్ణి ధర్మసావర్ణి దక్షసావర్ణి రుద్రసావర్ణి బ్రహ్మసావర్ణి

ఇంద్రసావర్ణి. వేదసావర్ణ్యాఖ్య చతుర్దశమన్వంతరాణాం మధ్యే సప్తమే వైవస్వతమన్వంతరే.

స్వాయంభువు, స్వారోచిషమనువు, ఉత్తమమనువు, తామసమనువు రైవతమనువు, చాక్షుషమనువు, వైవస్వతమనువు, సూర్యసావర్ణి మనువు, ధర్మసావర్ణిమనువు, దక్షసావర్ణిమనువు, రుద్రసావర్ణి మనువు, బ్రహ్మసావర్ణిమనువు, ఇంద్రసావర్ణిమనువు, వేదసావర్ణి మనువు, అనబడు పదునాల్గు మనువులపైకి, యేడవ మనువైన వైవస్వతమన్వంతర కాలమున,

41. సప్తవింశతి మహాయుగేష్వతీతేష్వష్టావింశతితమే, మహాయుగే, కృతత్రేతాద్వాపర కలియుగాఖ్య చతుర్యుగాణాం మధ్యే అష్టా వింశతి సహస్రోత్తర సప్తదశలక్షాబ్దే కృతయుగే షణ్ణవతి సహ స్రోత్తర ద్వాదశలక్షాబ్దే, త్రేతాయుగే, చతుష్షష్టి సహస్రోత్తర అష్టలక్షాబ్దే ద్వాపరయుగేచ సమతీతేద్వాత్రింశత్స హస్రాన్విత చతుర్లక్షాబ్దే కలియుగే ప్రథమపాదే.

ఇరువదియేడు మహాయుగములు గడచి, ఇరువదియెనిమిదవ మహా యుగకాలమున, కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయు గము, కలియుగము అను నాల్గుయుగములలోని పదులక్షల ఇరు వది యెన్మిది వేల కాలమనదగు కృతయుగము, పండ్రెండు లక్షల తొంబదియారువేల కాలమనదగు త్రేతాయుగము, ఎనిమిది లక్షల అరువదినాల్గువేల కాలమనదగు ద్వాపరయుగకాలము, నాల్గు లక్షలా ముప్పదిరెండు కాలముగల కలియుగము పైకి మొదటి పాదముతో గూడిన కలియుగమున

42, యుధిష్ఠిర, విక్రమ, శాలివాహన, విజయాభినందన నాగార్జున కలి

భూపాఖ్య శకపురుష మధ్యే పరిగణిత శాలివాహనశకే. బౌద్ధావతారే,

యుధిష్ఠిరుడు, విక్రముడు, శాలివాహనుడు, విజయాభినందనుడు, నాగార్జునుడు, కలి భూపాలుడు అనబడు శకపురుషులపైకి లెక్కింపబడునట్టి శాలివాహన శకకాలమున బౌద్ధావతార కాలముననూ

43. బ్రహ్మ, దైవ, పిత్ర్య, ప్రాజాపత్య, బార్హస్పత్య, సౌర, చాంద్ర సావన, నాక్షత్రమానాఖ్య నవమాన మధ్యే పరిగణితే, ప్రవర్తమానే చాంద్రమానే.

బ్రహ్మమానము, దైవమానము, పిత్ర్యమానము, ప్రాజాపత్యమానము, బార్హస్పత్యమానము, సౌరమానము, చాంద్రమానము సావనమానము, నక్షత్రమానము అని చెప్పబడు తొమ్మిదివిధములైన (కాలమును గుర్తింపజేయు విధానములకు పంచాంగరచనా విధానానికి) మానములపైకి ప్రకృతము లెక్కింపబడునట్టి చాంద్రమానకాలమున

44. ప్రభవాదీనాం, షష్ట్యాస్సంవత్సరాణాం మధ్యే అముకసంవత్సరే, ప్రభవ, విభవ మొదలైన యఱువది సంవత్సరములపైకి జరుగుచున్న ఈ సంవత్సరమున

45. దక్షిణాయనోత్తరాయణయోర్మధ్యే అముకాయనే దక్షిణాయనము, ఉత్తరాయణము అనబడు అయనములపైకి జరుగుచున్న ఈ యయనకాలమున

46 వసంతాది షడృతూనాం, మధ్యే అముకఋతౌ
వసంతము, గ్రీష్మము, వర్షము, శరత్, హేమంతము, శిశిరము అనబడు నారు ఋతువులపైకి జరుగునట్టి యీ ఋతువున

47. చైత్రాదిద్వాదశ మాసమధ్యే అముకమాసే, శుక్లకృష్ణపక్షయో ర్మధ్యే, అముకపక్షే, ప్రతిపదాది, తిథిమధ్యే అముకతిథౌ, భాను ప్రభృతి వాసరమధ్యే అముకవాసరే

చైత్రాది పండ్రెండు మాసములపైకి ఈ జరుగుచుండు నెలలో శుక్లపక్షము, బహుళపక్షము అనబడు పక్షములపైకి ఈ పక్షమున పాడ్యమి మొదలు నుండు తిథులపైకి ఈ జరుగు తిథిరోజున ఆది వారము మొదలు ఈ జరుగువారముననూ

48. అశ్విన్యాది నక్షత్రమధ్యే అముకనక్షత్రే విష్కంభాదియోగమధ్యే అముకయోగే, బవాదికరణమధ్యే అముకకరణే అస్మిన్ శుభ ముహూర్తే,

అశ్విని మొదలగు నక్షత్రములపైకి యీ నక్షత్రమున విష్కంభ ము మొదలైన యోగములపైకి యీ యోగమున బవ మొద లైన కరణములపైకి యీ కరణమున మేషాదిరాశులపైకి యీ రాశియొక్క శుభముహూర్త పుష్కరాంశమున

అస్మిన్ కల్యాణమంటపే ఇదానీం అనాద్య విద్యావాసనయా సంసార చక్రేస్మిన్ మహతినానాయోనిషు, జనిత్వా కేనాపి భాగ్య విశేషణ ఇదానీం మనుష్యజన్మ విశేషం ప్రాప్తవతః మమ జన్మ ప్రభృతి ఏతత్క్షణపర్యన్తం, మనోవాక్కాయ కర్మభిః జానతః అజ్ఞానతః కృతానాం, మహాపాతక ఉపపాతకాదీనాం నవ విధానాం పాపానాం సద్యః అపనోదనద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం,

ఈ కల్యాణ మంటపమునందు. సంసార చక్రమున పరిభ్రమించు చున్నవారమై అనేక జన్మలనెత్తుచు ఈనాటికీ మానవజన్మను అదృష్ట విశేషముచే నెత్తియున్న కారణమున నాజన్మ మొదలు కొని నేటివరకు మానసికంగాగాని, వాచికంగాగాని, శారీరకంగా గాని, తెలిసియో తెలియకనో చేసిన మహాపాపములు సామాన్య పాపములుగూడ వెనువెంటనే నశించి శ్రీ పరమేశ్వరానుగ్రహము గల్గుటకొరకున్నూ

49. గంగావాలుకాభిః సప్తర్షిమండల పర్యన్తం, కృతరాశేః దివ్య సహస్ర వర్షావసానే ఏకైక వాలుకాపకర్షణక్రమేణ సర్వరాశ్య పకర్షణసమ్మితకాలే

గంగావాలుకలచే సప్తఋషిమండలమువరకు నొక్కొక్కరాశి యతిక్రమించు కాలము పర్యంతము

50. దశపూర్వేషాం, దశావరేషాం, మధ్యంశానాం పితౄణాం మమచ సకుటుంబస్య నరకాదుత్తీర్య శాశ్వతబ్రహ్మలోక నివాస సిద్ధ్యర్థం, మా వంశములోని నాకన్నా ముందువారగు పదిమందియును, నా యనంతరము పదిమందియు, నేను నా కుటుంబము నరకలోకము నుంచి తరించి శాశ్వత బ్రహ్మలోక నివాససిద్ధి పొందుటకొరకును

51. గోధూమైః సూర్యమండల పర్యంన్తం కృతరాశే దివ్య సహస్ర వర్షావసానే ఏకైక గోధూమాపకర్షణ క్రమేణ సర్వరాశ్యపకర్షణ సమ్మిత కాలే శాశ్వత బ్రహ్మలోక నివాస సిద్ధ్యర్థం.

52. మాషైః చంద్రమండల పర్యన్తం, కృతరాశేః దివ్య సహస్ర

వర్షావసానే, ఏకైక మాషాపకర్షణ క్రమేణ సర్వరాశ్యపకర్షణ సమ్మిత కాలే, శాశ్వతబ్రహ్మలోక నివాససిద్ధ్యర్థం.

53 సర్షపైః ధ్రువమండలపర్యన్తం, కృతరాశేః దివ్యసహస్రవర్షావసానే ఏకైక వర్షాపకర్షణ క్రమేణ సర్వరాశ్యపకర్షణ సమ్మిళితకాలే. శాశ్వతబ్రహ్మలోక నివాస సిద్ధ్యర్థం.

54, తిలైః నక్షత్రమండలపర్యన్తం, కృతరాశేః దివ్య సహస్రవర్షావసానే ఏకైకతిలాపకర్షణక్రమేణ సర్వరాశ్యపకర్షణ సమ్మితకాలే శాశ్వత బ్రహ్మలోక నివాస సిద్ధ్యర్థం.

త్ర్యణుకైః బ్రహ్మాండోర్ధ్వకటాహ పర్యన్తం, కృతరాశేః దివ్య, సహస్ర వర్షావసానే, ఏకైకత్ర్యణుకాపకర్షణక్రమేణ సర్వరాశ్య పకర్షణ సమ్మితకాలే శాశ్వత బ్రహ్మలోకనివాస సిద్ధ్యర్థం,

సూర్యమండల పర్యంతము, చంద్రమండల పర్యంతము ధ్రువ మండల పర్యంతము మెలంగుచు శాశ్వత బ్రహ్మలోక నివాస సిద్ధికొరకై,

55. త్రిగుణీకృతాగ్నిష్టోమాతిరాత్రాప్తోర్యామ. సాంతపన, వాజపేయ, పౌండరీక, రాజసూయాశ్వమేధ, బృహస్పతిసవన, సర్వతోము ఖాది శతక్రతు పుణ్యఫలావాప్త్యర్థం.

మూడురెట్లు ఫలితములతో గూడినదై అగ్నిష్టోమము, అతిరాత్రము అప్తోర్యామము, సాంతపనము, వాజపేయము, పౌండరీకము రాజసూయము, అశ్వమేధము, బృహస్పతిసవనము, సర్వతో ముఖము మొదలైన నూరు యజ్ఞములఫలము గల్గుటకొరకును,

56. ఇహజన్మని జన్మాంతరేషుచ, బాల్య కౌమార, యౌవనవార్థకేషు జాగ్రత్స్వప్నషుప్త్యవస్థాసు, జ్ఞానతశ్చ, కామతః, అకామతః, స్వతః పరప్రేరణయావా సంభావితానాం సర్వేషాం పాపానాం అపనోదనార్థం,

ఈ జన్మయందుగాని, మరోజన్మయందుగాని చేసినట్టియు బాల్యమున గాని, కౌమార దశయందుగాని, యవ్వనకాలమున గాని, ముసలితనమునగాని, మేలుకొనియున్న సమయమున గాని, నిదురించు కాలమునగాని, స్వప్నకాలమునగాని, తెలిసిగాని తెలియకగాని, కోరిగాని కోరకనేగాని నేను సొంతముగ తలంచిగాని, ఇతరుల ప్రోత్సాహముచేతగాని, వచ్చిన సమస్తపాపములు, తొలగుటకొరకై,

57. ధర్మార్థ కామ మోక్షాది చతుర్విధ పురుషార్థ సిద్ధ్యర్థం, క్షేమ స్థైర్య విజయాయురారోగ్యైశ్వర్యా దీనాం, ఉత్తరోత్తరాభివృధ్యర్థం,

ధర్మము, అర్థము కామము మోక్షమనెడు, మానవుడు కోరదగిన పురుషార్థ సిద్ధికొరకై, క్షేమము. స్థిరత్వము విజయము: ఆయుస్సు ఆరోగ్యము, ఐశ్వర్యము, మొదలైనవి, మున్ముందు, అభివృద్ధి జెందుటకొరకును,

58. ఇష్టదేవతాప్రీత్యర్థం, స్వగృహ్యోక్త ప్రకారేణ సాలంకృత సహిరణ్యోదక కన్యా మహాదానం కరిష్యే

తమ యిష్టదేవత ప్రీతికొరకు, తమకు సంబంధించిన గృహ్యసూత్ర

ములలో చెప్పిన రీతిని, అలంకారముతో కూడి యున్నట్టియు, బంగారముతో కూడిన, నీటిధారతో చేరియున్న (ధారాదత్తమైన) మహాదానమనదగిన, కన్యాదానమును ఇచ్చుచున్నాను. అని, మహాసంకల్పమును విధిగ చెప్పుదురు,

ఈ యేబది యెన్మిది వాక్యముల సారాంశమేమనగా భగవంతునిచే నిర్మింపబడిన యీ ప్రపంచమున నేనున్న దేశమున నేను, నా పితరులు తరించుటకును శాశ్వత బ్రహ్మలోక నివాస సిద్ధికొరకై నాచే యథాశక్తిని యలరింకరింపబడియున్న కన్యను దానమొసంగు చున్నానని భావము. ఈ రీతిని కన్యాదానమొసంగు కాలమున మహా సంకల్పము చెప్పవలయును. ఇందలి పదముల కూర్పు భావముల సొంపు త్యాగోద్దేశ్యమును త్రికరణశుద్ధిని ప్రశాంతతను నిష్కల్మషత్వమును వైహికాముష్మికత్వమును పాప పరిహారత్వమును సూచించును,

అనంతర మీ యర్థములనే సూచించు చూర్ణికలను మంగళాష్టకములను కొందరు పఠింతురు అనంతరము కన్యాదానమున కుపక్రమింతురు. తనకు పూర్వముగల తాతతండ్రులు పదితరములవారును, తన యనంతరము పుత్ర, పౌత్రాది పదితరములవారును తాను చేరి యిరువది యొక్క తరములవారు ఈయొక్క కన్యాదాన ఫలముచే తరించగలరని శాస్త్రప్రమాణములు యింతవరకు సూచించియున్నాను. ఆరీతినే లోకమున నేటివరకు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యశూద్రులు నాల్గు జాతులవారు అనుసరించుచు వచ్చుచున్నారు. ఈ విధముగ కన్యాదాన ఫలమునాశించి వివాహము మంత్రపూతముగ చేయుదురు. భారతదేశమున నందులో సనాతన సాంప్రదాయతెగకు చెందిన బ్రహ్మ, క్షత్రియ, వైశ్య శూద్రులనదగు నాల్గు తెగలవారు మాత్రమే ప్రపంచమున నింకెక్కడను ఏ తెగ

వారును యీరీతిని వేదశాస్త్ర మంత్రముల రీతిని కన్యాదానము చేయు. విధానము లేదు. వారికీ రీతిని, ఇహపర సాధనమవబడు నీకన్యాదాన విధియు తెలియదనియే చెప్పవచ్చును. కానీ కాలానుసారముగ, పాశ్చాత్యవ్యా మోహ ధురీణులై, మనవారు గూడా నీ కన్యాదాన ఫలాదుల నంతగ నెరుంగ నేరకను, నమ్మకము లేకను, విధానము తెలియకను, తోచిన రీతిని యిష్టానుసారము కేవలము, పరస్పరానురాగాదులేగదా వివాహానికి ముఖ్యమని భావించి, ప్రేమవివాహాలకు లోనగుచుండుట మిక్కిలి చింత్యము, వీనికితోడు, శాఖాంతర పక్షాంతర, జాత్యంతర వివాహములు చేసి కొనుటయు నేర్పడుచున్నది. ఈ వివాహములు తొలుత మనవిజేసిన రీతిని ప్రేమవివాహాల (గాంధర్వాదులు) లోనికి చేరునుగాని ఇరువది యొక్క తరము వారిని తరింపజేయు, బ్రాహ్మవివాహానికి మాత్రము దూరమగును అందుచే కన్యాదాన ఫలము లేకయు పోవుచున్నది. ఈ చెప్పిన బ్రాహ్మ వివాహమున, 1. కన్యాదానము 2. మాంగల్యధారణము (మంగళసూత్రము కట్టుట) 3. అక్షతారోపణము (తలంబ్రాలు) 4. సప్తపది. (సన్నెకల్లు త్రొక్కించుట) 5. నాకబలి (నాగవల్లి) అను నైదంశములు ముఖ్యములుగ జరుగును. వీనికి తోడుగ, కొన్ని హోమాదులు, సదస్యములాంటివి చేర్చబడును.

ఇంతవరకు కన్యాదాన విధిని గూర్చి వివరించితిని. ప్రకృతము మాంగల్య ధారణమును గూర్చి తెలిసికొందము. రెండు మంగళసూత్రములు వివాహ సమయమున ధరించును. ఇందులో నొకటి, గౌరీపూజ కాలమున, (వివాహానికి ముందుగ, కన్యచేత గౌరీపూజ చేయింతురు.) తల్లిచే నొక, మాంగల్యము కట్టింతురు. దీనికే "తల్లిబొట్టు" యని వ్యవహారము.

మరియొకబొట్టు వివాహకాలమున కన్యాదానానంతరము, వరునిచేత

సందరి సమక్షమున సందరి యాశీస్సులనందుచు కట్టింతురు. దీనికి అత్తవారింటి బొట్టు అని వ్యవహారము.

ఈ వివాహకన్య ఉభయకుల వర్ధనిగా రాణించుటకై తల్లిగారింటి బొట్టు, అత్తవారింటిబొట్టు రెండు బొట్టులు నామెహృదయదేశమున మెరయుచు నిటు పుట్టినింటి వృద్ధిని అటు మెట్టినింటి వృద్ధిని సర్వకాల సర్వావస్థలయందు హృద్దేశమున మరవక మెలంగుచుండునట్లు నామె హృదయమున నీ మాంగల్యములు రెండు మెరయుచుండును. భర్తయొక్క సుఖదుఃఖములు రెండు తనవే పుట్టినిల్లు, అత్తవారిల్లు అను రెండు యిండ్ల అభివృద్ధులు తనవే. గార్హస్థ్యజీవనముచేత ఈలోక సుఖము, పరలోక సుఖములు రెండు తనవల్ల తన భర్తకు చేకూరుటకు తానే కారణము, సంతానము, సంపద అను రెంటికి తానే మూలము అను ద్వంద్వములను సర్వదా స్మృతిపథమున మెరయుచుండవలయునని నీ రెండు మాంగల్యములను నా వధువునకు కట్టుటలో వరుని భావమిమిడియుండును. అందుకు తగినట్లుగనే నీ వివాహకాలమున చెప్పబడు మంత్రముల భావములు యొప్పుచున్నవి. తొలుత వధూవరులచేత కంకణధారణము చేయింతురు. ఇందుకై "మమ ఆయుష్యాభివృద్ధ్యర్థం పాణిగ్రహణాంగత్వేన కర్మాదౌ రక్షాబంధనము [కంకణములు కట్టుట] చేయింతురు.

అనంతరము "కన్యాం కనక సంపన్నాం, కనకాభరణైర్యుతాం,
దాస్యామి విష్ణవేతుభ్యం బ్రహ్మలోక జిగీషయా"
అను మంత్రమును చెప్పుచు కన్యాదానము జేతు .

"ఇమాం కన్యాం ప్రదాస్యామి, పితౄణాంతారణాయవై।
కన్యాం సాలంకృతాం, సాధ్వీం, సుశీలాయ సుధీమతే।
ప్రయతోహం ప్రయచ్ఛామి, ధర్మకామార్థ సిద్ధయే"

అని, అలంకరించిన, కన్యను, విష్ణు స్వరూపుడవైన నీకు నేను, బ్రహ్మలోక ప్రాప్తి నొందుటకై యిచ్చుచున్నాను, మఱియు, యీ కన్యాదానముచే నా పితరులెల్లరు తరించుట కొరకై, యీ యలంకరింపబడిన కన్యను ధర్మ అర్థకామ, మోక్షప్రాప్తి కొరకై గూడా, నీకు ఇచ్చుచున్నానని, నీటి ధార బోయుదురు. దీనికే, కన్యాధార యనియు, కన్యాదాన మనియు నందురు.

"ఇతిసహిరణ్యాం కన్యాహస్త ముదకపూర్వం వరహస్తే దద్యాత్ అని యిందుకు శాస్త్రము అనగా, బంగారుతోగూడ, కన్య చేతిని వరుని చేతిలో నుంచి, ఉదక ధారపోయవలయునని విధి. కాన ఆదితిని నేటివరకు కన్యాదానము జరుగుచున్నది. కన్యాదానముతోగూడ శక్తియున్నవారు. "తతః కన్యాదాన సాద్గుణ్యార్థం గోదాన భూదాన, సాలగ్రామ దానాది షోడశ మహాదానానిచకుర్యాత్" యథాశక్తి దానానిచకుర్యాత్" అను విధిననుసరించి గోదానము, భూదానము సాలగ్రామదానము, హిరణ్యా దానము, గృహదానమువంటి పదునారు దానములు చేయదగును. శక్తి హీనులు యథాశక్తిగ దానము చేయవచ్చును. అను ధర్మముననుసరించి నేడు వరకట్నము సర్వత్రవ్యాపించి కన్యాదాతయొక్క సర్వస్వమును హరించుచున్నారు. ఇది మిక్కిలి హేయము. ఈ రీతిగ వరదక్షిణలు పీసించి తీసికొనుటచే కన్యాదాత బాధపడడమువల్ల పాతిత్యమేర్పడునేగాని సుఖ మిసుమంతేని గలుగ నేరదు. యోగ్యులైనవారు, విద్యావంతులైనవారు, ధర్మముపై విశ్వాసమున్నవారు యిప్పటికైనా యీ వరకట్నపు ఆశలను వదలుకొటయు, వీనికి ప్రోత్సాహమివ్వకయు నరికట్టుట శ్రేయస్కరము. ధర్మము యోగ్యులైనవారు గమనింతురుగాక.

కన్యాదానకాలమున వరకట్నముగ వచ్చు సంపదకాశించి తమ పుత్రుని యమ్ముకొనినవారు కాగలరు. అట్లు అమ్ముడుపోయిన పుత్రుడు తనకు ఉత్తరక్రియాది కార్యములొనర్చుటకనర్హుడు కాగలడు. ఈసంపద వల్ల జీవించవలయునని యాశించువారు మిక్కిలి నీచాతి నీచపు జీవనము చేతురుగాని సుఖింపలేరు. దేవీభాగవతమున స్త్రీవిత్తముతో జీవించువారు మిక్కిలి అధమాధములై జీవించగలరనిగలదు. కాన కన్యాదానార్థమై యథాశక్తిని నిచ్చు విత్తమును గ్రహించుట యోగ్యముగాని పీడించి వరదక్షిణలు యాచించుట విజ్ఞానవంతులెల్లరు గర్హించుట నిషేధించుట యుక్తమని మనవిజేతును.

అనంతరము కన్యాదానకాలమున వరునిచేత నీరీతిని ప్రమాణము జేయింతురు.

"ధర్మేచ-అర్థేచ - కామేచ - నాతిచరితవ్యేతిదాతావదేత్" అను రీతిని ప్రమాణము జేయించును. ధర్మకార్యములు చేయునప్పుడుగాని, ఆర్థిక సంబధమైన కార్యములు చేయునప్పుడుగాని కామ్యకర్మలు అనగా ప్రాపంచికమైనకోరదగిన కోరికలు అనుభవించుకాలమునగాని ఈ కన్యతో గూడ నీవు ధర్మార్థకామములను అనుభవించవలసినదేగాని, ఈమెను వదలి ధర్మార్థకామములననుభవించరాదు అని కన్యాదాతకోరగ "నాతి చరామి తివరఃప్రిత్యక్త్వా" అను విధిననుసరించి వరుడు నీవు కోరినరీతిని ధర్మార్థకామములను యీమెనువీడి వేరుగ మెలఁగనేరనని ప్రమాణము జేయును. అనగా ధర్మము అర్థము కామము అను మూటిని యీమెతో గూడ ననుభవింతునేగాని యీమెనువీడి యనుభవించనని కన్యాదాతకు వరుడు ప్రమాణముజేసి చెప్పును. కనుకనే ఎన్నడేని భర్తయైనవాడు

ఏదేని ధర్మకార్యము చేసినచో ఉదకధారను భార్యచేత వేయింతురు. ఆమె ఉదక ధారపోయనిది చేయు ధర్మము శాస్త్రీయము కాగలదు.

ఆర్థిక విషయములలోగూడ నామె తోడ్పాటు అవసరమేయగును. స్వగృహమునకు కావలసిన వస్తు వాహనాదులు ఆమె కోరిన రీతిని సేవడము యుక్తము. సంసారమున పొదుపు పరిమితము ఆమెవల్లనే కాగలదు కాన ఆర్థిక విషయమున నామె తోడ్పాటు యుక్తమే.

కామ్యవిషయమున నామె తోడ్పాటు మరింత ముఖ్యము. గార్హస్థ్య జీవనమునకు కావలసిన కోరికలెన్నన్ని గలవు. వాని నన్నిటిని పొందవలయుననిన నామె తోడ్పాటున్ననే సాధ్యము.

కనుక ధర్మార్థ కామములు మూటి విషయములో నిద్దరును సమభాగులై మెలంగవలయునని తెలుపుటకు కన్యాదాత ప్రమాణము చేయమని కోరును. వరుడారీతిని ప్రమాణము చేయును.

మోక్షవిషయంలో మాత్రము ప్రమాణము చేయరాదు. ఎవరెవరి బుద్ధి ననుసరించి వారివారి మానసిక పరిపక్వస్థితిననుసరించి వారు వారు చేయు సుకృత దుష్కృతముల ననుసరించి వారు వారు చేయు గురు కృపా కటాక్షమున చేయు సాధన ననుసరించి, వారి వారి జన్మ సాఫల్యత ననుసరించి మోక్షము భగవంతుడిచ్చునది లేనిది యుండును గాన దానిలో నిరువురు సమముగ వ్యవహరింప సాధ్యముగాదు. గాన మోక్షమును గూర్చి ప్రమాణము చేయరాదుగూడ.

"సుముహూర్తే వధూవరయోః శిరసిగుడ జీరకంనిక్షిపేత్" అను రీతిని సరియైన ముహూర్తకాలమున వరుని శిరమున వధువు, వధువు శిరమున వరుడు జీలకర బెల్లము నుంచవలయును. దీనికే ముహూర్తకాలమందురు. కనుకనే "అయం ముహూర్తః సుముహూర్తో అస్తు" అని ఈ ముహూర్తము సుఖకరమైన ముహూర్తము అగుగాకయని అక్షతలు పెద్దలు ఆశీర్వదించి వధూవరులపై చల్లుదురు.

"తతః సుముహూర్తే కన్యాంద్రుష్ట్వా"

చక్షుషీఉపసంహృత్య అభ్రాతృఘ్నీ మితిజపిత్వా" అనురీతిని కన్యను వరుడు వధుని కన్యనాసమయమున బాగుగ చూడవలయును. అట్టితరిని ఈ కన్యక మంచి చూపుతో చూచుగాక. యీమె చూపులు క్రోధ ఈర్ష్యాసూయాదులు లేనివై సోదరులు, పుత్రులు నశింపశేయునది కాకుండుగాక. దరిద్రమును నిచ్చునదిగాకుండుగాకయని వేదమంత్రములతో చెప్పవలెను. అనంతరము 'తస్యాః భ్రువోః అంతరం దర్భేణసంమృజ్య ప్రతీచంనిరస్యేత్" అను విధి ననుసరించి కన్యయొక్క కనుబొమల మధ్యనుంచి పాపటవరకుగ దర్భలతో తుడిచి వెనుకకు పారవేయుదురు దీనివల్ల ఆమె దృష్టిదోషము హరించి సౌమంగల్యత్వము పెంపొందును. అనంతరము కాడిమానును కన్యశిరమున నుండులాగున పట్టుకొని యాకాడి మాను రంధ్రమున బంగారమునుంచి నందుపై నీరుపోసి కన్యశిరమును ప్రోక్షింతురు. యీకార్యమునకు 'యుగచ్ఛిద్రాభిషేక'మని వ్యవహారము. యుగమనగా కాడిమాను ఛిద్రము. రంధ్రము అందునుంచి చేయు అభిషేకముగాన యుగచ్ఛిద్రాభిషేకమని వ్యవహారము. యీయభిషేకము చేయుటచే కన్యయొక్క శరీరసంబంధమైన ఏ రోగములున్నను నశించుననియు నశించవలయుననియు భావము.

ఇందొక కథగలదు. సంక్షేపముగ చెప్పెదను. పూర్వము 'అపాల' యను పేరున నొక కన్యకయుండెడిది. ఈమెకు కుష్ఠువ్యాధి సోకినది. ఈ వ్యాధి నశించి, దేవేంద్రుని వివాహమాడవలయునని యీమె ఘోరముగ తపస్సు చేయుచుండెను. యీమె తపము చేయుచుండ సమీపాన గల నది వెల్లువతో నుప్పొంగి యీమెతోగూడా కొట్టుకొని పోవుచుండెను. కానీ యీమెమాత్రము భయపడక స్థిరచిత్తముతో తపస్సులోనే

యుండెను. దీనినంతయు గగనమార్గమున నెళ్ళుచుండిన ఇంద్రుడు గుర్తించినవాడై చక్రమువనగల నొక తీగసు పుచ్చుకొని నకలి తారసమును తన రథముకు తగల కాడిమాను రంధ్రముగుండా నీమేక్ష బహులాగున నుమ్మ వేసెను. ఆరీతిని యుమ్మి వేసిన రసము యీమెపైబడి యీ శారీర రోగములెల్ల నశించి, మంచి రూపురేఖాలావణ్యములుగల సుందరవతిగ నా కన్యమారినది. ఆరీతిని మారిన మాత్రుపతె పవిత్రతము వివాహము జేయు బడు యీ కన్యకగూడ శారీరక రోగములెల్లను నశించి మంచిరూప వతియై 'అపాలా' కన్యవలె ప్రకాశించు గాక' యను భావముతో నీగాథకు సంబంధించిన మంత్రములతో కన్యక శిరమున కాడిమానునుంచి నారంధ్ర మున బంగారమునుంచి ధర్భలందుంచి ఈ బంగారము. దర్భల నీళ్ళతో నీ వివాహ కన్యకశిరమును ప్రోక్షింతురు. ఇట్టుకై కాడిమాను నలంకరించి తెత్తురు. 'సకృత్సాన్నపయతి'యని నైరుమంత్రములచే నీయుగచ్ఛిద్రాభి షేకముజేయించి యనంతరము మాంగల్యధారణము జేతురు.

'ఆయుర్వర్చోయశోబలాభివృధ్యర్థం సంపూర్ణ వర్ష శతపర్యంతం సుఖేన జీవనసిధ్యర్థం యోక్త్రిమాంగల్యపూజాంకరిష్యే' అని ఆయుస్సు వర్చస్సు బలము వృద్ధిపొందుటకొరకు నూరు సంవత్సరములకాలము ఉభ యులు సుఖజీవనము చేయుటకొరకు మాంగల్యపూజ నాచరింతురు.

"మాంగల్యం తంతునానేన, మమజీవన హేతునా
కంఠె బధ్నామి సుభగే, త్వంజీవ శరదాంశతం॥
మోక్త్రిమాంగల్య ముహూర్తః సుముహూర్తోస్తు

అని, మాంగల్యమును, కన్యమెడలో వరుడు కట్టునప్పుడు పఠించు మంత్ర మియ్యది.

ఓ సౌభాగ్యవతీ, కన్యకా, నాజీవన హేతువైన, ఈ మాంగల్య

ము. నీకంఠమున కట్టుచున్నాను. నీవు నూరుసంవత్సరములు సుఖజీవనము జేతువుగాక, అని, మాంగల్యమును కట్టును. ఈ మాంగల్యము కట్టు సమయము మంచి సుముహూర్తమగుగాక యని పెద్దలు అక్షతలు చల్లుచు నాశీర్వదింతురు.

అనంతరము అక్షతారోపణము (తలంబ్రాలు) "తతః అక్షతారోపణం కుర్యాత్" అని విధి తడిపి, ఆర వేసిన బియ్యముతో తలంబ్రాలు పోసికొనదగినదని భావము.

"వధూశ్చ పూర్వం, ప్రథమే తృతీయే, వరశ్చపూర్వం, ద్వి చతుర్థయోస్తు" అనురీతిని, కన్యకచేత, తొలుత తలంబ్రాలు పోయించవలయును, అనంతరము వరుడు కన్యకశిరమున తలంబ్రాలు పోయవలయును. మరలా కన్యక, అనంతరము వరుడు తలంబ్రాలు పోయదగినది. ఈరీతిని, మొదట, మూడవసారు కన్యక, రెండవతూరి నాలుగవమారు, వరుడు తలంబ్రాలు పోయవలయునని భావము.

"ఇతి వధూవరయోః శిరసి. అక్షతారోపణం కృత్వా"

యీరీతిని, వేదమంత్రములు పఠించుచుండగ. వధూవరులు శిరస్సులపై అక్షతారోపణ కార్యము చేసి, యనంతరము, నాలుగవమారు, "చతుర్థ పర్యాయే అన్యోన్యం యుగపత్" అనురీతిని నాలుగవమారు, ఇరువురు ఒకేతూరి శిరమున తలంబ్రాలు పోసికొనవలయును, యీరీతిని కన్యాదానము తలంబ్రాలు అనబడు అక్షతారోపణము జరుగగాని, వివాహము చేసికొనిన వధూవరుల నాశీర్వదింతురు. ఈ యాశీర్వదించు రూపమున వారివారికి తోచిన రీతిని చదివింపులు, ముట్టజెవ్వట యాచారమైనది.

అనంతరము హోమకార్యము లాచరింతురు. యీ హోమకార్య

మునకు ప్రధాన హోమమందు. "అనయానవో ధయా వధ్వా, సహ మయా ఆయుష్యాభి వృధ్యర్థం వివాహ ప్రధానహోమం కరిష్యే" అని. యీ వివాహమాడిన కన్యకతోగూడా నేను. ఆయుర్వృద్ధిపి జెందుటకై నీ వివాహసంబంధమైన. ప్రధానహోమము నాచరించుచున్నానని వరుడు సంకల్పము చేయవలయును.

అనంతరము పాణిగ్రహణము అను విధిని జరిపింతురు, "దక్షిణేన వామ పాణింగృహీత్వా" యని తన కుడి చేతితో కన్యక యడమచేతిని పట్టుకొనవలయును ఆరీతిని పాణిగ్రహము చేయునప్పుడు గూడ ప్రత్యేక విధియు గలదు, దానికి తగినట్లు ఫలితములు గలవని నీరీతిని ఆపస్తంబమహర్షి సూత్రీకరించి యున్నారు.

"అథాస్యై దక్షిణేన, నీ చాహ స్తేన, దక్షిణ ముత్తానగంవాహస్తం గృహ్ణీయాత్. తనచేయి పైభాగమునసనుండులాగున కన్యక చేయి క్రింది భాగమున నుండులాగున, గ్రహించవలయును.

"యదికామయేత స్త్రీరేవ. జనయేయ మిత్యంగుళరేవ గృహ్ణీయాత్" ఈ కన్యక చేతిని గ్రహించు వరుడు అందరూ స్త్రీలే జనించవలయునని తలంచిన (అనగా ఆడబిడ్డలే పుట్టవలయుననిన) ఆమె చేతి వ్రేళ్ళనన్నిటిని. చేర్చి పట్టవలయును.

"యదికామయేత, పుగంసఏవ జనయేయ
మిత్యం గుష్ఠమేమ సోభివాంగుష్ఠం"

పుత్రులు మాత్రమే గల్గు కోరికనున్నచో, నా కన్యయొక్క బొటనవ్రేలి మాత్రమే పట్టవలయును, ఆడ మగ, యిరువురు కలుగవలయుననినచో బొటనవ్రేలితో గూడా నన్నివ్రేళ్ళు కలిపి పట్టవలయును గాన, నే కోరిక యున్న నారీతిని, పాణిగ్రహణము చేయుదగినది.

అనంతరము "సప్తపది" యనువిధిని చేయింతురు. ఈ కార్యముచే వధూవరుల మనస్సు స్థిరబడి పరస్పరమనురాగము వృద్ధియై దాంపత్య జీవితమును సుఖకరముగ జేసికొనదగునని తలంపున, వేదమంత్రములు చెప్పుచు కన్యకను, నేడడుగులు, నడిపించి, కన్నెకాల్లు త్రొక్కించు విధికే సప్తపదియని పేరు.

అథఉత్తరేణాగ్నిం. దక్షిణేన పదాప్రాచీం ఉదీచీం వాదిశమభి ప్రక్రమయ, త్యేకమిషేతి ప్రతిమంత్రగ్ం సప్తపదానిగత్వా" అనువిధి ననుసరించి, హోమము చేసిన అగ్నికి ఉత్తరపు దిక్కున కన్యకను నిలిపి, తూర్పునకుగాని, ఉత్తరమునకుగాని, కుడికాలుతో నేడడుగులు నడ పించుతు వేదమంత్రములు చెప్పుదురు.

"సఖేసత్యాది సూన్నృత ఇత్యన్తగ్ం, సప్తమే పదేఅపతి సఖే సత్యాది మంత్రమును పఠించుచు, కన్యకను నేడవయడుగు వేయించదగినది.

ఈ యేడడుగులు నడపించి, వరుడు కన్యకతో నీ యర్థములు వచ్చు వేదమంత్రములు పఠించును. నేను, ఆకాశమువంటి వానిని నీవు భూమి వంటి దానివి. రేతస్స్వరూపము నేను రేతస్సు ధరించు శక్తిగల దానవు నీవు నేను మనస్సు వంటివానిని. వాక్కులవంటి దానివినీవు అనగా మనస్సునగల భావము నేను ఆ భావాన్ని వాక్కులతో చెప్పబడునుగాన వాగూపము నీవు ఈరీతిని అవినాభావ సంబంధముగల వారమై దాంపత్య జీవితమున మెలంగదగుదుమని వరుడు కన్యతో వచించును. ఈ మాట లెల్లయు వేదమంత్రములుగ పఠింతురు

అనంతరము, "మేపతిః జీవాతుశరదశ్శతం" అనుకోరికతో కన్య తన భర్త నూరుకాలములు జీవించులాగున చేయవలసినదాని సూర్యని

ప్రార్థించుచు, పేలాలతో హోమము చేయమని తన సోదరుడు అందివ్వగా తాను గ్రహించి భర్తచేతికిచ్చి హోమము చేయమని కోరును. దీని కేలాజహోమమందురు.

అనంతరము వివాహప్రవేశహోమమాచరింతురు. "అగ వధూ గృహాత్ స్వగృహాత్ ప్రత్యానయన్" కన్యక పుట్టినింటినుండి తన ఇంటికి వచ్చి ఈ గృహప్రవేశహోమమాచరింపదగియున్నది. కానీ వివాహకాలముననందే ఈ ప్రవేశహోమము చేయుంతురు,

మూడు వేదమంత్రములను పఠించుచు అగ్నియెదుట కన్యతో నిట్లనును.

"సంరాజ్ఞీశ్వశురేభవ సంరాజ్ఞీశ్వశ్ర్వాంభవ అను మంత్రములు పఠించుచు. అనగా నీవు మాకందరికి రాణివంటిదానివిగ నగుగాక. మా యింటికి నీవధిపతిరాలువు నా సంపదకంతా నీవేయధికారిణివి. అని తన యింటినంతయు "సంకాశయామిలాతి గృహాందర్శయతి"చూపించును.

అనంతరము శేషహోమమనబడు వివాహాంగధర్మప్రతిష్ఠానార్థ కార్యము నాచరింతురు: "వివాహాంగ ధర్మప్రతిష్ఠాపనంకరిష్యే" యని సంకల్పింతురు, అనంతరము 'ధ్రువమరుంధతీంచదర్శయతి' యని ధ్రువ నక్షత్రమును, అరుంధతీ నక్షత్రమును దర్శింతురు. దీనిచే ధ్రువనక్షత్రము వలె స్థిరత్వము. అరుంధతీనక్షత్రముచే సౌభాగ్యవృద్ధియు వధూవరులకు చేకూరగలవు గాన. నా రెండు నక్షత్రములను దర్శింతురు.

పెద్దలచే నాశీర్వాదకార్యము నాచరింపజేతురు, దీనికే 'సదస్య' మందురు. వేదవేత్తలను రావించి వేరమంత్రపఠనము వాగ్లతో జేయించి

వధూవరుల నభివృద్ధికొరకు నాశీర్వదింపవలయును. 'దంపత్యోః ఆయుర్వర్చో యశోబలాభివృద్ధ్యర్థం శిష్టాచారప్రకారేణ మహదాశీర్వచనం కుర్యాత్' అనురీతిని మంచి ఆచారవంతులైన వేదవేత్తలచే ఈ నూతన దంపతులకు ఆయుర్వృద్ధికొరకు సంపద సంతానాద్యభివృద్ధులకొరకై వేద మంత్రములతో నాశీర్వాదము జేయించవలయును, కాలానుసారము నేటివారు వినోదార్థమై సంగీతకచ్చేరీలు, కవిసమ్మేళనాలు చేయుచున్నారు. ఇది వినోదకార్యముక్రిందవచ్చునేకాని వేదవేత్తలుచేయు నాశీర్వాదమున లవలేశమైన సరిరాదు. కాన తప్పక వేదవేత్తల యాశీర్వాదములకై యత్నించవలయును.

'అష్టవర్షాత్ భవేత్ కన్యా పుత్రివత్ పాలితా మయా ఇదానీం, తవ దాస్యామి దత్తాం స్నేహేన పాలయం' అని చెప్పి కన్యాదాత కన్యకను వరునకప్పగించును. పూర్వకాలమున ఎనిమిదవ వత్సరముననే వివాహము జేతురు గాన ఎనిమిది వత్సరములపాటు నేను ఈ కన్యకను కొడుకులతో సమానంగా సాకినాను. యీనాడు నీకు అర్పించినాను గాన నీవు స్నేహముతో నీమెను పరిపాలించవలసినదని కోరుచు కన్యకను అప్పగింతురు. ఈ కార్యమునకే 'అప్పగింత'లని వ్యవహరింతురు.

అనంతరము నాకబలి [నాగవల్లీవ్యవహారం] కార్యమును జేతురు.

చతుర్దిక్షు నాకబలి మృణ్మయ పాత్రాణి నిధాయ అని నాల్గువైపుల పాత్రిలుపెట్టి (మట్టివి) 'తంతునావేష్ట్య' యనురీతిని వానికి దారములు దారములుచుట్టి 'సువాసిన్యే దీపసహిత కాంస్యపాత్రిద్వయం గృహీత్వా' ముత్తైదువలు దీప పాత్రిముల జంటను గ్రహించియుండగ "త్రిఃపరిత్రిఃక్రమేత్ అన్నికబళాన్ సర్వతో నిధాయ" ముప్పదిమూడన్నపుముద్దలు చుట్టూ అంతటాయుంచి 'చతుర్దిక్షు నాకదేవతాభ్యోబలిం ఉదకపురస్సరం విసృజేత్' అను రీతిని స్వర్గలోక దేవతలనుద్దేశించి నలువైపుల నీటి ధారతో త్యాగమొనర్పదగినది.

అనంతరము "గౌరీ నీలలో హిత పూజాంకరిష్యమాణః అని సంకల్పించి, పల్లలను, కన్యకకు కట్టుదురు. వసంత మాధవ పూజనాచరించి,

"దేవీంద్రాణీ నమస్తుభ్యం, దేవేంద్ర ప్రియభామిని వివాహం భాగ్యమారోగ్యం, పుత్రపౌత్రాంశ్చ దేహిమేయని. ఇంద్రుని భార్యయైనశచీదేవిని ప్రార్థించుచు యీ వివాహమైన వధూవరులకు, భాగ్యము ఆరోగ్యము పుత్రులు పౌత్రులు యివ్వవలసినదని ప్రార్థింపవలయును. నీరీతిని వారివారి యోగ్యతానుసారము కులాచారము రీతిని దేశాచారము రీతినికొన్ని మార్పులతో వివాహ కార్యము వధూవరుల క్షేమార్థము సుఖార్థము ఆయుర్వృద్ధ్యర్థము. సత్సంతానార్థము, సుఖజీవనార్థము సౌభాగ్యవృద్ధ్యర్థము, వేదమంత్రములతో నీ పవిత్రమైన వివాహ కార్యము, తమ యిరువది యొక్క తరములవారు తరించుకొరకై సాలంకృత కన్యాదాన పూర్వకము, సనాతన సాంప్రదాయ ధురీణులు వివాహ కార్యమును, తమ శక్త్యానుసారము వైభవోపేతముగా జరిపింతురు. యీ రీతిని బ్రాహ్మ వివాహము చేసికొని వివాహమాడిన కన్యతో గృహప్రవేశము, యథాశాస్త్రీయముగ చేయదగును. పెండ్లియైన పదునారు దినముల లోపుగ, సరిదినములలో గృహప్రవేశము చేయదగునందురు:

"షష్ఠేష్టమేవా, దశమేపి సేవా, వివాహమారభ్య వధూప్రవేశః|
పంచాంగ శుద్ధంచదినం వినాపి, తిథౌవ సద్గోచర కేపికార్యః|"

అను రీతిని, వివాహమయినది మొదలు, ఆరవరోజుగాని, ఎనిమిదవ రోజుగాని, పదియవ దినమునగాని, తిథివార, నక్షత్ర యోగములనబడు పంచాంగ శుద్ధిలేకున్ననూ గృహప్రవేశమునకు ముఖ్యము

"వివాహ మారభ్య వధూప్రవేశః యుగ్మేదినే షోడశవాసరాంతే|

వివాహమైనది మొదలు పదునారు దినములలోపుగ సరిరోజులలో నేదినము నేని గృహప్రవేశము చేయవచ్చును.

"వధూప్రవేశః నదివాప్రశస్తః"।

అనురీతిని నూతన వధూగృహ ప్రవేశము పగలంత యోగ్యము గాదు గాన, సూర్యాస్తమయా నంతరమే, నూతన వధూగృహ ప్రవేశము చేయుట యుక్తము. కనుక వివాహమయినది మొదలు పదు నారు దినముల లోపుగ, సరిరోజులలో సూర్యాస్తయామనంతరము వివాహమైన నూతన వధూగృహ ప్రవేశమునకు యోగ్యమని యున్నదీ గాన, నీ రీతిని గృహప్రవేశము చేసిన నూతన దంపతులు, గృహస్థులను పెరబరగు చుందురు: నూతన దంపతులు నూతన గృహస్థులు, అని వ్యవహారము ఇట్లు వివాహమాడి వచ్చిన నూతన వధువును, తన యింట గల ప్రతివారు మిక్కిలి గారాబముగ గౌరవమర్యాదలతో చూచుకొనుట ధర్మము, ఏదో దేహవృత్తికి బానిసతనానికి వచ్చినరీతిని చూచుట కొంద రిలోగలదు, అది చాలాతప్పు, ఆ స్త్రీ తనయింటికి గృహలక్ష్మివంటిదని గుర్తించవలయును. ఆమె యేమాత్రము నొప్పిబడవనూ తన సిరిసంపద లెల్లయు తొలగగలవు. అపకీర్తి వాటిల్లగలదు, ఆమె నెంత గౌరవముగ చూచిన నంత ఘనత చేకూరగలదు.

మఱియు మన హిందూసమాజములో స్త్రీలను చాలా చులకనగా చూతురని పాశ్చాత్యుల ప్రచారము మెండుగలదు, అందుకతోడు స్త్రీలకు విద్యాబుద్ధులు చెప్పించరనియు గృహకృత్యములకు వినియోగింతు రేగాని వారికేపాటి నాగరికత లుండవనియు పాశ్చాత్యవ్రాతలు లేకపోలేదు ఇది యంతయు హిందువులపైని గల వారి ద్వేషభావమేగాని వేరుగాదు. స్త్రీలకు విద్య చెప్పించరనునదియు చాలా పొరబడి చెప్పినపలుకులేగాని వేఱుగాదు.

ప్రాచీనకాలమున స్త్రీలు చదివినవారేగాని చదవనివారు లేరు. రామా

యణమున సీత విద్యావతిగ వర్ణింపబడినది. భారతమున ద్రౌపది విద్యావతి, రాచకార్యములలో చతురతిగలది భాగవతమున రుక్మిణీ సత్యభామలు విద్యావతులే. ఈ రీతిని పురాణ సాహిత్యమున స్త్రీలెందరో విద్యావతులుగ వర్ణింపబడిన భాగాలు కోకొల్లలుగ గలవు.

ఇంక కావ్యనాటకాలలోని నాయికలు గొప్ప విద్యా వినయ రూపరేఖా వతులుగా నాయాకవులు వర్ణించియున్నారు.
పార్వతీదేవి బాల్యమున విద్య నేర్చుచుండగ నామెకు విన్నమాత్రముననే విద్య వచ్చునట్లు కాళిదాసు "ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యా"యని స్పష్టముగ వచించియున్నాడు. ఈ రీతిని కవులెల్లరు వారివారి కావ్యాలలోని నాయికలు గొప్ప విద్యావతులుగ వచించియున్నారు.

హంపీ విద్యానగర రాజులైన హరిహర బుక్కరాయుల కాలమున స్త్రీలు విద్యావతులై కావ్యములను వ్రాయుచుండినట్లు చరిత్రలు ఋజువు చేయుచున్నవి.

హంపీ విద్యానగరపు రెండవరాజైన వీరబుక్కరాయల పుత్రుడు కంపరాయలనిగలడు. ఇతని భార్య గంగాదేవి 'మధురావిజయ'మను పేర సంస్కృత కావ్యము వ్రాసియున్నది. ఆనాటి రోజులలో నెందరో విద్యావతులున్నట్లుగలదు.

ఇట్లుండగ మన ప్రాచీన రాజులు నశించి మొగలాయులను తురుష్క ప్రభువులు పాలించుకాలమున దేశాక్రమణాదులు మతాంతీకరణములు బలవంతముగ స్త్రీహరణములు దేశమున జరుగు దుఃస్థితి దాపురించినది. అట్టి కాలమున పురుషుడు బయటికి వెళ్ళి మరలా ఇంటికివచ్చు వరకూ సందేహాముగనుండిన కాలమయ్యేది, అట్టికాలమున స్త్రీలను వెలుపలకు పంపడమెంతో బాధాకరము. కాన నాటి దుఃస్థితి ననుసరించి పురుషులకే సరిగ

విద్య నేర్వదగిన కాలముగ నుండని రోజులవి. అట్టి కాలమున స్త్రీలకు విద్య నేర్ప వీలుండెడిదికాదు. అనంతరము వీరిని తరమి పాశ్చాత్యులు పాలకులైరి. వీరు వచ్చి మన దేశపు పూర్వపు స్థితి తెలియనివారగుటచే స్త్రీలకు విద్య నేర్పరేమోయని భ్రాంతిబడిరి.

వారి పరిపాలనకాలమున నందందు స్కూళ్ళున్ననూ సాహసించి ధైర్యముగ స్త్రీలను బయటికి పంపించుటకు బయపడుచుండిరి. పరిస్థితము రానురాను కొంత స్థిమితము జెందినవారము గాన పూర్వమువలె నేడు గూడ స్త్రీలకు విద్య నేర్పుటకెవ్వరు వెనుకాడవలసిన విషయము లేదు. గాన నేడు సమాజమున స్త్రీలు విద్యాబుద్ధులు నేర్చి పురుషులకు చేదోడువాదోడుగ మెలగదగు నవకాశములున్నవిగాన స్త్రీలు తప్పక విద్యాబుద్ధులు గలిగి మెలంగుట యుక్తము.

మన సమాజమున పూర్వముగూడ స్త్రీలనెంతో ఘనముగ గౌరవించుచుండిరి. అందుకు నిదర్శనముగ

> యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః
> యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రా ఫలాః క్రియాః.

ఎందు స్త్రీలు గౌరవింపబడుదురో నందు దేవతలానందింతురు. ఎందు స్త్రీలు గౌరవింపబడరో నందు ఫలితముండ నేరదు.

> తస్మాదేతాః సదాభ్యర్చ్యా భూషణాచ్ఛాదనాశనైః
> భూతికామైః నరైర్నిత్యం సత్కారే షూత్సవేషుచ.

అనురీతిని స్త్రీలనెల్లప్పుడు వస్త్ర భూషణాదులతో గౌరవింపదగినది. గౌరవాదులచేతను, ఉత్సవాదులచేతను సంపదనాశించు మానవుడు యెల్లప్పుడు స్త్రీలను గౌరవింపవలయును, ఈరీతిని పురాణాదులలో నందందు

స్త్రీలను గౌరవింపవలసినదని చెప్పిన భాగాలు మెండుగగలవు. ఇట్లు గృహస్థుడైనవాడు స్త్రీలను గౌరవించుచు గృహస్థధర్మమును పాటింపవలయును.

గృహస్థుడైనవాడు అనగా వివాహమాడినవాడు

'దయాలజ్జాక్షమాశ్రద్ధాప్రజ్ఞాత్యాగః కృతజ్ఞతా
ఏతేయస్యగుణాస్సన్తి గృహస్థోముఖ్య ఉచ్యతే'

అను రీతిని దయాగుణమలవరచుకొనవలయును. సర్వప్రాణులయందు దయజూపుటయే దయాగుణము.

(2) లజ్జ — సిగ్గుబడుట. తనకేమి తెలియదనియు తానేమిజేసిన గొప్పగ నెవరికి మేలుగల్గురీతిని చేయుటలేకపోవుచున్నానేయనియు సిగ్గుబడ దగియున్నది.

(3) క్షమా — ఓర్పు — ఏ కార్యమునేని త్వరబడి చేయకయు నెవరేమనిన త్వరబడకయు ఓర్పుజెందుట ముఖ్యము.

(4) శ్రద్ధ — కార్యములయందు విశ్వాసమున్న నా కార్యమంత గొప్పగ నెరవేరదు.

(5) ప్రజ్ఞా — బుద్ధి విశేషము — నవనవోన్మేషప్రజ్ఞా అనురీతిని అప్పటికప్పుడు బుద్ధిలోగల్గు నూహాలకే ప్రజ్ఞయందురు. 'ప్రజ్ఞ దైవదత్త' మందురు. దైవానుగ్రహమున్ననే బుద్ధిలో నూహాలు గల్గునందురు.

(6) త్యాగః — ఉన్నసంపదను త్యజించుట అనగా తనకున్నంతలో దానధర్మాలకై సంపద వినియోగము త్యాగము. త్యాగగుణము లేకున్నచో లోభియందురు. లోభివానికి కీర్తి ప్రతిష్ఠలు సన్నగిల్లును. త్యాగికి లోకమున గౌరవ మర్యాదలినుమడించును.

(7) కృతజ్ఞత – చేసినమేలును మరవక గుర్తించుకొని ప్రవర్తించుటకు కృతజ్ఞతయందురు. ఈయేడుగుణములు ఖ్యాతి ముఖ్యములు గాన గృహస్థుడు తప్పక నీ సప్తగుణములు అలవరచుకొనవలయును.

యథానదీనదాః సర్వేసాగరేయాంతి సంస్థితిం
తథైవాశ్రమిణః సర్వేగృహస్థేయాన్తి సంస్థితిం.

అనురీతిని నదులుగాని, నదములుగాని సముద్రమును చేరినట్లు అందరూ గృహస్థునాశ్రయించి జీవింతురు గాన గృహస్థు శ్రేష్ఠుడు.

'ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం మంత్రమౌషధ సంగమం
దానమానావమానాని నవగోప్యాని కారయేత్'

అనురీతిని ఆయుస్సు సంపద తన యింటిబాధలు తానొనర్చు రహస్యాలోచనలు తాను గైకొను మందులు భార్యా భర్తల సంగమము తానిచ్చు దానములు తన గౌరవము తన యవమానము అను తొమ్మిదింటిని గృహస్థుడైనవాడు వెల్లడి శేయరాదు.

'దయా సర్వ భూతేషు క్షాన్తి, రనసూయా శౌచమనా
యాసో మంగళమ కార్పణ్యమస్పృహేత్యాదికుర్యాత్'

ప్రాణులయందు దయదలచడము (కనికరము చూపడము) ఓర్పు వహించడము అనూయ జెందకుండుట పరిశుభ్రతను పాటించుట శారీరకముగను మానసికముగను శ్రమజెందకుండుట శుభమైన కార్యములను చేయుచుండుట యథాశక్తిని కొంచమేనియు దానమొసంగుటయు పరుల సంపద నాశించకుండుట యనబడు మానవ సామాన్య ధర్మములను గృహస్థుడు తప్పక యలవరచుకోవలయును.

'న్యాయాగత ధనేన కర్మాణికుర్యాత్'

న్యాయముగ ధన సంపాదనచేయవలయును. ఆరీతిని న్యాయార్జిత ధనము చేతనే దైవకార్యాదులు చేయవలయును.

'ఆపత్కాలే అసాధుభ్యః ప్రతిగృహ్ణీయాత్'

అను ధర్మమున్నది గాన ఆపదలు గల్గిన సమయమున (కష్టకాలమున) దుర్మార్గులనుండియు ధనము గ్రహింపవచ్చును,

"విహితాకరణే ప్రతిషిద్ధసేవనే నరకపాతః"

అని యున్నది గాన తనకు నిర్ణయించిన కార్యములాచరించ కుండడము నిర్ణయించనట్టి పనులు చేయుడం చేతను నరకప్రాప్తి కల్గుచున్నదది ధర్మ వచనములున్నవిగాన గృహస్థుడైనవాడు తప్పక తనధర్మములను ఆచరించు చుండవలయును.

'ఏవంకుర్వన్ దృష్ట మదృష్టంచ ఫలంలభేత్'

అనియున్న ధర్మాన్ని పురస్కరించుకొని మానవు లీ రీతిని ధర్మవంతులుగా మెలంగుదురేని ప్రత్యక్షముగ కీర్త్యాదుల ఫలితము పరోక్షముగ స్వర్గ లోకాది సుఖములు పొందగలరు కాన తప్పక ధర్మవంతముగ మెలంగు టకై ప్రయత్నించవలయును. కనుక, తొలుత ఆత్మగుణములవలన దగిన, ఎనిమిదింటిని ప్రతిస్త్రీయు ప్రతిపురుషుడు. గుర్తించి, మెలంగుదురేని వారికి సమస్త ఫలితములు గలుగ గలవు గాన,

(1) దయాగుణమును తొలుత యలవరచుకొవలయును.

(2) క్షాంతియనబడు, గుడము, అనగా ఓర్పుచెంది మెలంగడము ఏ కార్యమునందైననూ త్వరబడక ప్రశాంతముగ నుండడమలవరచు కొవలయును.

(3) అనసూయా – ఇతరులలోని సద్గుణములకు అసూయపడక వారి సద్గుణముల కానందించుటయే. అనసూయ యనబడును. అనగా నితరులనుచూచి అసూయబడకుండడము.

(4) శౌచము – శారీరకశౌచము, మానసిక శౌచము అని శౌచము రెండు విధములు. శరీరము పరిశుద్ధముగ నుంచుకొనడము శారీరక శౌచము. మనస్సులో నేలాంటి క్రోధ ద్వేషా సూయాదులు లేక పరిశుద్ధమైన మనస్సుతో మెలంగుట మానసిక శౌచము. శౌచం సంకరవర్జనం అనురీతిని దుష్టులతో చేరడము, తినరానిపదార్థములను తినకుండడము గూడ శౌచవాధిలో చేరును.

(5) అనసూయాసః – శారీరకముగను మానసికముగను అలసట జెందడము. కష్టపెట్టడమువంటి పనులు చేయకుండడమే అనాయా సమనబడును.

(6) మాంగల్యం – నిందింపబడు కార్యములను చేయకుండడము, శుభకరమైన పనులు చేయడము మాంగల్యమనబడును.

(7) అకార్పణ్యము – లోభితనముచూపక, తగినవారికి యోగ్యులైనవారికి. శక్తికొలది భక్తితో నిచ్చు దానాదులు అకార్పణ్యము లగును.

(8) అస్పృహా – ఇతరుల సంపదనాశింపక మెలంగుట అస్పృహ యనబడును.

ఈరీతిని మానవులు, (స్త్రీలు – పురుషులు) దయా, క్షాంతి అనసూయ, శౌచ, అనాయాస, మాంగల్య, అకార్పణ్య అస్పృహాలను, విధిగ నలవరచుకొని మెలంగినచో నుత్తమజీవితము. నుత్తమ మానవత్వము నలవడగలదు.

ఈ యెన్మిది యాత్మగుణములు, యలవరచుకొని మెలంగువారికి "బ్రహ్మణః సాయుజ్యం సాలోక్యంచగచ్ఛతి" అను విధిప్రకారము బ్రహ్మసాయుజ్య పదవిని సులభముగ నందుకోగలరు గాన, మానవులీ చెప్పిన, ఎన్మిది మానసిక గుణములు తప్పక నలవాటులోనికి తెచ్చుకొనదగి యున్నది.

ఈ చెప్పిన మానసిక సంబంధమైన యెన్మిది గుణములున్నవారే యుత్తములు. వీనిలో నేదికొరవడినను, నీచత్వమునకు దారితియ్య గలదు గాన, బాల్యమునుంచే నీ గుణాష్టకము తమ జీవితమున నలవాటు లోనికి నుండులాగున నలవరచుకొన వలయును.

"అనుకూల్యం కళత్రస్య స్వర్గోభవతి నిశ్చితం।
ప్రాతికూల్యం కళత్రస్య నరకోనాత్ర సంశయః॥

అనురీతిని. యీ మానసికాష్టగుణములు నేర్చినవారై - భార్యా భర్తలన్యోన్యాను రాగముతో మెలంగుచుందురేని, వారిజీవితము స్వర్గ తుల్యముగ నుండగలదు, భార్య యనుకూలవతిగ లేకపోయినచో వారి గృహస్థజీవనము నరకలోకముగ నుండగలదు గాన, ఈ యనుకూల ప్రతి కూలములు మనస్సునకు సంబంధించి యుండును గాన, మనస్సు పరిశుద్ధ పరచుకొని యీ చెప్పిన యెన్మిదిగుణములు నలవరచుకొనినచో స్త్రీ పురు షులు సుఖజీవనము కారణభూతులు కాగలరు.

"అనుకూలా సదాహృష్టా, దక్షా సాధ్వీ, ప్రజావతీ।
ఏభిరేవ గుణైర్యుక్తా శ్రీరేవ, స్త్రీ నసంశయః॥

అనురీతిని యీ చెప్పిన దయాది యెన్మిది గుణములు నేర్చినదై, భర్తకనుకూలవతిగ మెలంగుచు, యెల్లప్పుడు సంతోషముతో గూడినదై నేర్పరిరాలై, మంచినడత గల్గినదై. సంతానవతియైయున్న స్త్రీ నిజముగ

శ్రీయనఁదగును. అనగా లక్ష్మీదేవియే యనబడగలదు. అనాడే యా స్త్రీ గృహలక్ష్మియని పిలువబడుటకు తగిన యర్హతగల్గి యుండును.

"ధర్మోమిత్రం ప్రమీతస్య, విద్యామిత్రం ప్రవాసిన॥
భార్యామిత్రం గృహస్థస్య, దానంమిత్రం మతిష్యతః॥

అనునట్లు గృహస్థుడైనవానికి పెండ్లియాడిన భార్యయే, మిత్రుని వలె, యుక్తాయుక్తములు నేర్వసమర్థురాలై యుండును గాన, సర్వదా భర్తను, స్నేహితుడు కాపాడుచుండులాగున కాపాడుచుండదగినది. ఈ రీతిని వివాహమైనపిదప, నూతన దంపతులు గార్హస్థ్య జీవనమునకుతగిన, మానసికాష్ట లక్షణములను నెఱింగి, సాంసారిక జీవనమునకు గడంగి, విద్యా, కుల, రూప, విభవ, విత్తమర్యాదలకు తగినరీతిని జీవయాత్ర గడపదగి యున్నది. స్వేచ్ఛాప్రియులై మెలంగదగదు. ధార్మిక జీవనములవరచుకోవలయును. నీతి నియమయుతిగల్గి మెలంగవలయును. ఉన్నతాదర్శములు, ఉన్నతాశయములుగలిగి, ఉన్నతత్వము చూపుకొని మెలంగవలయును. అందుకై ధార్మిక జీవనమత్యావశ్యకమై యున్నది. అనగా తమ జీవితమును ధర్మబద్ధముగ జేసికొని మెలంగవలయును. అందు కాచరింపదగిన విధులు దినచర్యక్రింద నీరీతిని వివరించి యున్నారు. కావున దినచర్య సక్రమముగ నలవరచుకొనినచో ధర్మబద్ధమైన జీవనము అలవడనేతు లవడగలదు. అందులకై, గృహస్థులైన వారీ రీతిని దినచర్య నలవరచుకోదగినది. ఈ రీతిని యలవరచుకొను విధులకే సదాచారమనియు నందురు. "సదాచారవతాంనహానిః" యనియు పెద్దలవచనము. అనగా సదాచారవంతులకు యెన్నటికిని హానియుండదు. "విహితాచార నిహీనేషు, క్షిప్రంనశ్యతి వైభవమ్" అనియు పెద్దల తలంపు. అనగా నిర్ణయించియున్న ఆచారవిధులు సక్రమముగ పాటించనివారి వంశము గూడ, త్వరలోనే నశించగలదనియు నున్నది గాన. గృహస్థులైన వారె

ల్లరు వారి వారికి తగిన సదాచారవీథులు తప్పక యలవరచుకొని మెలంగుట శ్రేయస్కరము. ఎందుకనగా యీ కాలమున (యీ కలియుగమున) ప్రతివారు ఆచారహీనులై నశింతురనే శాస్త్రప్రమాణాలు గలవు.

“అత్యన్తః దుఃఖినః కేచిత్, కేచిత్ అతిధనాస్తదా।
ప్రతిగ్రహే బ్రాహ్మణాశ్చ కదాచిత్ కుర్వతే స్పృహామ్।

కొందరు మిక్కిలి ధనవంతులై విఱ్ఱవీగు చుందురు. బ్రాహ్మణులు దానధర్మము లెవ్వరిత్తురాయని యాసించుకొని యుందురు, కనుక యీ కాలమున

“సర్వే పాపరతాః సర్వే పాపపరాయణాః
నిజాచార విహీనాశ్చ భవిష్యన్తి కలౌయుగే।

అందరు పాపపుపనులే జేతురు. పాపకార్యములకు తలపోయుదురు తమ కులధర్మములకు తగిన ఆచారాదులు వదలివేసినవారై మెలంగు చుందురు. మరియు

“విప్రాః వేదవిహీనాశ్చ ప్రతిగ్రహ పరాయణాః
అత్యన్త కామినః క్రూరాః భవిష్యన్తి కలౌయుగే।

యీ కాలమున బ్రాహ్మణులు వేదము చదువుటను మానివేయుదురు. ఇతరులు యిచ్చుదానాలకు ఆశింతురు, మిక్కిలి క్రూరులై కాముకులై మెలంగగలరు. ఇంకయు

“పరాన్నలోలుపాః నిత్యం తపోవ్రత పరాఙ్ముఖాః
పాషండ సంగలుబ్ధాశ్చ, భవిష్యన్తి కలౌయుగే।

ఇతరుల ఇంటి భోజనానికి యాశించుకొని యుందురు. తపస్సు, వ్రత పూజాదులు మానివేయుదురు. నీచులతో గూడి మెలంగు చుండ

మఱియు 'ఉత్తమా అపినీచతాం' గొప్పవారెల్లరు నీచులు కాగలరు. 'నీచాశ్చధన సంపన్నాః' నీచులు ధనవంతులు కాగలరు, ఇంకయు గూడ "యథాస్త్యన్యచ్చ పదంప్రతి" యను విధిచొప్పున ఉన్నతపదవుల నుగూడ పొందగలరు.

అయిననూ "అధర్మబుద్ధి దాతారః, ధర్మబుద్ధి విరోపిణః" అను రీతిని, అధర్మమున మెలంగుచుండువారై. ధర్మబుద్ధిలేనివారై, పోగలరు, ఇంకయు గూడా –

'పరోక్ష నిందకాః క్రూరా; సంముఖః ప్రియవాదినః।

పరవిత్తాభిలాషిణః।। అను విధిప్రకారము, చాటున దూషింతురు ఎదుట పొగడుచుందురు. ఇతరుల సంపద హరించుటకై యాశించుచుందురు. అందుచే మనస్సు పరిశుద్ధములేక, పోవుదురు. 'మనః శుద్ధి వివర్జితాః। మానసిక శుద్ధిలేనివారై క్రూరులు కాగలరు, అందుచే, ధర్మబుద్ధిలేక 'స్త్రీ పరాశ్చజనాః' అనురీతిని, స్త్రీ వ్యామోహముగలవారై, తమ తమ విధులు సక్రమముగ నెరవేర్చలేనివారు కాగలరు. చివరకు. చనపోయిన తలిదండ్రులకు ఉత్తరక్రియలు చేయలేక, కలియ్యన్తి కలౌ ప్రాప్తేనచ పిండోదనక క్రియాం' అనునట్లు యీ కాలమున చనిపోయినవార్లకు పిండోదక క్రియలనదగు తద్దినములు తర్పణములుగూడ విడువనొల్లక, కేవలము, నీచబుద్ధితో ధర్మదూరులై మెలంగు చుందురని శాస్త్రప్రమాణములు మెండుగగలవు గాన, ప్రతివారు తమధర్మమును తమపథిని, తమ వంశముయొక్క గొప్పతనమును, తామున్నత సాంప్రదాయాలుగల్గి మెలంగు విధినిగుర్తింప నెంతేని యవసరమున్నదని హెచ్చరింతును. కాన ప్రతియొక్కరు తమధర్మమును విధినిగుర్తింతురుగాక, అందుకై నిత్యము బ్రాహ్మీ ముహూర్తమున తొలుత నిద్దురనుంచి మేలుకొనడము నేర్వదగియున్నది. ఈ కాలమున ప్రతియొక్కరు సుఖమెక్కువ యాశించి

నవారగుటచే తెల్లవారుఝామున నిద్దుర లేవకమునకు సోమరితనము జూపుచుందురు. చాలామంది సూర్యోదయమైనపిదపగాని నిద్దుర లేవరు. ఇది చాలా దురాచారము, మిక్కిలి అనారోగ్యకరము, అని ప్రతియొక్కరు గుర్తించి బ్రాహ్మీ ముహూర్తమున (తెల్లవారుఝామున) అనగా సూర్యోదయానికి రెండుగంటలు మునుపు (తెల్లవారుఝామున 4 గంటలు లేక 4-30 నిమిషములకు) విధిగ నిద్దుర లేవవలయునని శాస్త్రప్రమాణము పూర్వకాలమునగల పెద్దల యలవాటుగూడాను.

బ్రాహ్మీ ముహూర్తె ఉత్థాయ చింతయే దాత్మనోహితం। గురుం విష్ణుం నమస్కృత్య మాతరంపితరంతథా' అని శాస్త్రప్రమాణము ప్రకారము బ్రాహ్మీ ముహూర్తమనదగిన తెల్లవారుఝామున 4 గంటల కాలమున నిద్దుర లేచి మనస్సును ప్రశాంతముగనుంచుకొని గురువును, విష్ణువును స్మరించుకొని తలిదండ్రులకు నమస్కరించి లేవదగినదియని శాస్త్రప్రమాణము, అందుచేతనే పూర్వమున్న పెద్దలు గజేంద్రమోక్షము సుప్రభాతములు ఇతరములైన పద్యములు కంఠస్థమొనర్చుకొని తెల్లవారుఝామున బిగ్గరగ పఠించుచు, పాడుకొనును ప్రశాంతమైన మనస్సు గలవారై మెలంగుచుండిరి,

యీ బ్రాహ్మీముహూర్త కాలమనదగు తెల్లవారుఝామున నాలు గంటల సమయమతి ప్రశస్తమైన కాలము ఎందుకనగా -

'బ్రాహ్మీముహూర్తె దేవానాం, పితౄణాంచ సమాగమ।
జాగరస్తత్ర కర్తవ్యః పితృసంమాన సంహితత్।

యీ బ్రాహ్మీముహూర్త కాలమున దేవతలు, పితృదేవతలు, కలసి యుందురు. కాన, మనము తప్పక మేలుకొని దేవతాప్రార్థనలు చేయుచుండినచో మిక్కిలి యానందించి యనుగ్రహింతురు. అట్లు నిదుర

లేక గృహస్థులైన దంపతులు (భార్యాభర్తలు) కలసి నిదురించు చుండిన
చో వారి యిల్లు త్వరలో నశించి 'శ్మశానముగ' పాడుబడును.

'బ్రాహ్మీముహూర్తే సవేశాం. శయనం యది దంపతీ।
శ్మశానతుల్యం తద్వేశ్మ పితృభిః పరివర్జ్యతే।

అను ధర్మము ప్రకారము బ్రాహ్మీముహూర్త కాలమున భార్యాభర్తలు కలసి నిదురించు నెడల వారి యిల్లు శ్మశానము కాగలదు, 'అనర్హాః సర్వకర్మసు' అనులాగున, ఆదినమంతయు, ఏ యొక్క మంచికార్యములకు వారు అనర్హులై నశింతురు. మరియు 'బ్రాహ్మీముహూర్తే యానిద్రా సాపుణ్యక్షయకారిణీ' యని ధర్మమున్నది గాన, బ్రాహ్మీ ముహూర్త కాలమున మేలుకొనక నిదురించు నెడల వారు వారు చేసికొనిన పుణ్యము సర్వము నశించగలదు. అందుకే బ్రాహ్మీ ముహూర్తకాలమున నిదురించడము మహాదోషము కావడమేగాక, ఆ సమయమున లేనియుంటె దైవ ప్రార్థనాదులు చేయక, ఈ చెప్పబడు పనులు చేయుదురని తప్పక వారి వారి కార్యాదోషములు సంప్రాప్తించగలదు.

అందుచేత 'చత్వారిమాని కర్మాణి, సంధ్యాయాం పరివర్జయేత్।

ఆహారం, మైథునం నిద్రాం, స్వాధ్యాయంచ తథైవచ, ఈ నాల్గు పనులు అనగా. ఆ బ్రాహ్మీ ముహూర్త కాలమువదగు తెల్లవారుఝామున నాల్గుగంటల కాలమున, ఆహారము భుజించరాదు. భార్యాభర్తలు, సంగమించరాదు, నిద్రించు చుండరాదు. వేదశాస్త్రాదులు చదువుచుండదగదు.

'ఆహారాజ్జాయతే వ్యాధిః। ఆహారము భుజించినచో రోగము తప్పక రాగలదు.'

'గర్భవేధశ్చ మైథునాత్' భార్యా భర్తలు సంగమించినచో, గర్భబాధలు పొందుగలుగ గలదు.

'సద్రిశో జాయతే లక్ష్మీః' నిదురింతురేని దారిద్ర్యము తాండవించగలదు.

'స్వాధ్యాయో దాయుషః క్షయః' వేదశాస్త్రములు చదువుచున్నచో ఆయుస్సు క్షీణించును. కాన, బ్రాహ్మీముహూర్త కాలమున. స్త్రీ పురుషులెల్లరు తప్పక నిద్రమేలుకొని, దైవప్రార్థన చేసికొనుచుండుట మిక్కిలి శ్రేయస్కరము, అట్లు నిదుర మేలుకొనక సూర్యోదయ పర్యంతముగాని, సూర్యోదయమైన పిదపగాని, నిదుర మేల్కాను వారలు మహాపాపవంతులై సర్వకార్యములకు అనర్హులై నశింతురు గాన, గృహస్థులు, అభివృద్ధి జెందదలంతురు గాన – బ్రాహ్మీముహూర్తకాలమున తప్పక నిదుర మేల్కాని దైవధ్యాన పరాయణులు అగుదురు గాక, ఈరీతిని బ్రాహ్మీముహూర్తమున నిదుర లేచి యీ చెప్పబడు ప్రార్థన శ్లోకములు నిత్యము పఠింతురు గాక. ధర్మశాస్త్రకారులీ సుప్రభాత శ్లోకములు పఠింపవలసినదనియు నిర్ణయించి యున్నారు.

శ్లో॥ బ్రహ్మామురారి స్త్రిపురాంతకారీ॥
భానుశ్శశీ భూమిసుతో బుధశ్చ।
గురుశ్చ శుక్రశ్శని రాహుకేతవః॥
కుర్వన్తు సర్వేమమ సుప్రభాతం॥

తా॥ బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, అగ్ని సూర్యుడు, కుజుడు, గురువు శుక్ర శని రాహు కేతువులు ఈ ప్రభాతకాలమును, నాకు సుప్రభాతమగులాగున చేయుదురు గాక.

శ్లో॥ భృగుర్వశిష్ఠః క్రతురంగిరాశ్చ।
మనుః పులస్త్యః పులహస్త గౌతమః॥

రై భ్యోమరీచిః చ్యవనోథ దక్షః॥
కుర్వన్తు సర్వే మమ సుప్రభాతమ్

తా॥ భృగువు వశిష్ఠుడు, క్రతువు అంగిరసుడు మనువు పులస్త్యుడు పులహస్త్యుడు గౌతముడు రైభ్యుడు మరీచి చ్యవనుడు దక్షుడు మొదలగు మహనీయులు నాకు మంచి ప్రభాతమగులాగున యనుగ్రహింతురు గాక.

శ్లో॥ సనత్కుమారశ్చ సనందనశ్చ।
సనాతనో ప్యాసురి సింహలౌ చ।
సప్త స్వరాః సప్త రసాతలాని।
కుర్వన్తు సర్వే మమ సుప్రభాతమ్॥

తా॥ సనత్కుమారుడు సనందనుడు సనాతనుడు, ప్యాసురి, సింహళుడు సప్తస్వరములు సప్తరసాతలములు యీ ప్రభాతమును శుభప్రదమగులాగున నన్ను ఆశీర్వదింతురు గాక

శ్లో॥ సప్తార్ణవాః సప్తకులాచలాశ్చ।
సప్తర్షయో ద్వీపవనాని సప్త।
భూరాదిలోకాః భువనానిసప్త।
కుర్వన్తు సర్వే మమ సుప్రభాతమ్॥

తా॥ సప్తసముద్రములు, సప్తకుల పర్వతములు, సప్తఋషులు సప్తద్వీపములు, భూరాదిసప్తలోకములు నాకు సుప్రభాతము అగులాగున యనుగ్రహించు గాక

శ్లో॥ పృథ్వీసగంధా సరసాస్తథాపః।
స్పర్శీచవాయుః జ్వలితంచ తేజః।
నభస్సశబ్దం మహతా సహైవ।
కుర్వన్తు సర్వే మమ సుప్రభాతమ్॥

శ్లో॥ ఇత్థం ప్రభాతే పరమం పవిత్రం।
పఠేత్స్మరేద్వా శృణుయాశ్చ భక్త్యా।

దు స్స్వప్న నాశ స్త్రీయా సుప్రభాతం
భవేచ్ఛ నిత్యం భగవత్ప్రసాదాత్ ।

తా। యీరీతిని ప్రాతఃకాలమున యీ శ్లోకములు పఠించినను, స్మరించినను వినినను వారికిగల్గిన, చెడుకలలు నశించును. భగవంతుని కరుణతో వారికి సుప్రభాతము కాగలదు.

శ్లో। మహాభారత మాఖ్యానం
క్షితిం గాంచ సరస్వతీం
బ్రాహ్మణాన్ కేశవంచైవ
ప్రాతరుత్థాయ కీర్తయేత్ ।

తా। ఉదయకాలమున నిద్దుర లేచిన వెంటనే, మహాభారతమును భూదేవిని, గోవులను, సరస్వతీదేవిని, మంచి బ్రాహ్మణోత్తములను, విష్ణువును కీర్తించవలయును.

శ్లో। బ్రహ్మాణం శంకరం విష్ణుం.
యమం రామం దనుం బలిమ్
సప్తైతాన్ సంస్మరేన్నిత్యం
దుఃస్వప్నం తస్యనశ్యతి।

తా। బ్రహ్మను శంకరుని విష్ణువును యముని శ్రీరాముని దనువు బలిని యీ యేడ్వురిని స్మరించినచో వానికి దుఃస్వప్నదోషము నశించును.

శ్లో। పుణ్యశ్లోకో నలోరాజ
పుణ్యశ్లోకో యుధిష్ఠిరః
పుణ్యశ్లోకో హరిశ్చంద్రః
పుణ్యశ్లోకః పురూరవాః

పుణ్యశ్లోకాచ వైదేహి
పుణ్యశ్లోకో జనారదన:

తా। నలచక్రవర్తి పుణ్యవంతుడు, ధర్మరాజు పుణ్యవంతుడు, హరిశ్చంద్రుడు పుణ్యవంతుడు. పురూరవుడు పుణ్యవంతుడు సతీదేవి పుణ్యవంతురాలు, జనార్ధనుడు పుణ్యవంతుడు,

శ్లో। కార్కోటకస్యనాగస్య
దమయంత్యా నలస్యచ
ఋతుపర్ణస్య రాజర్షే:
కీర్తనం కలినాశనం।

కార్కోటకుడు. దమయంతి. నలమహారాజు, ఋతుపర్ణ చక్రవర్తి యను యీ నల్వురిని ప్రాత:కాలమున కీర్తించినచో సమస్తకలిదోషములు హరించును.

శ్లో ఉచ్చస్వరేణయ: ప్రాత:స్తోతు మిచ్ఛేదనన్యధీ:
వాసుదేవాది దేవానాం, నామ్న: సంకీర్తనం చరేత్

ప్రాత:కాలమున బిగ్గరగ, ఏకాగ్రమనస్సుతో, వాసుదేవాది దేవతలనుగూర్చి కీర్తింపదగినది. యీ రీతిని బ్రాహ్మీముహూర్తమున దగిన సూర్యోదయాత్ పూర్వం 4 గంటలకుపైన 5 గంటలలోపున నిద్దురలేచినవారై యీ సుప్రభాతాన్ని పఠించినచో వారికి దైవానుగ్రహము గల్గుగలదు. అని శాస్త్రప్రమాణుబు గలవు గాన ప్రతియొక్కరు (స్త్రీలు పురుషులు) ఉదయమున నిద్దుర 5 గంటలకేలేచి, యీ సుప్రభాతము పఠింతురు గాక.

అనంతరము కాలకృత్యములు తీర్చుకొని ప్రాతఃస్నానము చేయవలయునని శాస్త్రనిర్ణయము.

'స్నానం సంధ్యా జపో హోమో దేవతానాంచ పూజనం,
ఆతిథ్యం వైశ్వదేవంచ షట్కర్మాణి దినేదినే'

అని ప్రతివారు, 1 స్నానము 2 సంధ్యావందనము 3 జపము 4హోమము, 5 దేవతార్చనము (దేవపూజ) 6 అతిథిపూజ 7 వైశ్వదేవము అను కార్యములు ప్రతిదినము చేయదగినది. అని పరాశరస్మృతి వచనము బ్రహ్మయజ్ఞముతో నీ చెప్పబడిన కార్యములు ఎనిమిది కాగలవు. ఈ యెనిమిది కార్యములు గృహస్థుడు ప్రతినిత్యము నెరవేర్చ దగినవి.

అనగా బ్రాహ్మణుడైనవాడు ప్రతినిత్యము సూర్యోదయమునకు మునుపు నాల్గు ఘడియలుండగ నిదుర మేలుకొన వలయును. భగవంతుని ప్రాతఃస్మరణము చేయవలయును. కాలకృత్యములు నిర్వర్తించుకొని, ప్రాతఃస్నానము చేయువలయును. ఈ రీతినే యితరులు అనుసరింపదగి యున్నది. ఎందుకనగా 'అస్నాత్వా న చరేత్కర్మ' అని స్నానముచేయనిదే ఏ కార్యము చేయరాదని గలదు. యీ శరీరము అత్యంతమలిన మైనది.

'అత్యన్త మలినఃకాయః నవచ్ఛిద్ర సమన్వితః
స్రవత్యేవది వారాత్రం ప్రాతఃస్నానం విశోధయేత్'

అను ధర్మము ప్రకారము ఈ శరీరము నవరంధ్రములతో గూడినదై, రాత్రింబవళ్లు మాలిన్యము, వెళ్ళదోయుచుండును కాన, ప్రాతఃకాలమున స్నానమొనర్చి శరీరమును పరిశుభ్రము చేసికొనుటచే పరిశుద్ధి యేర్పడును.

'ప్రాతఃస్నానం ప్రశంసంతి దృష్టాదృష్ట ఫలంహితత్
సర్వమర్హతి శుద్ధాత్మా ప్రాతఃస్నాయీ జపాదికమ్॥

అని స్మృతిరత్న మహోదధిలో చెప్పినరీతిని ప్రాతఃకాలముననే స్నానముచేసినచో, ప్రత్యక్ష ఫలితమువలన దగిన పరిశుద్ధము మానసిక ప్రశాంతతలు గల్గును. అదృష్ట ఫలితము లనదగిన పారమార్థిక శక్తులు చేకూరగలవు.

ప్రాతః మధ్యాహ్నయోః స్నానం వానప్రస్థ గృహస్థయోః

అను రీతిని గృహస్థులు, వానప్రస్థులు, ప్రాతఃకాలమునను, మధ్యాహ్న కాలమునను, దినమునకు రెండు మారులు స్నానము చేయవలయును.

'యతేః త్రిషవణం స్నానం' సకృచ్చ బ్రహ్మచారిణః'

అను రీతిని సన్యాసి మూడువేళల స్నానము చేయవలయును బ్రహ్మచారి మాత్రము ప్రాతఃకాలమున స్నానము చేయదగినది.

బ్రహ్మక్షత్రవిశాంచైవ మంత్రవత్స్నాన మిష్యతే
తూష్ణీమేవహి శూద్రస్య స్త్రీణాంచ కురునందన॥

అను రీతిని బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు స్నానకాలమంత్రములు పఠించుచు స్నానమొనర్ప వలయును.

స్త్రీ శూద్రులు మాత్రము మంత్రములు లేకనే స్నానముచేయవలసినది.

'ఉత్తమంతు నదీస్నానం తటాకేమధ్య మంస్మృతం
కూపస్నానంతు సామాన్యం భాండస్నానం వృథాభవేత్॥

ప్రాతఃకాలమున నదులలో స్నానము చేయడము 'ఉత్తమము చెఱువులు కోనేఱులు తటాకములలో స్నానము చేయడము మధ్యరకము. బావి (నువ్వి) వద్ద స్నానము చేయడము అధమము; కడవలో కుండలో వల నీళ్ళతో స్నానమునప్పట వృధాకాగలదు. అనగా ఫలితము శూన్యము.

నదిలో స్నానము చేయువారుగాని తటాకాదులలో స్నానము చేయువారుగాని, స్నానము చేయదగు విధమునుగూర్చి శాస్త్రకారు లీరీ తిని నిర్ణయించి యున్నారు.

'తతో నదీం సమాగత్య గంగాధ్యాన పురస్సరం।
నాభిమాత్రే జలేస్థిత్వా త్రివారం స్నానమాచరేత్।
నాభిమాత్రే జలేస్థిత్వా కృత్వా కేశాన్ ద్విధాద్విజః
నిరుద్ధకర్ణనాసః త్రివారం మజ్జనం చరేత్॥

నదీ సమీపమునకుచేరి, గంగాప్రార్థన చేయుచు, నదిలోనికి దిగి, నాభివరకుగల నీటిలోదిగి, మూడు మారులునీటిలో మునగవల యును. తలవెంట్రుకలు రెండు పాయలుగచేసి. ముక్కు చెవులు, కండ్లు మూమకొని ముమ్మారు స్నానము చేయవలయును. అనంతరము.

'సంకల్పసూక్త పఠనం, మార్జనం చాఘమర్షణమ్।
దేవాది తర్పణంచైవ, స్నానం పంచాంగ ముత్తమమ్।

అనురీతిని, మూడు మారులు నదిలో మునిగిలేచిన పిదప, సంక ల్పము చెప్పుకొనవలయును, అఘమర్షణ సూక్తములు చెప్పవలయును, మార్జనమంత్రములుచెప్పి ప్రోక్షించు కొనవలయును, సూక్తపఠనము చేయవలయును, దేవఋషి పితృతర్పణములు చేయవలయును. ఇట్లు

1 సంకల్పము, 2 సూక్తపఠనము, 3 మార్జనము, 4 అఘమర్షణ మంత్రపఠనము, 5 దేవాది తర్పణములుచేసి స్నానము (ప్రాతఃకాల స్నానము అయిదు అంగములతోగూడి యుండును.

అనారోగ్యవంతులు ఉష్ణోదక స్నానము చేయదగినది. 'తీర్థాభావే తుకర్తవ్య ముష్ణోదకం" అనురీతిని. నదులు తటాకాదులు లేనివారు, ఉష్ణోదక స్నానము చేయదగినది, ప్రతినిత్యము శిరఃస్నానమే చేయవలయును'

'నేత్రరోగే శిరోరోగే కఫాదివ్యాధి పీడితః।
కంఠస్నానం ప్రకుర్వీత శిరస్నాన సమంహితత్
నిత్యం నైమిత్తికంచైవక్రియాంగం మలకర్షణమ్॥

నేత్రరోగులు, శిరోరోగులు, కఫ్రాదిరోగులు, కంఠస్నానమే చేయదగినది, నిత్యకార్యములు నైమిత్తిక కార్యములు స్నానమొనర్చిననే చేయదగినది, జ్వరాది రోగపీడితులు మాత్రము స్నానముచేయక, మంత్రస్నానము, భస్మస్నానము, వంటివి చేయదగినది.

ప్రాతఃస్నానతు మశక్తస్య, రోగాద్వైర్వా భయాచ్చవా।
పూర్వవస్త్రం సముత్సృజ్య గౌణస్నానేన శుధ్యతి

అనారోగ్యవంతుడు కట్టిన వస్త్రమునువదలి వేరొకవస్త్రమును ధరించి, గౌణస్నానములనదగిన. భస్మధారణము (భస్మస్నానం మంత్రస్నానము (మంత్రములతో నీళ్ళు చల్లుకొనుట) చేయదగినది, యీ స్నానమొనర్చినవారు మాత్రం 'సచకర్మ స్వనర్హాస్యాత్" అనురీతిని దేవపూజాది కార్యములను చేయుటకు అర్హులుగారు.

మఱియు ఎందైనా తీర్థయాత్రలకు (కాశీ మొదలైన) వెళ్ళినవారు మహానదులలో స్నానముచేయునెడ, తమ తండ్రి తాత ముత్తాతలుగ్గూడ

తరించవలయునని సంకల్పించి స్నానముచేసినచో వారికి ద్వాదశాంశ ఫలితము కాగలదని శాస్త్రప్రమాణమున్నది.

పితరం మాతరం వాపిభ్రాతరం సుహృదంగురుం।
మజ్జయేద్యం సముద్దిశ్యద్వాద శాంశంలభేతసః॥

తండ్రి – తల్లి – సోదరులు, స్నేహితులు, గురువులను స్మరించు కొని మహానదులలో మహాతీర్థములలో స్నానముచేసినచోవారికి పండ్రెండ వభాగము ఫలితము లభించును.

తత్ప్రార్థితే వ్వష్టమాంశం లభేత్ స్నాన ఫలంనరః

ఎవరైన తమకుబదులుగా మహానదులలో స్నానముచేసి రమ్మని కోరిపంపినచో, నట్టివారికి, ఎనిమిదవ యంశము ఫలితము గల్గును.

ఇంకయు నెవరేని తమకు ప్రతినిధిగా స్నానముచేసి రమ్మనమని కోరిపంపినచో నట్టివారికి, ఎనిమిదవ యంశము ఫలితము గల్గును.

ఇంకయు నెవరేని తమకు ప్రతినిధిగా స్నానము చేసిరమ్మనమని కోరినచో, దర్భలతో వారిపేరు చెప్పుచు ముడివేసికొని. నాదర్భలను, తీసికొనివెళ్ళి, వానితోగూడ స్నానముచేయవలయును, అట్టివారికిని అష్ట మాంశఫలము గల్గును. అట్టి సమయమున ఈ శ్లోకము పఠించుచు స్నానము చేయవలయును,

శ్లో॥ కుశోసిత్వం పవిత్రోసి, బ్రహ్మణా నిర్మితా॥ పురా।
త్వయీస్నాతే సతుస్నాతో యస్యేదంగ్రంధి బంధనం॥

అని ఈ మంత్రమును పఠింపుచు స్నానము చేసినచో నెవరినుద్దే శించి స్నానమొనర్చినవారికి అష్టమాంశ ఫలితము చేకూరగలదని

శాస్త్రవచనములు గలవు. పెద్దల ఆచారములుగలవు. స్నానమొనర్చిన పిదప శరీరము తుడుచుకొని వస్త్రధారణము చేయవలెను.

శరీరమును తుడుచుకొనుటలో నీ నియమములను పాటింపవలయును.

శ్లో॥ స్నాతో నాంగాని నిమృజేత్, స్నానశాట్యాన పాణినా।
అన్యేనై కేన వస్త్రేణ నిరిక్షతి స్పరిమార్జయేత్।

స్నానముచేసిన పిదప వేరొక వస్త్రముతో శరీరము తుడుచుకొవలయునుగాని, చేతులతో వళ్ళు అనగా వట్టిచేతులతో తుడుచుకొనరాదు. స్నానము చేయునప్పుడు కట్టుకొనియున్న వస్త్రముతోనే తుడుచుకొనరాదు.

'దగ్ధం జీర్ణం, చమలినం మూషకోప హతంతథా।
ఖాదితం గోమహిష్యాద్యైః తత్యాజ్యం సర్వథాద్విజైః

కాలినవస్త్రము, చినిగిన వస్త్రము, మలినముగనున్న వస్త్రము' పశువులు నమిలిన వస్త్రము, ఎలకలు కొరికిన వస్త్రము, ధరించరాదు.

'కర్తవ్య ముత్తరంవాసం: అనుకీలిని, పైవంచధరించనిది కట్టిన వస్త్రముతో, నే శుభకార్యాదులు చేయరాదు. అనగా. వంచకట్టుకొని, పైన వస్త్రములేకుండా సంధ్యావందనాదులుగూడ చేయరాదు,

వికచ్ఛః, అనుత్తరీయశ్చ, నగ్నశ్చావస్త్ర ఏవచ।
నగ్నోమలిన వస్త్రస్యాత్, నగ్నశ్చార్ద్ర పటస్మృతః।

గోచిపోసి ధరించనిది వస్త్రముకట్టినచో. అపరిశుద్ధము నింద్యము ఆ రీతిని, పై వస్త్రములేనిదీ, మలినవస్త్రములు ధరించిననూ, తడివస్త్ర

ములు గరించిననూ, సంధ్యావందనాది యే కార్యములు చేసినను వ్యర్థమే గాని ఫలితము శూన్యము.

"సాగరం పర్వణి స్పృశేత్" అనురీతిని సముద్రస్నానము, పౌర్ణమి అమావాశ్యలు అనదగు పర్వకాలములలో మాత్రము చేయదగినదేగాని, నిత్యము సముద్రస్నానము (దగ్గరగలవారు) చేయరాదు.

'ఉదయాస్తమయాది సమయే ఆదిత్యం నేక్షేతసర్వదా'

అను ధర్మము ననుసరించి సూర్యోదయ సమయమున సూర్యాస్తమయ సమయమున సూర్యబింబమును చూడరాదు. అట్లు చూచినవారికి ఆయుస్సు క్షీణించునందురు. నదులు, నదములు, కూపములు. తటాకములును గుర్తించు క్రమమును శాస్త్రకారులు వచించి యున్నారు.

'యాసా మహానదీజ్ఞేయం సర్వపాపప్రణాశినీ
సద్భూతాపూర్వ దిగ్భాగే శైలే సలిలసంతతిః॥

అను రీతిని పర్వతములలోని జలధారలతో కూడినదై ప్రవహించు మహానది సర్వపాపములును పోగొట్టును గాన యిందు ప్రాతఃకాలమున స్నానదాన ఉపాదులు చేయువారి కనంత పుణ్యములు గల్గును.

'యాప్రత్యక్ సాగరంయాతి సానదస్స్యాత్ గద్యతే

పశ్చిమ సముద్రమున కలియు నీటిప్రవాహములకు నదములు అని పేరు ఇందు స్నానదానాదులు చేయువారికి మిక్కిలి పుణ్యప్రదము.

పర్వతస్యతటే వాగ్రేవృత్తాకారం జలాస్పదం
అక్షోభ్యం యుత్సరస్యాత్ ప్రవిశాలం సుపంకజం॥

పర్వము నానుకొని విశాలముగ గుండ్రముగ నేర్పడిన మడుగునకు సరస్సు అందురు. ఇందు స్నానాదులు చేయుటయు శ్రేష్ఠమే.

భువ్యద్రేవాః తలస్పర్శమశోష్యం యజ్జలాశయం,
విశాలమవిశాలంవా దేవఖాతమితిస్మృతః

భూతలమువగాని, పర్వత సానువులందుగాని. మిక్కిలి లోతైనవై యుండు మడుగులు, నీరింకిపోనట్టివి, దేవఖాతములు అందురు అనగా దేవతలచే నిర్మితములుగాన, వీనియందును స్నానాదులు చేయదగును.

గ్రామార్థం వాసస్వార్థం వానృభిః సృష్టాంబుపద్ధతి:
యానద్యాద్యంబు ధామభ్యః శానాభ్యాం ప్రచక్షతే।

గ్రామ ప్రజలవాడుకకుగాని, పైర్లకుపయోగించుటకుగాని, నదీనీటిని, నిలువ జేయువానికి చెరువులందురు, ఇందు స్నానాదులు మధ్యమము

అర్ధచంద్రాకృతిర్యస్య సంస్థానస్యతు వారిణాం।
గ్రామేవనే పివాస్సైలే తత్రటాఇతిస్మృత;

గ్రామమువద్దగాని, అరణ్యాదులలోగాని, అర్ధచంద్రాకృతిగ నీటి నిలువగలవానిని తటాకములందురు, ఇందు స్నానాదులు చేయుదగును,

'చతురస్రం శిలాబద్ధం. ససోపాన మధోజలం।

విశాలమవిశాలంవా యత్తత్కుండ మితిస్మృతం।

చదరముగ. రాళ్ళతో కట్టబడియుండి, దిగుటకు తాపలుగల, విశాలమైనదిగాని, లేనిదిగాని యున్న భావివంటి నీటిపట్టులకు, కుండ మందురు.

'గిరిరంధ్రాద్వి నిర్గత్య, యావతత్యంబు సంతతి:
అనాభార మథోభూమే, సాధారేత్యభిదీయతే।

కొండబిలములలోనుంచి, యెడతెగని ధారగా భూమిమీద పడు నీటిప్రవాహమునకు, 'ధారా' యందురు. (మహానందిలో వచ్చునీటి ధార వలె)

పంచహస్త విశాలంయత్ ఖాతంవృత్తమ థోబలం।
దార్వీష్టకాది ఘటితం, యత్తత్కూప ఇతిస్మృతమ్॥

అయిదుహస్తముల ప్రమాణ కల్గియుంటె, గుంత కొట్టబడియుంటె రాళ్ళు, ఇటుక, చెక్కలతో, వేనితోనేని కట్టబడియున్న నీటిపట్టునకు, కూపము (భావి-నుయ్యి) యనబడును. ఇట్టి నీటి పట్టులకడకుచేరి తొలుత దంతధావనము చేసికొని స్నానమాచరింప దగినది.

దంతధావనము, పల్లు పుల్లలతో చేయుట యుత్తమము. ఈ కాలమున బ్రష్షులు, టూత్ పేష్టులు, బలముగ నున్నవికాని, పల్లపుల్లలతో పండ్లుతోముట నే శాస్త్రిములలో వర్ణించి యున్నారు.

అట్లు పల్లు పుల్లను చెట్టునుంచి విరచుకొనునప్పుడు, ఈ శ్లోకరూప మంత్రమును పఠింపవలయును.

'ఆయుర్బలం యశోవర్చః ప్రజాఃపశువసూనిచ।
బ్రహ్మప్రజ్ఞాంచ, మేధాంచ, త్వన్నోదేహి వనస్పతే'

అని యీ మంత్రమును చెప్పిన, గుణములు నాకివ్వవలసినదని వృక్షమును ప్రార్థించి పుల్లనువిరచి తోముదురు.

'ప్రతీచీం దక్షిణాశాంచ వర్జయేద్దంత ధావనం।

పశ్చిమ ముఖముగ కూర్చొనిగాని దక్షిణ ముఖముగ కూర్చొని గాని దంతధావనము చేయకాదు,

'పూర్వాముఖో ధృంతింవిద్యాత్, శరీరారోగ్యమేవచ'

అనుశీలిని తూర్పు ముఖముగ కూర్చొని దంతధావనము చేసికొని నచో, శరీరారోగ్యము, బుద్ధికుశలత ధైర్యసాహసములు చేకూరగలవు.

"దక్షిణేన తథాక్రౌర్యం' దక్షిణ దిశాముఖమున కూర్చొని. దంతధావనము చేసినచో, క్రోధగుణములు గల్గును.

'పశ్చిమేన పరాజయం" పడమర ముఖముగ దంతధావనము చేసిన పరాజయము తప్పదు.

'ఉత్తరేణ గవాంనాశం, స్త్రీణాం పరిజనస్యచ'

ఉత్తరాభి ముఖముగ కూర్చొని దంతధావనము చేసినచో, ఆవు లున్న, ఆవులు నసించును. భార్యాది స్త్రీ జనము నశింతురు, పరివార ము తొలంగును. కనుక తూర్పు ముఖముగ కూర్చొని దంతధావనము చేయువలియునేగాని నితరమైన దిక్కులకు ముఖము చేసికొని దంతధావ నము చేసినదోషము వచ్చును. అనంతరము 'ఆచరే దుషసిస్నానం" అను విధిచెప్పిన ఉషఃకాలమునవే స్నానము చేయువలయును.

ఉషఃకాల స్నానమువలన

"మనః ప్రసాదజనకం రూప సౌభాగ్యవర్ధనం
శోక దుఃస్వప్నహం స్నానం మోక్షదం హ్లాదనం తథా.

మనస్సుకు ప్రశాంతతనిచ్చును. రూపము సౌభాగ్యము వృద్ధిజేయును వ్యసనము చెడుకలల ఫలము నశింపజేయును. ముక్తి సంతోషములు గలి గించును, 'స్నానమూలాః క్రియాః సర్వాః' అను విధిచెప్పిన ప్రాతఃకాల మున స్నానము చేసియే యే సంధ్యావందనాది కార్యములేని చేయదగి యున్నది, "శ్రీపుష్ట్యారోగ్యవర్ధనం" ప్రాతఃస్నానమున ఫలితము, మరియు

'యామ్యంహియాతనాదుఃఖం నిత్య స్నాయీనపశ్యతి' యను ప్రమాణము చొప్పున నిత్యము ఉషఃకాలమున విధిగ నియమముప్రకారము స్నానము చేయువారు యముని బాధలను పొందక స్వర్గలోక సుఖమును చూరగొందురు. ఇట్లు నిత్యము ప్రాతఃకాలమున చేయు స్నానమునకు నిత్య స్నానమందురు. ఏదేని కారణమున చేయు స్నానమునకు నైమిత్తిక స్నానమందురు. ఏదేని కోరికలు సిద్ధించుటకై చేయు వ్రతాదులలో చేయు స్నానమునకు కామ్య స్నానమందురు, కనుక స్నానములు "నిత్యం నైమిత్తికం కామ్యం త్రివిధం స్నానముచ్యతే" యని స్నానములు మూడు విధములుగ విభజించిరి,

'నదీనద తటాకేషు, దేవఖాత, జలేషుచ।
నిత్యక్రియార్థం స్నాయీత. గిరిప్రస్రవణేషుచ।
కూపేషూద్ధృత తోయేన స్నానం కుర్వీత వాభువి'

అనురీతిగ తొలుత వివరించిన, నదులలోను, నదములలోను, తటాకములలోను, దేవఖాతములలోను, కొండలలోగల, గుండములలోగాని, లేక, తోడిపోసుటకు వీలైన బావులవద్దగాని, స్నానము చేయవచ్చును,

శూర్పవాయుః, నఖాగ్రాంబు, స్నానవస్త్రం,
ఘటోదకం, మార్జనీరేణుః కేశాంబు, హంతి పుణ్యంపు రాతనం"

అనురీతిని. ఎప్పటికి చేటవిసరుటచే వచ్చుగాలి. గోటికొనలనుంచి, చల్లబడు నీటిబిందువులు, కడవలోగల నీరు (కుండలలోని నీరున్నూ) కసవు త్రోయు సమయమున, రేగుదుమ్ము, వెంట్రుకల కొసలనుంచి, పడు నీటిబిందువులు, మునుపుచేసిన పుణ్యమునంత హరించును, గాన వీనిని పోకనివ్వక జాగరూకులై స్నానమొనర్చ వలయును.

'నాల్పోదకే నిమజ్జేత్, నసముద్రోదక మవగాహేత్'

అను నిషేధ విధిననుసరించి, కొద్దిపాటి నీళ్ళలో స్నానముచేయరాదు. నిత్యము సముద్రములో స్నానముచేయరాదు, 'నరజక తీర్థేషు చాకలివారు బట్టలు పిండుచోట స్నానము చేయరాదు.

'గ్రహణే సంక్రమణేవాసి, నస్నాయాద్యది మానవః
సప్తజన్మని కుష్ఠిస్యాత్, దుఃఖభాగేచ జాయతే॥

గ్రహణకాలముననగాని, సంక్రమణ కాలాదులలోగాని, స్నానము చేయనివారు, ఏడుజన్మల పర్యంతము కుష్ఠురోగాది బాధలతో, దుఃఖితులై యుందురు,

'రవిగ్రహే సూర్యవారే, సోమేసోమగ్రహేతథా
చూడామణి రితిఖ్యాతః తత్రానంత ఫలంలభేత్॥

ఆదివారమున సూర్యగ్రహణము సోమవారమున చంద్రగ్రహణము వచ్చినచో, నీ గ్రహణములకు, చూడామణి గ్రహణమందురు, ఇట్టి చూడామణి గ్రహణకాలమున స్నానదాన జపాదులు చేసినచో అనంతమైన పుణ్యము చేకూరును,

'రాత్రౌ స్నానం నకుర్వీత" అను నిషేధం ప్రకారం ప్రతిదినము రాత్రికాలమున స్నానము చేయరాదు.

నైమిత్తికంతు కుర్వీత స్నానం దానంచ, రాత్రిషు

అను ధర్మము ప్రకారము ఏదేని గ్రహణాదికారణములు నిమిత్తముగ చేసికొని, రాత్రికాలమున, స్నానాదులు చేయవచ్చును,

స్నానములు:-

పుష్యేచ జన్మనక్షత్రే వ్యతీపాతేచ వైధృతౌ
అమాయాంచ. నదీస్నానం, పునాత్యాశప్త మాకులం.

పుష్యమి నక్షత్రమునాడుగాని, తనజన్మ నక్షత్రమునాడుగాని, వ్యతీపాతము, వైధృతి యను యోగములుగల దినమునగాని, అమావాస్యనాడుగాని, మహానదులలో స్నానము చేసినచో తనతోగూడ నేడుతరములవారు తరింతురు,

సూర్యగ్రహణ తుల్యాతు శుక్లా మాఘస్య సప్తమీ
అరుణోదయ వేళాయాం తస్యాం స్నానం మహాఫలం!

మాఘ శుక్ల సప్తమికి రథ సప్తమి యందురు. ఆ నాడు సూర్యోదయానికి పూర్వమే, స్నానదానాదులు మహానదులలో చేసినచో గొప్ప పుణ్యఫలములు గల్గును.

'బాలాశ్చ తరుణావృద్ధా: నరనారీవ పుంసకా:।
స్నాత్వామాఘే శుభేతీర్థే ప్రాప్నువంతీప్సి తంఫలం।

మాఘమాసమున ప్రతిదినము పుణ్యజలములలో స్నానము చేయుచు, బాలురు, తరుణులు, వృద్ధులు. స్త్రీలు పురుషులు, నపుంసకులు, తాము తలంచిన కోరికలు నెరవేరునట్టి సిద్ధత్వము బొందుదురు.

"ఇందోర్బుధస్య శాతేశ్చవారే భ్యంగం, ప్రశస్యతే"

అనురీతిని సోమవారము బుధవారము శనివారము పురుషులు అభ్యంగ స్నానము చేసినచో కాంతి సుఖసంతోష ఆరోగ్యాదులు గలుగును.

సంతాపః కాంతి రల్పాయుః ధనం నిర్ధనతా తథా।
అనారోగ్యం సర్వకామః అభ్యంగాత్ భాస్కరాదిషు॥

అను రీతిని ఆదివారము సంతాపము, సోమవారము కాంతి, మంగళవారము అల్పాయువు బుధవారము ధనము గురువారము దరిద్రము శుక్రవారము అనారోగ్యము శనివారము ఆరోగ్యము పురుషులకు అభ్యంగస్నానముచే ఫలములు గల్గును.

'శిరోభ్యక్తేన తైలేనవాంగం కించిదుపస్పృశేత్।
తిలపిష్టంచ నాస్నీయాత్ తస్యచాయుర్వినశ్యతి।

నెత్తికిరాచిన నూనె శరీరములోని యే యవయవములకు తాకిననూ, నూగులపిండి తినినను, ఆయుస్సు క్షీణించును,

జాయంతే మానుషేలోకే క్షీణపాపచయా స్తతః॥
ఈశ్వరారాధన బలాత్ గమిష్యన్తి సతాంగతిః॥

అను ప్రమాణము ప్రకారము మానవులు తాము చేసికొనిన పుణ్యము క్షీణించుటచేత, యీ భూలోకమున జన్మించు చున్నారు. కావున మరలా దైవానుగ్రహమును పొందుటకై, ఈశ్వరపూజాదులు చేసిన శక్తి వలన, మంచిగతులను చూరగొందురు. కావున స్నాన దాన జప యజ్ఞాది ఆరాధనలు మానవులు ముఖ్యముగ చేయవలయును. స్నానకాలమున ఈ శ్లోకములను పఠించుచు స్నానమొనర్చిన గంగాస్నాన ఫలితములబ్బును కావున ప్రతియొకరు తప్పక నిత్యము స్నానసమయమున పఠింతురు గాక.

'గంగాధ్యాన పురస్సరం గంగాం ప్రవిశ్య'
గంగను ధ్యానమొనర్చుచు నీటిలో ప్రవేశించి,

'గంగా గంగేతి యోబ్రూయాత్ యోజనానాం శతైరపి
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం సగచ్ఛతి। ౧
అంబ! త్వద్దర్శనాన్ముక్తిః నజానేస్నానజంఫలమ్।
స్వర్గారోహణ సోపానే! మహాపుణ్య తరంగిణి॥ ౨
విశ్వేశం కేశవం ఢుండిం దండపాణించ భైరవం।
వందేకాశీం గుహాం గంగాం భవానీం మణికర్ణికామ్॥ ౩
అతితీక్ష్ణ మహాకాయ కల్పాన్తదహనోపమ।
భైరవాయ నమస్తుభ్యమనుజ్ఞాం దాతుమర్హసి॥ ౪
త్వంరాజా సర్వతీర్థానాం త్వమేవజగతఃపితా।
యాచితోదేహి మేతీర్థం సర్వపాపాపనుత్తయే॥ ౫
యోఽసౌసర్వగతో విష్ణుత్స్వరూపీ నిరంజనః।
సఏవద్రవరూపేణ గంగాంభోనాత్ర సంశయః ౬
నందినీ నళినీ సీతా మాలినీచ మహాపగా।
విష్ణుపాదాబ్జ సంభూతా గంగాత్రిపథగామినీ ౭
భాగీరథీ భోగవతీ జాహ్నవీత్రిదశేశ్వరీ।
ద్వాదశైతాని నామానియత్ర యత్రజలాశయే॥ ౮
స్నానకాలే పఠేన్నిత్యం మహాపాతక నాశనమ్।

ఈ శ్లోకములు పఠించుచు 'నాభిమాత్ర జలేస్థిత్వా, శిఖాంద్విధా విధాయ, నిరుద్ధకర్ణనాసః, త్రిరాప్లుత్య, ఆచమ్యశిఖాం బధ్వా దేహం ప్రక్షాళ్య పునరాచమ్య ప్రాణానాయమ్య, హిరణ్యశృంగమితి సూక్తం జపేత్।

నాభిలోతు నీటిలోదిగి శిఖను రెండుగ విడదీసి, చెవులు ముక్కు నోరు మూసుకొని ముమ్మారుమునిగి, ఆచమనము చేసి శిఖనుముడివేసి, శరీరము బాగుగకడుగుకొనిస్నానముచేసి, హిరణ్యశృంగమను సూక్తమును పఠించవలయును, ఆపోహిష్ఠా మంత్రములతో మార్జనము చేసికొని, పవమానసూక్త పఠనము చేయుచు స్నానమొనర్చి,

యదపాం క్రూరమతి, సాంగుష్ఠయష్టి సూత్రేణ
ఆప్లోడ్య శాఖః అద్భిః త్రిరావృత్య

యదపాం క్రూరగమను మంత్రము చెప్పుచు బొటనవ్రేలిని యజ్ఞోపవీతము పట్టుకొని నీటిని ముమ్మారు వలయాకారముగ త్రిప్పుము, నంమ ముమ్మారు స్నానము చేయవలయును.

ఇమంమ్మే గంగే 'ఇత్యపోఽభిమంత్ర్య'

ఇమంమ్మే గంగే యను మంత్రము చెప్పాను, గంగను అభిమంత్రించి 'ఋతంచేత్య ఘమర్షణసూక్తే వాప్నవగాహేత 'ఋతంచేతి" యను అఘమర్షణసూక్తము చెప్పుచు, మకలా నీటిలో మునిగి స్నానము చేయవలయును, 'అర్ఘ్యం జ్వలతీత్యాచమ్య'' అర్ఘ్యం జ్వలతి" అను మంత్రముతో వచనము చేయవలయును. అనంతరము దేవఋషి పితృతర్పణములు యవలయును.

మాఘమాసమున సూర్యోదయానికి పూర్వమే స్నానముచేసిన మహాఫలితములు గల్గునని చెప్పియుంటిని ఆ రీతిని మాఘస్నానవిధిని తెలిసికొనడము అవసరము. 'స్నాతమాఘే శుభేతీర్థే ప్రాప్నువంతీ ప్సిపం ఫలమ్" అను ధర్మము ప్రకారము మాఘమాసమున నద్యాదులలో స్నానము చేసినచో ఫలమధికము.

"మాఘమాస మిమంప్రాగ్లం స్నాస్యేహం దేవమాధవ।
తీర్థస్యాస్య జలేన్నిత్యం ఇతిసంకల్ప్య చేతసీ॥

అని మాఘమాసము నలకినములు స్నానమాచరింతునని సంకల్పము చేసికొనవలయును.

'దుఃఖదారిద్ర్యనాశాయ శ్రీ ష్ణోస్తోషణాయచ।
ప్రాతఃస్నానం కరోమ్యద్య మాఘేపాప వినాశనం॥

అని ఈ శ్లోకమును పఠించుచు స్నానము చేయదగినది.

"మకరస్థే రవౌ మాఘే గోవిందాచ్యుత మాధవ।
స్నానేనానేన మే దేవ! యథోక్త ఫలదో భవ॥

ఇమంమంత్రం సముచ్చార్య స్నాయాన్మౌన సమన్వితః అని ఈ శ్లోకములు స్నానకాలమున పఠింపవలయును. స్నానము చేసిన పిదప, దోసిలి నిండా నీళ్ళుపుచ్చుకొని, ఈ శ్లోకము పఠించుచు సూర్యునకర్ఘ్య మివ్వవలయును.

'సవిత్రే, ప్రసవిత్రే చ, పరంధామ! జలేమమ।
త్వత్తేజసా పరిభ్రష్టం, పాపంయాతు సహస్రధా।

అని చెప్పి అర్ఘ్యము వదలవలయును.

ఈ రీతిని మాఘమాసమున స్నానము చేసినవారు తరించగలరని ఫలశ్రుతి.

'యో మాఘ మాస్యుషసి సూర్యకరాభితప్తజలే
స్నానం సమాచరతి, చారునదీప్రవాహే
ఉద్ధృత్య సప్తపురుషాన్ పితృమాతృ వంశాన్
స్వర్గంప్రయాత్య మరదేహేన నరోఽత్యధా।

అని భవిష్యోత్తర పురాణ వచనానుసారము మాఘ మాసము లో సూర్యోదయానికి పూర్వమే, నదిలో స్నానము చేసినవారు తాము తమ తలిదండ్రులు, మేనమామగారి వంశజులు చేరి యేడు తరములవారు తరింతురు. దివ్యత్వము బడయగలరు.

యీ మాఘ మాసములో రథసప్తమి దినమున స్నానదాన జపములు చేసినచో సూర్యగ్రహణ దినమున స్నానాదులు చేసిన దానికన్నా రెట్టింపు ఫలితములు గల్గుగలవు.

'మాఘ శుక్ల సప్తమీ రథసప్తమీ' మాఘమాసమున, శుక్ల పక్షమునవచ్చు సప్తమిరథ సప్తమీయని పేరు.

'సాఅరుణోదయ వ్యాపినీగ్రాహ్య'

యీ రథసప్తమి, సూర్యోదయమునకు మునుపుగల అరుణోదయ కాలముననున్న సప్తమిఘడియలను ప్రధానముగ గ్రహింపదగినది.

'అరుణోదయ వేళాయాం తస్యాంస్నానం మహాఫలమ్। అరుణోదయ కాలమువగల సప్తమీఘడియలలో స్నానముచేసిన మహాఫలము గల్గును.

'అరుణోదయ వేళాయాం శుక్లా మాఘసప్తమీ'
ప్రయాగే యదిలభ్యేతకోటి సూర్యగ్రహైస్సమా।

అను ప్రమాణము ప్రకారము అరుణోదయ కాలమున సప్తమీ ఘడియలలో ప్రయాగవద్ద గంగాస్నానము చేసినచో కోటిసూర్యగ్రహణ స్నానఫలము చేకూరును.

'మాఘేమాసి సితేపక్షేసప్తమీ కోటిభాస్కర!
కుర్యాత్స్నానార్ఘ్యం దానాభ్యాం ఆయురారోగ్య సంపదః

మాఘ శుక్ల సప్తమీయనబడు రథసప్తమీ దినమున సూర్యోదయానికి పూర్వమే స్నానము దానాదులు చేసినచో, ఆయురారోగ్య సంపదలు వృద్ధికాగలవు. కాన స్నానము చేయుటకని, యీ మంత్రము పఠించుచు స్నానము చేయవలయును.

అని సూర్యపరక్షము దోసిలోనీటు గ్రహించి విడువవలయును. అనంతర మీ మంత్రము పఠించుచు సూర్యుని నమస్కరించ వలయును.

"జననీ సర్వలోకానాం, సప్తమీసప్త సప్తికే.
సప్తవ్యాహృతికే దేవి, నమస్తే సూర్యమండల!

అని నమస్కరించి శుభవస్త్రములు ధరించి దాన ధర్మ జపాదులు చేసికొనవలయును.

... మా న సి క స్నా న వి ధి. ...

స్నానానంతరము మానసిక పరిశుద్ధి మీ శ్లోకములు పఠింపదగిన దవి హేమాద్రి ధర్మశాస్త్రమున నీ మానసిక స్నానవిధి చెప్పబడి యున్నది, అవసరమున్న వారీ మానసికస్నానవిధిని పఠించుట యుక్తమే.

శ్లో॥ ధ్యాయేత్ పుండరీకాక్షం, చింతయేత్పురుషోత్తమం।
అనంతాదిత్య సంకాశం. వాసుదేవం చతుర్భుజమ్॥ ౧

శ్లో॥ శంఖచక్రగదా పద్మధారిణం, వనమాలినమ్।
ధ్వజవజ్రాం కుశైర్యుక్తం, పాదపద్మం, సునిర్మలమ్। ౨

శ్లో॥ తత్పాదోదకజాం గంగాం, నిపతంతీం స్వమూర్ధని।
చింతయేద్బ్రహ్మ రంధ్రేణ. ప్రవిశంతీం స్వకాంగనమ్ ౩

శ్లో॥ తయాసంక్షాళ. యేత్సర్వమంతర్దేహ గతంమలమ్।
తత్క్షణాద్విరజా మర్త్యోజాయతే స్ఫటికోపమః॥ ౪

శ్లో॥ ఇదంమానసికం స్నానం, ప్రోక్తంహరి హరాదిభిః।
సార్థత్రికోటితీర్థేషు, స్నానాత్కోటి గుణాధికమ్। ౫

శ్లో॥ యోనిత్య మాచరేదేవం, సవైనారాయణస్మృతః।
కాలమృత్యు మతిక్రమ్య, జీవత్యేవన సంశయః॥ ౬

శ్లో॥ ఇడా భాగీరథీగంగా, పింగళా యమునాస్మృతా।
తయోర్మధ్యగతానాడీ, సుషుమ్నాఖ్య సరస్వతీ ౭

శ్లో॥ జ్ఞానహ్రదే ధ్యానజలే, రాగద్వేష మలాపహే।
యస్నాతి మానసేతీర్థే. సయాతి పరమాంగతిమ్॥ ౮

శ్లో॥ అచ్యుతోవా మనంసంతోహం, గోవిందోవా మహంహరిః
ఆనందోహం, మశేషోహం, అజోహమమృతో స్మ్యహమ్॥

శ్లో॥ నిత్యోహం నిర్వికల్పోహం, నిరాకారోహ మవ్యయః।
సచ్చిదానంద రూపోహం, పరిపూర్ణోస్మి సర్వదా। ౧౦

శ్లో॥ బ్రహ్మైవాహం నసంసారి, ముక్తోహమితి భావయేత్,
అశక్నువన్ భావయితుం. వాక్యమేతత్స మభ్యసేత్ ౧౧

శ్లో॥ ఏవంయః ప్రత్యహంస్మృత్వా, మానసంస్నాన మాచరేత్
సదేహాన్తే పరబ్రహ్మపదం, యాతిసంశయః॥ ౧౨

ఇతి హేమాద్రిమాన సస్నానవిధిః

ఈ మానసిక స్నానవిధివలన పరబ్రహ్మ పదవిని పొందగలరని ఫల శ్రుతివలన బోధపడగలదు.

ఈ రీతిని స్నానాదులు నిర్వర్తించినవారై శుభ్రమైన వస్త్రము లను ధరించి సంధ్యావందనాదులు విధిగ నెరవేర్చవలయును.

'ఏవంప్రభావా సాసంధ్యా సర్వపాపప్రణాశినీ' అనగా సర్వపాపములు సంధ్యావందనమువలన నశింపగలవు.

'దీర్ఘాయుషో భవిష్యన్తి' యనియు సంధ్యావందనము త్రికాలముల యందు నాచరించువారు. పూర్ణాయుస్సునుగల్గి చాలాకాలము జీవించ గలరు.

"ఉత్తమా తారకోపేతా" యని, నక్షత్రములుండగనే ప్రాతః కాల సంధ్యావందనము ప్రారంభింపవలయును.

'మధ్యమాలుప్త తారకా' యని, నక్షత్రములు తొలగిన పిదప సూర్యోదయమునకు పూర్వము చేయు సంధ్య మధ్యమఫలితము నొసంగును.

'అధమా సూర్యసహితా' అని, సూర్యోదయానంతరము సంధ్యావందనము చేయుట, నీచఫలితము లిచ్చును.

"కాలే నాచరితా యాస్యాత్సా సంధ్యా ఫలదాయినీ" సకాలములో చేయు సంధ్యావందనము మంచి ఫలములిచ్చును.

'అకాలాచరితా సంధ్యా వంధ్యా నారీవనిష్ఫలా' అకాలములో (సూర్యోదయానంతరము) చేయు సంధ్యావందనము, గొడ్రాలు జీవితమువలె, ఫలహీనము.

'తస్మాత్పూర్యోదయాత్పూర్వం, ప్రాతస్సంధ్యాం సమాచరేత్' కనుక సూర్యోదయానికి ముందే స్నానమొనర్చి ప్రాతఃసంధ్య చేయవలయును.

'అతఏవ ద్విజాతీనాం, సంధ్యా కర్మైవబలవత్తరమ్। బ్రాహ్మణులకు సంధ్యావందనమే, ముఖ్యమైన బలకరము. అనగా శక్తిదాయకము. ఉపనయన ప్రకరణమున సవివరముగ సంధ్యా జపాదులనుగూర్చి చర్చించినాను పరిశీలించునది.

## దేవపూజా విధానాదికము.

స్నానసంధ్యా వందనాద్యనంతరము దేవపూజ చేయుట ధర్మము. శిష్టాచార విధియునున్నది. ఈ పూజావిధులు పలువిధములు. 1 వేద

మంత్రములతో చేయుపూజావిధి. 2 పురాణ మంత్రములతో చేయు పూజా పద్ధతి. 3 తాంత్రికముగ జేయుపూజా పద్ధతులు.

"ధ్యానం పూజా జపశ్చైవ సర్వతంత్రే ష్వయంవిధిః" అను తంత్ర సారవచనానుసారము తమ యిష్టదైవమునుగూర్చి, ధ్యానించడము, ఇష్ట దైవమునుగూర్చి పూజించడము, ఇష్టదైవముయొక్క మంత్రమును జపముచేయడము, అను విధులుండుటచేత పూజావిధానము శాస్త్రకారులు పలువిధములుగ యోగ్యతానుసారము నిర్ణయించి యున్నారు.

"కర్తవ్యా వైదికీ శ్రేష్ఠా" యను విదిననుసరించి, వేదమంత్రములతో చేయుపూజ శ్రేష్ఠమైనది.

'స్మార్తీ స్యాన్మధ్య మోత్తమా" శాస్త్రీయ సూక్తులతో చేయు పూజావిధులు మధ్యమములో నుత్తమము.

'పౌరాణీ మధ్యమాఖ్యాతా' పురాణ మంత్రములతో చేయుపూజ మధ్యమము.

'తాంత్రికీ త్వవరాస్మృతా' తాంత్రికముగ చేయు పూజావిధులు అధమము.

'దైశీచ కాలీ, జాతీయాశనిష్ఠా స్యాదుపాసనా' అనురీతిని, దేశభాషలలోని మంత్రములతో చేయుపూజలు, కాలాని తగినట్లు చేయుపూజా విధులు, జాతీయాది విధులు, తక్కువ ఫలదాయకములుగ గ్రహింతురు.

కాన, వేదమంత్రములు పూజ, స్మార్తమంత్రములపూజ, పురాణ మంత్రములపూజ, తాంత్రిక పూజ, దేశీయాది మంత్రములతో చేయు పూజలు, అని స్థూలముగ, నయిదు భేదములగుచున్నది. మరియు

కాలానుసారముగ నేపటములంటే నా పటములను గాని నా విగ్రహముల నంటె నా విగ్రహములనుగాని చూచి నమస్కరించడముగాని పూజించడముగాని, వాడుకయగుచున్నది. ఏ పద్ధతినైతే నా పద్ధతిలో పూజించడముగూడ జరుగుచున్నది. కానీ తమ పెద్దలు పూజించిన రీతిని పూజా విధులు జరుపుట మంచిదని తొలుతనే మనవి జేసియున్నాను. లేని పోని క్రొత్త విధులెప్పటికిని నంతమంచి నివ్వకపోవడమేగాక లేనిపోని బాధలకుగూడ దారి తీయవచ్చును. గాన పూజ విధులు బాగా [illegible]గి నాచరించడము, మంచిది.

„మంత్రంతు జీవత్ప్రోక్తః
ప్రతిమాద్యం శరీరవత్"

అను రీతిని పూజావిధులలో చెప్పిన మంత్రములు బాగుగ నేర్చి నా మంత్రములతో పూజించిన. నా పూజ శక్తివంతమగును. మంత్రము ప్రాణము, విగ్రహము శరీరమువంటిది గాన ప్రాణస్థానమైన మంత్రము పూజకు ముఖ్యము. మంత్రము చక్కగ చెప్పనిపూజ నిరర్థకము.

ఏదో పూజముఖ్యమని యిష్టానుసారము గవిగ్రహాదులను పెట్టి పూజించరాదు. ఎందుకనగా „భూమౌ చైవ కృతా పూజా, పుత్రాయుర్ధన నాశినీ" యను విధిచొప్పున. పీటలు వగైరా క్రింద నేమియులేక నే విగ్రహాదులు భూమిమీదనుంచి పూజించినచో, నా పూజ యెంత మంత్రము చెప్పినంత బాగుగ చేసిన ఫలించదు. పుత్రులు ధనము, ఆయుస్సును హరించగలదు. కాన, భూమిమీద విగ్రహాదులను పూజించ రాదు. గనుక „దశాంగుళ ప్రమాణాని, త్ర్యంగుల మయుప్రవః" అనులాగున, పదియంగుళ యెత్తుగాని, పదునైదు అంగుళముల యెత్తుగం పీటమీదనే విగ్రహాదులనుంచి పూజించవలయును. భగ్నాంచ ప్రతిమాల నార్చయేత్" యనురీతిని విరిగిపోయిన. విగ్రహములు, పగిలినపటములు,

మొదలైనవియుంచి పూజలు చేయరాదు. కనుకనే పూజావిధులు యిష్టమొచ్చినరీతిని జేయరాదని పెద్దలు చెప్పుదురు. వారి వారి యోగ్యతానుసారము, కాలానుసారము, శక్త్యానుసారము. పెద్దలూహించి వారి వారికి తగిన పూజావిధులు చెప్పుచుందురు.

ఇంగితాకార చేష్టాచ
విదూరః కృతదుర్జనః
అంతర్ముఖః బహిర్దృష్టిః
సర్వజ్ఞో దేశ కాలవిత్ ॥

అను ధర్మానుసారము మహనీయులు కొందరుందురు. ఇంగితాకార చేష్టల నెరుంగువారు అనగా ఏ యే వ్యక్తి ఎట్టివాడో, వాని, వాలకమును బట్టి నెరుంగుట ఇంగితాకార చేష్టయందురు. అట్లు గుర్తించు వారు పెద్దలు, దుర్జనులను శతనివ్వక దూరముగనుందురు, మానసికముగ సర్వకాల సర్వావస్థలయందును, దైవచింత, ధర్మచింత, పారమార్థికచింత తోనుండుట అంతర్ముఖత్వము మూలము.

బహిర్దృష్టి–అనగా, పైకి నలువురిలో తిరుగుతు నలువురికి తోచిన సలహాలిచ్చుకొనుచు, ధర్మమార్గానికి, వ్యతిరేకముకాని రీతిని ప్రపంచమున నలువురితో కలిసిమెలసి తిరుగుటకు, బహిర్దృష్టియందురు. మహనీయులైన వేదశాస్త్రవేత్తలు. అంతర్ముఖులుగను, బహిర్దృష్టి గలిగినవారు గనునుండి దేశమును కాలమును, అధికారిని. అనధికారిని గుర్తించి మెలంగుచుందురు. ఇట్టి మహనీయులనే సర్వజ్ఞులని పెద్దలు గుర్తించగల్గుదురు. ఈ పెద్దల సహాయమున తమకు తగిన పూజాదివిధుల నెరింగి ప్రవర్తించుట యుక్తము.

విప్రులకు యంత్రములు, విగ్రహములు వగైరాల పూజల కన్నా నిత్యము శాలగ్రామపూజచేసికొనుట యుక్తము. విప్రులు కానివారలకు విగ్రహములు, యంత్రములు పటములు వగైరా పూజలు ఫలించగలవు. బ్రాహ్మణులకు మాత్రము శాలగ్రామ పూజకు మించి యితర యంత్ర పటాది పూజలంతగా ఫలించవు. బ్రాహ్మణులు కాని యితరులు వైశ్య, క్షత్రియ, శూద్రాదులకు గాని బ్రాహ్మణులలో స్త్రీలకుగాని ఇతరులైన స్త్రీలకుగాని శాలగ్రామ పూజ దోషమిచ్చును. గుణమివ్వదు గాన యంత్రములు, చిత్రములు విగ్రహములు పెట్టి పూజించవలయును

"నకదాచిత్ స్త్రియాం కార్యం శాలిగ్రామస్యపూజనం
భర్తృదీనాధసుభగా సర్వలోకహితైషయా.

అను ధర్మము ప్రకారము భర్త సుఖముగ నుండవలయుననిచో సౌభాగ్యవతిగ మెలంగవలెననిచో స్త్రీలు శాలగ్రామపూజచేయరాదు.

"మోహాత్ స్పృశేతమహిళా, జన్మశీలాగుణాన్వితా
హిత్వాపుణ్య సమూహాన్తు సత్వరం నరకంవ్రజేత్.

అను ధర్మము ప్రకారము స్త్రీలు మోహబుద్ధితో శాగ్రమములను తాకినచో వారి పూర్వ పుణ్యములెల్ల నశించి నరకప్రాప్తికి చేరుదురు గాన స్త్రీలు శాలగ్రామములను తాకనుగూడ తాకరాదు. ఇందు స్త్రీలు అనగా బ్రాహ్మణులు మొదలు అన్ని కులాలస్త్రీలు అనియర్థము.

ఆయుస్సు, ధనము, సుఖము, కుటుంబవృద్ధికొరకు ప్రతి మానవుడు భగవంతుని పూజించవలయును.

దాన, శీల క్షమావీర్యధ్యాన ప్రజ్ఞాబలానిచ
ఉపాయః ప్రణిధిః జ్ఞానం దశబుద్ధి బలానిచ

అని మానవుడు. భగవదను గ్రహముచే, యీ చెప్పబడు పది విధములైన బుద్ధి బలములు సంపాదించు శక్తి బడయవలయును.

(1) దానము — తనకున్నంతలో యాచకులకు. సమర్పించు వితరణకు దానమని పేరు, యథాశక్తిని దానముచేయు బుద్ధినలవరచు కొనవలయును,

(2) శీలము - మంచినడవడక, లోకమున నితరులకు బాధలేని రీతిని, దైవికముగ. శక్తిని బడయు రీతిని. అనగా ఇహపరసుఖ సాధన మునకనువైన, నడవడికి నలవలపడివర చుకొను బుద్ధిని పొందవలయును

(3) క్షమా - ఓర్పు - ఏకార్యమునకను తొందరబడక, ఆవేశబడక, ఓర్పుతో పనులు సాధించు బుద్ధిని బడయవలయును.

(4) వీర్యము - పరాక్రమము ధైర్యముతోనే కార్యమునేని సాధించుశక్తిని సంపాదించుకొన వగును.

(5) ధ్యానము - భగవంతుని, నిశ్చలమైన బుద్ధితో, ప్రశాంత మైన బుద్ధితో, నిష్కల్మషముగ ధ్యానించు బుద్ధిని సాధించవలయును.

(6) ప్రజ్ఞా - అప్పటి కప్పుడు, బుద్ధిలోగల్గు ఊహాలను ప్రజ్ఞా యని పేరు; "నవనవోన్మేషః ప్రజ్ఞా" యనిశాస్త్రము. అనగా ఏవిధమైన తడవుకొనక వెంటనే బుద్ధిలో తోచబడుశక్తికి ప్రజ్ఞా దీనికే ప్రతిభ యనియు వ్యవహారము, "ప్రతిభ దైవదత్తము" అను విధ్రప్రకారము. ఈ ప్రజ్ఞాశక్తి దైవబలమునుబట్టి వారివారి జన్మాంతరీయ సుకృత విశే షముచే నలవడును. ఉపాసనా బలమున, తపోబలమున, తీర్థయాత్రా దులు మహాక్షేత్ర సందర్శనాదుల చేతను నీ ప్రతిభ వృద్ధియగును.

(7) బలము - బుద్ధిబలము శరీర బలము అనిబలము ద్వివిధము. బుద్ధిబలముచె నెంతటి ఘనకార్యమునేని, వవలీలగ సాధింపవచ్చునుగాన బుద్ధిబలము సాధింపనగును.

(8) ఉపాయము - సులభముగ నేకార్యమునేని సాధించు యూహాయుపాయమందురు. ఉపాయమె త ఘనకార్యమునేని సునాయాస ముగ సాధింప నలవగును.

(9) ప్రనిధి - ప్రార్థనకు ప్రనిధి యందురు భగవంతుని ఏకాగ్ర మనముగను, నిశ్చలముగను, నిత్యముప్రార్థించు బుద్ధిశక్తిని యలవరచు కొనవలయును.

